ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)

6-12 జూన్ 1986
శ్రీ అక్షయ నామ సం వైశాఖ బ చతుర్దశి
సంపుటము 78 : సంచిక 39
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు. 2-50
పోస్టులో 6నెలల చందా రు. 71.50
పోస్టులో 12నెలల చందా రు. 143.00

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధినగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



# డాక్టర్ కె. ఎల్. రావు అస్తమయం

ప్రపంచ ప్రఖ్యాతిని అందుకున్న ఇంజనీరు, కేంద్ర మాజీ మంత్రి డాక్టర్ కె. ఎల్. రావు (84) మే 18వ తేది తెల్లవారుజామున హైదరాబాదులో మరణించారు. గత కొన్ని నెలలుగా అస్వస్థులుగా ఉన్న ఈయన నిద్రలోనే తమ అంతిమ శ్వాస విడిచారు.

కె. ఎల్. రావుగా అందరికీ తెలిసిన శ్రీ కానూరు లక్ష్మణరావుగారు కృష్ణాజిల్లా కంకిపాడులో జన్మించారు.

మదరాసులో ఇంజనీరింగ్ చదివి గిండీ ఇంజనీరింగ్ కళాశాలనించి ఎం.ఎస్. సి. (ఇంజనీరింగ్) డిగ్రీ తీసుకున్నారు. బర్మింగ్‌హాం విశ్వవిద్యాలయం నించి ఇంజనీరింగ్‌లో పి.హెచ్. డి. పొందారు. ఇంగ్లాండు లోని లఫ్‌బరి కాలేజిలో సీనియర్ లెక్చరర్‌గా పని చేసారు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత 1946లో ఇంగ్లాండు నించి తిరిగి వచ్చారు అప్పటి మదరాసు రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎస్ రామమూర్తి శ్రీ రావుగారికి ప్రభుత్వ ఇంజనీరుగా ఉద్యోగం ఇచ్చారు

1950లో కేంద్ర జల విద్యుత్ మండలి డైరెక్టరుగా నియమితులైన శ్రీ రావు ఆ పదవీకాలం పూర్తయిన తరువాత నుంచి దాని సభ్యులుగా కొనసాగారు

ఒక్క భాక్రానంగల్ ప్రాజెక్టును మినహాయిస్తే దేశంలో అన్ని భారీ, మధ్య తరహా ప్రాజెక్టుల నిర్మాణంలో శ్రీ కె ఎల్ రావుగారి పాత్ర ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఉన్నది, నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణంలో శ్రీ రావు ప్రముఖ పాత్ర వహించారు

శ్రీ రావు రాసిన గ్రంథాలు కొన్ని ఇప్పటికే సివిల్ ఇంజనీరింగ్ విద్యార్థులకు పాఠ్య పుస్తకాలుగా ఉన్నాయి కొన్ని పుస్తకాలను ప్రపంచ వ్యాప్తంగా ఇంజనీరింగ్ విద్యార్థులు అధ్యయనం చేస్తున్నారు

అంతే గాకుండా ఆయన మూడు వందలకు పైగా పరిశోధనా వ్యాసాలను ప్రసంగ పాఠాలను రచించారు

1960లో ఆయనకు ఆంధ్ర విశ్వ విద్యాలయం డాక్టరేట్ ఆఫ్ ఇంజనీర్స్ గౌరవ పట్టాను ప్రదానం చేసింది

1962లో విజయవాడ పార్లమెంటరీ నియోజకవర్గం నుంచి లోకసభకు ఎన్నికైన శ్రీ రావు 1963 నుంచి 1973 వరకు నీటిపారుదల విద్యుచ్ఛక్తి శాఖ మంత్రిగా పని చేసారు



శ్రీ రావు ఇంజనీరుగా ప్రదర్శించిన ప్రతిభకు అనేక జాతీయ, అంతర్జాతీయ అవార్డులను అందుకున్నారు

1963లో పద్మభూషణ్ అవార్డును పొందారు శ్రీ రావు ఇంజనీరుగా చేసిన విశిష్ట సేవలకు గుర్తింపుగా ఆయనకు మూడుసార్లు రాష్ట్రపతి అవార్డులు లభించాయి

అంతే గాకుండా శ్రీ రావు యునైటెడ్ నేషన్స్ కమిటీ ఆన్ నేచురల్ రిసోర్సెస్‌కు ఛైర్మన్‌గా, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీర్సుకు అధ్యక్షులుగా, కేంద్ర జల విద్యుత్ మండలి ఛైర్మన్‌గా అనేక గౌరవ పదవులను నిర్వహించారు

శ్రీ కె ఎల్ రావుగారికి భార్య, ఇద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు ఉన్నారు ఆయన మరణంతో దేశం ఒక గొప్ప శాస్త్రవేత్తని, ప్రజాసేవా పరాయణుడిని కోల్పోయిందంటే అతిశయోక్తి కాదు

మే 19వ తేదిన హైదరాబాదు నించి విజయవాడ తీసుకు వచ్చిన శ్రీ రావుగారి భౌతిక కాయానికి మంగళ వారం సాయంత్రం కృష్ణానది తీరంలో ప్రభుత్వ లాంఛనాలతో అంత్యక్రియలు జరిగాయి ప్రత్యేకంగా నిర్మించిన వేదికపై ఏర్పాటు చేసిన చితికి డా రావుగారి పెద్దకుమారుడు శ్రీ అశోక్ నిప్పు అంటించారు పలువురు బంధు మిత్రులు, పుర ప్రముఖులు, పౌరులు ఎంతో మంది ఆయనకి తమ నివాళులు అర్పించారు

(ఒ వి)

# సీరియల్
# కాల్‌గర్ల్
## దూరి వెంకటరావు

(గత సంచిక తరువాయి)

మరి కొంతసేపటికి ఒక అందమైన యువతి లోపలకు రాబోతూ గుమ్మం దగ్గరే ఆగిపోయింది

ఆమెను చూసిన వామనరావుకు మతిపోయి నట్లైంది ఆమె అందం ఏమాత్రం చెక్కు చెదరలేదు గుండ్రటి ముఖం, కాటుక దిద్దిన కళ్ళు, చక్కని పలువరస, పిడికిలిలో ఇమిడి పోయేటంత సన్నని నడుము, ఎత్తైన రొమ్ములు, నల్లగా తుమ్మెదలా నిగనిగలాడే వంకుల జుట్టూ, లేత గులాబీ రంగు శరీర చాయ ఆమెలో యవ్వన మింకా బుసలు కొట్టసాగింది

స్కై కలర్ స్పన్ పాలిస్టర్ శారీ, మ్యాచింగ్ బ్లౌజులో దేవకాంతలా కనిపించింది మధుకి

ఆమె సోయగాన్ని కన్నార్పకుండా కొన్ని క్షణాలు చూసి, వచ్చినట్లే వచ్చి అక్కడే ఆగిపోయావేం? అడిగాడు మధు

అతని ప్రశ్నకు వామనరావు వైపు అసహ్యంగా చూస్తూ ఉండబుద్ధి కావడం లేదు సారి పర్ ది ట్రబుల్ గివెన్ టుయు అందామె

ఆమె పలుకులు ఎంతో తియ్యగా వున్నాయి

ఆమె కంఠంతో కోయిలలు శృతి కలిపాయి

ఆమె గొంతు వీణ మీటినట్లుగా వుంది

ఆమె వాడిన ఆంగ్ల బాషా పదాలలో నాగరికత, సంస్కారం, సభ్యత వుట్టిపడు తున్నాయి

వామనరావుపై ఆమెకు గల ద్వేషాన్ని గ్రహించి, పిలిపించింది నేను అన్నాడు మధు

అలాగైతే అతనిని వెళ్ళమని చెప్పండి

ఒరేయ్ వామనరావ్

నేనుంటే దాని కొచ్చిన ఇబ్బందేమిట్రా? ఇంతోటి ఈ పతివ్రతకు

డోంట్ స్పీక్ రాట్ అందామె కోపంగా

అబ్బో చింత చచ్చినా పులుపు చావలేదే ఇంకా ఎందుకే ఈ బెట్టు? నీ బండారం బయట పడింతని బాధ పడుతున్నావా? డోంట్ వర్రీ మరేం పరవాలేదు రా మాకు కావలసిందియ్యి నీకు కావలసింది తీసుకో అన్నాడు వామనరావు

అతడి మాటల తీరు మధు కేమీ నచ్చలేదు ఎంతో బాధని పించాయి

యూ ఈడియట్ మరింత కోపంగా ముందు కొచ్చిందామె

**జరిగిన కథ-1 :** ఒకప్పటి ప్రేమికురాలు సరోజ కాల్‌గర్ల్‌గా ఒక ఫైవ్‌స్టార్ హోటల్లో తటస్థపడింది రవికి ఆమె ఎందుకు కాల్‌గర్ల్‌గా మారిందో ఎంత ఆలోచించినా అంతు పట్టలేదు రవికి వామనరావు, మధు అదే ఫైవ్‌స్టార్ హోటలికి వచ్చి సరోజ అనే అమ్మాయి కావాలని అడుగుతారు. సరోజ ఒకప్పుడు వామనరావు పని చేసే ఆఫీసులోనే పని చేసేది మధు కాల్‌గర్ల్స్ గురించి తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో ఆ హోటల్‌కి వస్తాడు

నా మాట విని నువ్వు కాస్త బయట కెళ్ళరా ప్లీజ్ ' బ్రతిమాలుతున్న దోరణిలో అన్నాడు మధు

సరే, ముందు నీ పనేదో కాని తర్వాత దాని సంగతి నేను తేలుస్తాను ఆమె వైపు తీక్షణంగా చూస్తూ బయటకు వెళ్ళి పోయాడు వామనరావు

కూర్చో' బెడ్ మీద తను కూర్చుంటూ ప్రక్కన స్థలం చూపించాడు మధు

తలుపులు వారగా వేసి, అతని ప్రక్కన కూర్చుంది ఆమె శరీర స్పర్శకు అతని నరాలన్నీ జువ్వు మన్నాయి కొత్త అనుభవం వల్ల గుండె వేగంగా కొట్టుకో సాగింది వళ్ళంతా చెమటలు పట్టింది

కొన్ని క్షణాలు నిశ్శబ్దం

ఆమెతో సంబాషణ ఎలా ప్రారంభించాలో తెలియక మౌనంగా సిగరెట్ కేసు లోంచి సిగరెట్టు తీసి వెలిగించు కున్నాడు అతడి చేతి వేళ్ళ మధ్య సిగరెట్టు వణక సాగింది

అతని ముఖం వైపు, సిగరెట్ వైపు మార్చి మార్చి చూస్తూ, ఎందుకలా వణికి పోతున్నారు" అన్నదామె

ఆమె మాటలలో అవ్యక్తమైన జాలి గోచరిస్తోంది

కాస్త తమాయించుకుంటూ, అబ్బే ఏం లేదు రెండు దమ్ములు గట్టిగా లాగి సిగరెట్ పీకని నులిమి యాష్‌ట్రేలో వేసాడు మధు

అతని పరిస్థితి కామె చిన్నగా నవ్వుకుంది

నీ పేరు అడిగాడు వణుకుతున్న కంఠాన్ని అదుపులోకి తెచ్చుకునేందుకు విశ్వ ప్రయత్నం చేస్తూ

రోజీ తియ్యగా చెప్పిందామె

కిష్టియన్వా

కాదు

మరి ఆ పేరు

హిందువులైతే అలా పెట్టుకో కూడదా?

అది కాదు

నా అసలు పేరు సరోజ, జీవితం ఎప్పుడైతే మారిందో పేరు కూడా మారాలి అందుకే మార్చుకున్నాను

కొంతసేపలా సంబాషణ సాగడంతో కాస్త ధైర్యం వచ్చింది మధుకి

ఇంత అందమైన అమ్మాయివి పెళ్లి చేసుకుని హాయిగా వుండక ఈ రొంపిలో దిగావేం?

ఆ మాటల కామె హర్టయినట్టు బెడ్ మీంచి లేచి, చూడండి మీ రెవరో నాకు తెలీదు మనిద్దరి సంబంధం కొన్ని గంటలు ఈ నాలుగు గోడలు దాటాకా మీ రెవరో? నేనెవరో' అందుచేత నా వ్యక్తిగత విషయాల్లోకి తల దూర్చి నన్ను హింసించడం మీ లాంటి సంస్కారులకు సమంజసం కాదు

నిన్ను ముఖ్యంగా పిలిపించింది నీ గురించి తెలుసుకోవడానికి "

దానివల్ల మీకు చేకూరే ప్రయోజనం?

ఏమీ వుండదనుకో ఐనా కాల్‌గర్ల్స్ ఎవరో, ఎందు కిలాంటి ప్రొఫెషనులో దిగుతారో తెలుసు కోవాలని వుంది

మధు మాటల కామె ముఖంలో రంగులు మారాయి ఒకమారు అతడి వంక తీక్షణంగా చూసి, 'తెలుసుకుని ఏం చేస్తారు? మా బ్రతుకులు బాగు చేస్తారా? మమ్మల్ని వుద్ధరిస్తారా? కాకపోతే సానుభూతితో ఒక కన్నీటి బొట్టు 'విడుస్తారు అంతేనా? అసలు మా బ్రతుకు లిలా మారడానికి కారకులు మీరు కాదా" అందామె

నీ మాటలు వింటూవుంటే మగవాళ్ళ మీద నీకు పట్టరాని ఆగ్రహం వున్నట్టు తెలుస్తోంది ఐతే మగవాళ్ళంతా నువ్వు చిత్రించుకున్న రూపంలో నువ్వాలోచించే దృక్పథంలో వుండరని గ్రహించాలి

'నేనలా అనుకోలేక పోతున్నాను

ఎందుకని?

ఎందుకేమిటి, నా జీవితంలో తారసపడ్డ ప్రతి మగవాడూ నన్ను వంచించాలనే ప్రయత్నించాడు నన్నూ, నా శీలాన్ని దోచుకునేందుకు

తాపత్రయ పడ్డాడు అందులో కొందరు విఫలు లయ్యారు కొందరు కృతకృత్యు లైనందుకు విర్ర వీగారు అందుకే నాకు మగవాళ్ళంటే ఎలర్జీ వాళ్ళ దృష్టిలో స్త్రీ విలాస వస్తువు అవకాశం దొరికితే ఆడుకోవాలను కుంటారే తప్ప ఆరాధించడానికి ప్రయత్నించరు ఆత్మీయత గనపరచడానికి ముందుకు రారు.'

ఎంతో ఆవేశంతో కూడుకున్న ఆమె పలుకులు మధు హృదయాన్ని కదిలించాయి

నేనలాంటి వాడిని కాదు పరాయి స్త్రీతో ఇంత దగ్గర్లో వుండి మాట్లాడటం ఇదే ప్రథమం నిన్ను చూస్తూ వుంటే నీ పట్ల సానుభూతి తప్పా మరో వాంచ కలగటం లేదు నిన్నిక్కడకు పిలిపించింది నీ గురించి తెలుసుకోవడానికి మరో కోరికతో కాదు నన్ను నమ్మి చెప్పాలనిపిస్తే నీ జీవిత గాద వినిపించు లేకపోతే

ఇప్పుడామె హృదయం మధు మాటలకి స్పందించింది మగవాడి పట్ల ప్రప్రథమంగా గౌరవ మేర్పడింది

క్షమించండి మీ మనసుకు బాధ కలిగించాను అన్నది నొచ్చు కుంటున్నట్లుగా

పరవాలేదు అన్నాడు నవ్వుతూ

జీవితంలో ఎదురు దెబ్బలు తిన్న ఏ స్త్రీ నోటంటైనా ఇటువంటి మాటలే వస్తాయి మీరు నా గురించి తెలుసు కోవాలని వుబలాట పడుతున్నారు తప్పకుండా నా కథ వినిపిస్తాను నా అంతరాంతరాల్లో నిక్షిప్తమైన ఆవేదన మనసున్న మనిషికి చెప్పుకున్నా నన్న తృప్తైనా మిగులు తుంది చెమర్చిన కళ్లను వత్తుకుంది సరోజ

ఉండండి కాలింగ్ బెల్ నొక్కాడు

సార్ పరుగున వచ్చాడు బోయ్

ఏం తీసుకుంటావ్? వెట్టా? డ్రయ్యా?

వెట్ అంటే వెగటు పుట్టింది డ్రైతీసుకో బుద్ధి కావడం లేదు

మరైతే ఐస్ క్రీం తీసుకోండి మనసుకు, శరీరానికి వుల్లాసంగా వుంటుంది

సరే మీ ఇష్టం' నవ్విందామె

రెండు ఐస్‌క్రీమ్స్ ఆర్డరు చేసాడు మదు

యస్సార్

బోయ్ వెళ్ళి పోయాకా, "ఇక చెప్పు" అన్నాడు మధు సిగరెట్ కేసు లోంచి మరో సిగరెట్టు తీసుకుంటూ

చెప్పడం ప్రారంభించిందామె

చెవులు రిక్కించి ఆత్రంగా వినసాగాడు మధు–

## 3

ఒక వైపు వాలిపోతూ సగం సిధిలావస్థలో ఉన్న ఆ ఇల్లు లక్ష్మీపతి గారిది వాళ్ళ పేదరికానికి ప్రతిబింబం ఆ చిన్న పెంకుటిల్లు ఒకప్పుడు దర్జాగా బ్రతికిన లక్ష్మీపతి ఇప్పుడు నిస్సహాయుడు జీవితంలో ఎన్నో ఎదురు దెబ్బలు తిని నిబ్బరాన్ని కోల్పోయిన వ్యక్తి వయసులో వుండగానే భార్య గతించడం మొదటి షాక్ కూతురు, కొడుకుల భవిష్యత్తు బాగుండాలని తను రెండో పెళ్లి కూడా చేసుకో లేదు పిల్లలిద్దర్నీ ఎంతో ముద్దుగా పెంచాడు

అమ్మాయి గ్రాడ్యుయే టయింది అతను చేసుకున్న పాప మేమిటో మరి కొడుక్కి చాలా కాలం వరకు మాటలు రాలేదు నాలుగో ఏడొచ్చినా మాటలు రాకపోయేసరికి వాడు మూగవాడనే నిర్ధారణ చేసుకున్నా రంతా ఐతే, ఆ తర్వాత మాట లొచ్చాయి ఊరంత సంబరపడి పోయాడా తండ్రి ఏది ఏమైనా మాట



## కాల్ గర్ల్

స్వచ్ఛత లేదు నత్తి గా పలుకుతూ వుంటాడు పైగా అమాయకుడు కూడా ఇక తన విషయాని కొస్తే తను నాలుగో పదిలో పడేసరికి టి బి ప్రవేశించింది దాంతో ఉన్న ఉద్యోగం వూడింది క్రమేపి రోగం ముదిరి మంచం పట్టాడు ఆ తరువాత ఇల్లు గడవడమే గగనమై పోయింది బి ఎ వరకు చదివిన సరోజ ఉద్యోగం కోసం వేట ప్రారంభించింది ఇది వాళ్ళ కుటుంబ పరిస్థితి

మంచం మిద పడుకున్న లక్ష్మిపతికి ఎడతెరిపి లేకుండా దగ్గొచ్చింది తెగని ఆ దగ్గుతో విలవిలలాడి పోయాడు

కొంత సేపటికి లేచి కూర్చుని ప్రక్కనే బల్ల మిద వున్న కూజాలోంచి గ్లాసుడు నీళ్ళు వంపుకుని త్రాగాడు దాంతో దగ్గు కాస్త సద్దుమణిగింది బరువుగా శ్వాశ తీసుకుంటూ చంద్రం అని కేక వేసాడు

ప వ వ వస్తున్నా

ఏం చేస్తున్నావురా?

అక్క వస్తే బి బి .బి బియ్యం తెస్తుందని కు కు కుంపటి అంటిస్తున్నాను నాన్నా

అదెప్పు డొస్తుందో ఇప్పటి నుండి కుంప టిందుకురా అంటించడం? రొప్పుతూ అన్నాడు లక్ష్మిపతి

ఐతే, ఆ ఆ ఆర్పిమంటావా? తండ్రి ముఖంలోకి జాలిగా చూసాడు చంద్రం

ఊఁ!

వెళ్ళిపోయాడు చంద్రం

లక్ష్మిపతి మళ్ళీ పడుకుని గట్టిగా కళ్ళు మూసుకున్నాడు అతనికి మెలకువ వున్నంతసేపూ పట్టు విడిలిస్తే రేగిన తేనెటీగల్లా ఆలోచనలు ముసురు కుంటాయి అందుకే రోజూ ఎక్కువ సేపు నిద్ర పోవడానికి ప్రయత్నిస్తాడు

పాడు దగ్గు నిక్షేపం లాంటి నిద్రను పాడు చేసింది' అని తిట్టుకుంటూ, ఒరేయ్ చంద్రం అమ్మాయి యింకా రాలేదు ఉద్యోగం కోసం ఎక్కడెక్కడ తిరుగుతున్నదో ఏమిటో వెర్రితల్లి బయట కెళ్ళి చూడు '

అదుగో నాన్నా మ మ మాటల్లోనే వచ్చేసింది

హమ్మయ్య మళ్ళీ మంచం మిద నడుం వాల్చాడు లక్ష్మిపతి

సరోజ ఆదుర్దాగా లోపల కొస్తూ, ఎలా వుంది నాన్నా?' రండి డాక్టరు గారూ రండి అతని చేతిలోని మెడికల్ కిట్ అందుకుంది

అమ్మా సరోజా వచ్చావా? మళ్ళా దగ్గడం ప్రారంభించాడు లక్ష్మిపతి తెగని ఆ దగ్గుతో అతని పేగులు ఆర్చుకు పోతున్నాయి

వచ్చాను నాన్నా డాక్టరు గారిని కూడా తీసుకొచ్చాను. నీకేం బయం




లేదు పడుకున్న తండ్రిని లేవదీసి కూర్చో బెట్టింది సరోజ

నమస్కారం డాక్టరు గారూ' రెండు చేతులూ జోడించాడు లక్ష్మిపతి

డాక్టర్ అతని వంక సానుభూతిగా చూస్తూ పడుకోండి' అని చెప్పి, సరోజా! వేడినీళ్ళు పట్టుకురా ఇంజక్షను చేయాలి అంటూ మెడికల్ కిట్టు విప్పాడు

డాక్టరు గారూ! మి రెన్ని మందు లిచ్చినా ఈ మాయరోగం తగ్గేది కాదు రోజూ సూదుల్తో శరీర మంతా చిల్లులు చేసి నన్నెందుకు చంపుతారు? నన్నిలాగే ప్రశాంతంగా కన్ను మూయనివ్వండి' లక్ష్మిపతి మాటలలో వైరాగ్యం, నైరాశ్యం మిళితమై వున్నాయి

మికేం భయం లేదు లక్ష్మిపతి గారూ, మి జబ్బు తగ్గు ముఖం పట్టింది మరి కొద్ది రోజులు మందు పుచ్చుకుంటే పూర్తిగా నయమై పోతుంది "

డాక్టరు మాటలకి పేలవంగా నవ్వాడు లక్ష్మిపతి రోగి ఎంత సీరియస్ అయినా డాక్టర్లు అలాగే అంటూ వుంటారని అతనికి తెలుసు అంతలోనే మళ్ళీ దగ్గు అతనిని చుట్టు ముట్టింది కడుపులో ప్రేగులన్నీ లుంగ చుట్టుకు పోతున్నాయి'

వెంటనే డాక్టరేదో మందు స్పూనుతో తాగించాడు దాంతో కాస్త ఉపశమనం కలిగింది లక్ష్మిపతికి

డాక్టర్, మీకు పుణ్య ముంటుంది నేనీ బాధ భరించ లేకుండా వున్నాను దయచేసి శాశ్వతంగా నిద్ర పోవడాని కేదైనా మందుంటే ఇవ్వండి రెండు చేతులు జోడిస్తూ అన్నాడు లక్ష్మిపతి

అతని మాటలు వింటూ వుంటే డాక్టర్ హృదయం వెన్నలా కరిగి పోయింది

అలా అనకండి లక్ష్మిపతి గారూ, మిమ్మల్ని రక్షించు కోవాలని అమ్మాయి ఎంత తాపత్రయ పడుతోందో చూడండి మీరు లేకుంటే ఆమె బ్రతకటం కష్టం ఇలాంటి మాటలు నా దగ్గరంటే అన్నారు గాని అమ్మాయితో మాత్రం అనకండి స్టెతస్కోపుతో అతని గుండె పరీక్షిస్తూ అన్నాడు డాక్టరు

'నేనున్నంత కాలం దానికి సుఖం లేదు ఈ రోగిష్టి తండ్రి దానికేమి చేయలేదు పైపెచ్చు భారం కూడా అవుతున్నాను

అవేం మాటలండి, తండ్రికి బిడ్డా, పిల్లకు తండ్రి భారమౌతారా? మి ఫామిలీ డాక్టరుగా మి నుండి ఇటువంటి మాటలు వినవలసి వస్తున్నందుకు నాకు చాలా బాధగా వుంది '

నేననే దాంట్లో తప్పేముంది డాక్టర్ హాయిగా పెళ్ళి చేసుకుని తృళ్ళుతూ, గెంతుతూ గడిపే ఈ వయసులో అహర్నిశలూ తండ్రిని గురించి బెంగ పెట్టుకుంటూ చిక్కి శల్యమై పోతోంది

మీరిలా అనుక్షణం కృంగిపోతూ వుంటే మీ జబ్బు నయమవడం కష్టం కాస్త ధైర్యంగా వుండండి పరిస్థితులు వాటంతటవే చక్కబడుతాయి '

సరోజ వేడి నీళ్ళు పట్టుకు రావడంతో వారి సంబాషణ అక్కడితో ఆగి పోయింది

డాక్టరు సిరంజి స్టెరిలైజ్ చేసి మందెక్కించి ఇంజక్షన్ చేసాడు

డాక్టరుగారూ! మా నాన్న కెలా వుంది త త తగ్గిపోతుందా? అమాయకంగా అడిగాడు చంద్రం

ఎందుకు తగ్గదు నాయనా తప్పకుండా తగ్గి పోతుంది నువ్వేమి బెంగ పెట్టుకోకు అన్నాడు వాడి నూరడిస్తూ

'ఈ మందులు మూడు పూటలా వెయ్యి ' స్లిప్ రాసి సరోజ కిచ్చాడు డాక్టర్

ప్రిస్క్రిప్షన్ కాగితం అందుకుంది సరోజ

మరినేను వెళ్ళొస్తాను లక్ష్మిపతి గారూ

డాక్టర్ని గుమ్మం వరకు సాగనంపి వచ్చిన సరోజను పిలిచాడు లక్ష్మిపతి

ఇంజక్షన్ తీసుకున్నాకా దగ్గు, ఆయాసం తగ్గింది

సరోజ తండ్రి ప్రక్కనే మంచం దగ్గర స్టూలు వేసుకుని కూర్చుంది

వెళ్ళిన పని ఏమైందమ్మా?' అనునయంగా అడిగాడు లక్ష్మిపతి

తండ్రి ప్రశ్నకు జవాబు ఏం చెప్పాలో తెలియ లేదు సరోజకు ఓ క్షణం వూరుకని "ఉద్యోగం కోసం అన్ని చోట్లా అప్లికేషన్లు ఇచ్చి వచ్చాను' అంది

"నీ కీ వయసులో ఎన్ని బాధలొచ్చి పడ్డాయి తల్లీ పోనీ నేనెక్కడికైనా వెళ్ళి నాలుగు రూపాయలు తెద్దామన్నా లేవనీయకుండా ఈ మంచం మీదక



# ఆంధ్రపత్రిక సంస్థ నుంచి మరో ఆణిముత్యం

## నవ వనితా సచిత్ర పక్షపత్రిక

★ అభ్యుదయానికి మనోవికాసానికి, లలితమైన వినోదానికి దర్పణాలైన వ్యాసాలు. చర్చలు.

★ కాలక్షేపానికి రకరకాల హాబీలు, గృహాలంకరణలు తెలిపే శీర్షికలు.

★ బొమ్మల కథలు, కమ్మని కథలు వాటికి తీరైన బొమ్మలు.

★ ఒక పూర్తి నవల + 2 సీరియల్స్.

★ పొదుపుకు, సదుపాయానికి అవసరమైన చిట్కాలు, రకరకాల వంటలు; వంటలకి ఉత్తరాలకి అల్లికలు, డిజైనులు, కవితలు, గేయాలు, రాశిఫలం కూడా ... బహుమతులు అన్నీ రంగులు హంగులు కలబోసిన అందమైన హరివిల్లు!

★ ఆధునిక మహిళల ఏకైక పక్షపత్రిక. అందరూ చదువతగిన సచిత్ర పత్రిక వెల : 2-50

వివరాలకు :

'కలువబాల' కేరాఫ్ ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 3.

విడిప్రతి వెల : రు. 2.50

**చందా వివరాలు**

| | ఏజెంట్ ద్వారా | | పోస్ట్ ద్వారా |
|---|---|---|---|
| 3 నెలలకు | రు. 15-00 | - | 15-90 |
| 6 నెలలకు | రు. 30-00 | - | 31-80 |
| సంవత్సర చందా | రు. 50-00 | - | 50-00 |

సంవత్సర చందా ఒకేసారి ఆఫీసుకు చెల్లించండి.

CHALAM



# గడుసులోకం

—బాబు







## కాల్ గర్ల్

తోసేసాడు ఆ దేవుడు '

తండ్రి మాటలకు విలవిల లాడిపోయింది సరోజ

మీరేం దిగులు పడకండి నాకు తప్పకుండా ఏదో ఒక ఉద్యోగ మొస్తుంది త్వరలోనే మన కష్టాలు గట్టెక్కి పోతాయి మన రోజు లెప్పుడూ ఇలాగే వుండిపోవు "

కూతురు మాటలకి కాస్త ఊరట చెంది, సరేలేమ్మా, నేనూ ఆ ఆశతోనే వున్నాను " అంటూ మంచం మీద వాలిపోయాడు లక్ష్మీపతి మందు ప్రబావమో ఏమో, వెంటనే మగతగా నిద్ర పట్టింది

'అక్కా!' దీనంగా పిలిచాడు చంద్రం

ఆప్యాయంగా తమ్ముణ్ణి దగ్గరకు తీసుకుంది సరోజ

నువ్వొస్తే బి బి బియ్యం తెస్తావని కు కు కుంపటంటిస్తే నాన్న ఆర్పి మన్నారు వంట చేయవా, అక్కా

చంద్రం మాటలు వింటుంటే సరోజకు ఏడుపొచ్చింది

'ఈ పూటకి మంచి నీళ్ళు త్రాగు, రాత్రి కెలాగైనా బియ్యం పట్టు కొచ్చి వండుతాన్లే' అంది పొంగు కొస్తున్న దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ

రాత్రి కూడా అన్నం తినలేదు ఆ ఆ ఆకలౌతోంది

చంద్రం మాటలకి మంచులా ద్రవించుకుపోయిందామె హృదయం

గ్లాసుడు నీళ్ళు త్రాగు బాబూ, అదే తగ్గి పోతుంది అడగడం మరచి పోయాను నువ్వీ రోజు బడి కెందు కెళ్ళ లేదు? మాట మార్చింది సరోజ

'ఇవాల్టి నుండి బడి కెళ్ళను

'ఏం? తమ్ముడి వంక అయోమయంగా చూసింది సరోజ

మరి నువ్వు బ బ బయటకు వెళ్ళిపోతే నాన్న నెవరు చూస్తారు? మ మ మందెవరిస్తారు? అందుకని నేను ఇ ఇ ఇంటి దగ్గరే వుండి పోతాను

చంద్రం మాటలకి నవ్వాలో ఏడ్వాలో తెలీక వాడి మొహం ముద్దులతో " నింపేసింది

ఇప్పటి నుండి బడి మానేసి ఇంట్లో కూర్చుంటే నువ్వెందుకు పని కొస్తావురా? ప్రేమగా వాడి తల నిమురుతూ అంది సరోజ

నా గురించి బెంగపడకక్కా, రాత్రిళ్ళు నీ దగ్గర ప ప. పాఠాలు నేర్చుకుంటాన్లే!

ఆ మాటల కామె కడుపు తరుక్కు పోయినట్లైంది మరేమి మాట్లాడ లేక వాడిని మరింత దగ్గరగా తీసుకుని నుదురుమీద చుంబించింది

రవిగారు నీ కోసం వచ్చారు 'నువ్వు లేవని చెప్తే సాయంత్రం తప్పక తనను క క కలుసుకోమన్నారు పనేదో వుందట అన్నాడు చంద్రం.

అలాగే నువ్వెళ్ళి చదువుకో!

ఆమె మాట ప్రకారం చంద్రం పుస్తకం తీసి ఏదో వ్రాసుకోవడం మొదలు పెట్టాడు

సరోజ రవిని గురించి ఆలోచించడం ప్రారంబించింది తనకు రవి అంటే ఇష్టం అతనికి కూడా తనంటే ప్రాణం తమ పెళ్ళికి ఎవరూ అడ్డు చెప్పేవారు లేరు తను పెళ్లి చేసుకుని రవితో వెళ్లిపోతే నాన్నను చంద్రాన్ని ఎవరు చూస్తారు? ఈమధ్య అతడు పెళ్లి గురించి వొత్తిడి చేస్తున్నాడు బహుశా ఆ విషయం ప్రస్తావించడానికే పిలిపించుంటాడు అతనికేం సమాధానం చెప్పాలి? ఈ మారు పెళ్లి గురించి తొందర పెడితే మరొకరిని వివాహం చేసుకోమని, తన కోసం నిరీక్షించ వద్దని, వీలైతే మరచి పొమ్మని చెప్పెయాలను కుంది ఈ పరిస్థితులలో ఆమె ఇంతకంటె ఏమి చేయలేదు తన స్వార్థం కోసం తండ్రిని, తోడబుట్టిన వాడిని గాలికి వదలేయలేదు తన వాళ్ళ కోసం తనీ మాత్రం త్యాగం చేయక తప్పదు ఇలా ఆలోచిస్తూ ఒక నిర్ణయాని కొచ్చినదై ఇంట పనిలో లీనమైంది

## 4

సాయంత్రం ఐదవుతోంది పక్కింటి పిన్నిగారి దగ్గర బియ్యం బదులు పుచ్చుకుని వంట చేసింది సరోజ

చంద్రం ఆడుకోటానికి బయట కెళ్ళాడు

చన్నీళ్ళతో ముఖం కడుక్కుని, చీర మార్చుకుని రవిని కలుసుకోవడం కోసం పార్కు కి బయలు దేరింది

ఆ రోజు వాతావరణ మెంతో మనోజ్ఞంగా వుంది మచ్చుకైనా మబ్బు కనిపించని నింగి లేత నీలి వర్ణంలో నిగనిగ లాడుతోంది పార్కులోని గులాబీ, మల్లె, జాజి, సంపెంగ పువ్వుల పరిమళం సరోజ ముక్కు పుటాలకు చేరడంతో మత్తెక్కినట్లైంది గాలికి రేగుతున్న ముంగురులను సున్నితంగా సవరించుకుంటూ రవి కోసం ఒక రాతి అరుగు మీద చతికిలబడి ఎదురు చూడసాగింది ఆవేళ ఎందుచేతో అట్టే జనం లేరక్కడ ముచ్చటైన జంటలు కొన్ని అక్కడక్కడ ముఖమల్లా వున్న గడ్డి నేల మీద కూర్చుని తియ్యగా ముచ్చటించు కొంటున్నారు పక్షులు కిలకిల మంటూ వారి ఆనందంలో బాగం పంచు కొంటున్నాయి

(ఇంకాఉంది)

# బాలరంజని

జూన్ 1986 సంచిక




ముఖచిత్రం : కాళియమర్దనం

# సినిమా(య)!

నిర్మాత నిర్ఘాంత పోయాడు

దర్శకుడు నమ్మలేక పోయాడు.

కవిగారు కళ్ళు తల వేశారు.

కెమెరామన్ కంగారు పడ్డాడు.

ఒక రేమిటి, సెట్లో ఉన్న అందరూ కళ్ళు నలుపుకుని మరీ చూశారు కలా, నిజమా అని చెయ్యి గిల్లుకుని తమని తాము పరీక్షించుకున్నారు– వాస్తవమా భ్రమా అని

పాటల కవిగారయితే– "రవి పశ్చిమాన ఉదయించ బోతున్నట్లే అనీ, మాటల రచయిత భారత దేశంలో కుల వ్యవస్థ నేటితో అంతరించ బోతూందా' అని అనేసుకున్నారు కూడా– ఆమెని చూస్తూ

ఆమె– మాలిని

మాలిని – సినిమా స్టార్

అగ్రశ్రేణి తార

ఆమె కారాగినా ఆమె వొచ్చింతవుకో లేదు డైరెక్టరు కానీ, కెమెరామన్ కానీ తదితరులు కానీ ఎందుకంటే– అప్పటికి– రైలు వొచ్చే రైటు టైములాగ– షూటింగ్కి సరయిన ప్రారంభ సమయం మాత్రమే అయింది. నిజంగా సమయానికి వొచ్చిన రైలుని విన్నటి దనుకున్నట్లే– నిజంగా సమయానికి షూటింగ్కి వొచ్చిన టాప్ హీరోయిన్ని నమ్మలేరు అదీగాక– కనీసం రెండు గంటలేనా లేటు చేయకుండా సెట్ మీదకి రావటం మాలిని చరిత్ర లో నే లేదు

ఇవాళ . యిప్పుడు మాత్రం ఆమె– సరిగ్గా సమయానికి ఇంకా న్యాయంగా చెప్పాలంటే– నిముషం పావు ముందుగా– షూటింగ్కి హాజరయింది! అందుకే డైరెక్టరు నుంచి– బోయ్ వరకూ అద్భుతం చూస్తున్నట్లు ఆశ్చర్య– పడిపోవడం

మాలిని చకచక మేకప్ వేయించేసుకుంది నిజానికామె పాత్రకు మేకప్ అక్కే ఉండదు. టాప్ స్టారంటే టాప్లెస్ కదా. వస్త్ర విసర్జనే మేకప్లో ముఖ్య ఘట్టం

లైట్లు కెమెరా సిద్ధమై పోయాయి

రైటరు– ఆమెకు– డైలాగు వినిపించేశాడు.

ఇదిదా– భర్త పోయిన సినమ్మా మీరు ఏడవాలి అన్నాడు డైరెక్టరు అతివినయంగా

భర్త! భర్తంటే? కంగారుపడిపోగే చూసింది మేకప్ మాలిని.

ఓహో తమకు... [illegible]. . మరొకలాగ చెబ్దును . అ... మీకుడా కుక్క ఉండెను కదా అది చనిపోయెను కదా ఒక్కసారి జ్ఞాపకం దా తెచ్చుకొండమ్మా ఆ కుక్క పోయినప్పు డేడిచారే మా అందరి గుండెలూ కరిగేలా అందమాదిరి ఏడవ వలె '

ఛర్రున లేచింది మాలిని నా కుక్కని భర్తతో పోలుస్తావా! ఎంత అవమానమ్ దాని ఆత్మ ఎంత ఘోషించును దీనికి!"

డైరెక్టరు దణ్ణం పెట్టేశాడు రొంబ నేరమయిందమ్మా . క్షమించండి అందమాదిరికని చెప్పితి ప్లీజ్ ఏడవండమ్మా "

మాలిని ఏడిచింది– అసిస్టెంట్ డైరెక్టరు ఆమె కళ్ళలో గ్లిసరిన్ వేశాక శవం లాటి మనిషి మీదపడి . టాప్లెస్గా అతని మీదకు వొంగి నిముషం పాటేడిచింది– డైలాగులు చెబుతూ ఆమె నగ్న వక్షాన్ని బాగా ఎక్స్ప్లాయిట్ చేసి– ఎక్స్పోజ్ చేయగలిగి నందుకు– ఆ యాంగిల్స్కి తెగ సంబర పడి పోయాడు కెమరామన్ టేకులు తినకుండా– స్ట్రైయిట్గా ఓ కె అయిపోయిందా షాట్

ముష్టివాడికిముష్టి వేసినా పిల్లవాడికి బువ్వపెట్టినా ఏం చేసినా ఆమె ధ్యేయమూ సినిమా తీసేవాళ్ల ధ్యేయమూ ఆమె శరీరాన్ని ప్రదర్శించడమే కనుక - ఆమె అలా టాప్లెస్ షాట్స్ మరి రెండు పూర్తి చేసింది కథ బట్టి హీరోయిన్కి పాలు తాగే పసిపాప కూడా ఉన్నట్లుంది ఆ షాట్కి తయారు చేస్తున్నారు సెట్ని

ఆమె వాలకం చూసి పడకగది సీను కాబోలనుకున్నాడు కొత్తగా ఓ సినిమా పత్రికకి విలేఖరిగా చేరిన ఆ అబ్బాయి.

"స్టార్ట్' చెప్పాడు డైరెక్టరు

లైట్లు వెలిగాయి సెట్ మీద చిన్న గది నేలమీద చాప పరచి ఉంది. హీరోయిన్ మాలిని చిన్న బికినీలాటిది మాత్రమే వేసుకుని శృంగారం వొలకబోసేస్తూ - ఆ గదిలోకి వొచ్చింది గోచి మాత్రురాలయిన ఆమె సౌందర్యంతో ప్రేక్షకులకు విందు చేసి - అప్పుడు - ఊయల వేపు తిరిగింది ఊయలలో ఏడుస్తున్న పసి పాపను తీసి ఎత్తుకుంది

'కట్ ' అరిచి ఆమె వద్దకు పరుగెత్తాడు డైరెక్టరు 'పసిపాపను అందమాదిరి ఎత్తుకోరు ఇందమాదిరి అంటూ ఆమెకు బిడ్డనెలా ఎత్తుకోవాలో చూపాడు

ఔనుస్మీ హీరోయిన్ యిందాకా ఆ పసివాడిని - హీరోని కౌగిలిలోకి తీసుకున్నట్లుంది కానీ పసివాడిని తల్లిగా ఎత్తుకున్నట్లు లేదు! పిల్లడినెత్తుకోడమే రాని యీ స్త్రీ గురించి మహానటి అని రాయాలి కాబోలు ఆత్మవంచన చేసుకొని ఏం కర్మ వొచ్చిపడింది! అనుకుంటూ షాట్ చూసాగాడు విలేకరి

హీరోయిన్ - ఏడుస్తున్న పసివాడిని - డైరెక్టరు చెప్పినట్లు ఎత్తుకుంది రెండడుగులు వేసి చాప మీద కూర్చుంది పిల్లవాడికి రొమ్ము అందించింది

"కళ్ళు మూసుకో అమ్మా గుర్తు చేసాడు డైరెక్టరు ఆమె - కళ్ళు మూసుకున్నా తెరచినా కళ్లలోనూ వొంట్లోనూ కైపూ కామమే తప్ప కొడుకు పట్ల వాత్సల్యం చచ్చినా ప్రదర్శించబడటంలేదు

ఐనా ఆ షాటూ ఓ కే ఐపోయింది రెండో టేకులోనే నిర్మాత, దర్శకుల తొందరికి కారణం ఉంది మాలిని కాల్షిట్లు సాధారణంగా దొరకవు పనసకాయ దొరికినప్పుడే తద్దినం, మాలిని దొరికినప్పుడే షూటింగూ పెట్టేసుకోవాలి వివేకంగా

ఈ షాట్స్ ఎలా వొచ్చాయి? అడిగింది తార

'అదుబుదమ్ (తెలుగు అద్భుతానికరవ పలుకుబడి) అన్నాడు డైరెక్టరు

ఓసారి రషెస్ చూద్దామని ఉంది

ఆవశ్యమ్ దానికేం భాగ్యం? ప్రొడ్యూసర్ వేపు చూశాడు డైరెక్టరు మాలినిలాటి టాప్ (లెస్) స్టార్ రషెస్ చూస్తాననడమే ఆశ్చర్యం

నిర్మాత - ప్రొడక్షన్ రూమ్ వేపుకి పరుగెత్తాడు ఈలోగా మాలినికి కూల్డ్రింక్ విలేకరి యింటర్వ్యూ స్టిల్ ఫోటోగ్రాఫర్ ఫోటోలు తీసుకోవడం అయ్యాయి

విలేఖరి యింకా తలబద్దలు కొట్టుకొంటూనే ఉన్నాడు పసివాడికి పాలివ్వడానికి హీరోయిన్ నిలువెల్లా నగ్నమవడం దేనికా అని దేనిలోనయినా సెక్సే చూబించడం నేటి సినిమా (య) అని అతనికి తెలిసినట్లు లేదింకా

రండి, రండి పిలిచారు నిర్మాత

మినీ థియేటర్లో ఉన్న ఆ హాలులోకి కదిలారంతా - ఆ వేళ - అప్పుడే తీసిన షాట్స్ తాలూకు రషెస్ చూడడానికి

అందరికంటే వెనుక ఆమె కోసమే వేసిన ప్రత్యేకాసనం మీద కూర్చుంది మాలిని ఆమెకటూ యిటూ కాని ఆ వరుసలో కాని ఎవరూ లేరు ఆమె ఒక్కతే

తలుపులు మూసేసారు చీకటి ఒక నిముషం

తెరమీద వెలుగు చిన్న శబ్దం - రీలు తిరుగుతున్నట్లు అంతలో - తెరమీద బొమ్మ మాటలు ధ్వనిలేని - మూకీ చిత్రంలా ' వొట్టి బొమ్మలు

కెమోరామన్ వెర్రిముఖం వేశాడు

డైరెక్టర్కి చెమటలు పట్టేశాయి

నిర్మాత నీరు కారిపోతున్నాడు

అందరికీ ఆశ్చర్యంగా ఉంది తెరమీద -బొమ్మలలో అన్నీ కనపడుతున్నాయి - మాలిని తప్ప -మిగిలిన మిగిలిన పాత్రలు సీను అంతా కనపడుతున్నారు - మాలిని తప్ప ఆవేళ షాట్లన్నీ అలాగే ఉన్నాయి అప్పుడు తీసిన ఐదు షాట్లూ

అంతే మిగిలిన మేరకు మామూలుగా బాగా ఉన్నా మాలిని మాత్రం కనిపించడంలేదు! ఫిలిమ్‌లో ఆ మేర తెల్లని శూన్యం

మళ్ళీ ప్రొజక్టు చేసి చూసినా మార్పులేదు

ఎమిటో మాయలా ఉంది మళ్ళీ తీద్దాం అన్నాడు కెమెరామన్ అందరూ ద్వారంవేపు నడిచారు చివరి వరుసలో మాలిని లేదు! వేసిన తలుపులు వేసినట్టుండగా ఆమె ఏమైపోయిందో ఎవరికీ అర్థంకాలేదు కంగారుగా బయటకు పరుగెత్తారు సెట్స్ వేపు

ఇందాకా ఆగినచోట మాలిని కారు లేదు!

అంతా కలయో వైష్ణవ మాయయో అన్నట్టుందే అని ఆశ్చర్యంతోనూ బయంతోనూ మిగిలిపోయారు దర్శకుడూ, నిర్మాతా

డైరెక్టర్ సార్ మీకు టెలిఫోన్ " అంటూ వొచ్చాడు బోయ్

ఎవరు?'

మాలినమ్మగారు

మాలినా! తెల్లబోతూ - పరుగెత్తి ఫోనందుకున్నాడు టెలిపోన్‌లో అతని 'ఆమె లు తప్ప ఏమి వినపడలేదు నిర్మాతకి అతనికసలే చిరాకుగా ఉంది షాట్స్ తగలబడినందుకు

అదుబుదం మహాదుబుదమ్

మాలినిగారు రాత్రే గట్టిగా అనుకున్నారట రేపటి నుంచి ఎట్టి పరిస్థితులలోనూ షూటింగ్‌కి లేటు కాకూడదనీ, కాల్‌షీట్లు రద్దు చేయకూడదని తీరా యివాళ పొద్దున్న నుంచీ హండ్రెడండ్‌టు టెంపరేచరూ, మంచం దిగలేని స్థితినట క్షమించమని సారి చెప్పారు

మరి వచ్చి - షాట్స్‌లో నటించారుగా' తెల్లబోయాడు నిర్మాత అతని కయోమయంగా ఉంది ఏం జరిగిందో అర్థంకావడంలేదు. మాలినికి బదులు డ్యూప్ రాలేదు కద?

ఇక్కడ షూటింగ్ జరిగినప్పుడు ఆవిడ అక్కడే ఉన్నారు ఆమే చెప్పారు కనుక జరిగిందేమిటంటే ఈ షాట్స్‌లో యాక్ట్ చేసినది నిజం మాలినికాదు ఆమె దెయ్యం దెయ్యం బొమ్మ ఎలిమ్ మీదకెక్కదు అందుకే మిగిలిన అందరూ పడినా ఆమె మేరకు ఆ దెయ్యం మేరకు తెల్లగా మచ్చ మిగిలిపోయింది ఫిలిమ్ మీద -" వివరించాడు డైరెక్టరు తన ప్రతిభను ప్రదర్శిస్తూ

చచ్చిపోకుండా దెయ్యం ఎలా ఔతారు?" పాయింటు తీశాడు నిర్మాత

డబుల్ రోల్సూ - త్రిపాత్రలూ వెయ్యగల సమర్థులు సినీనటులు అదిగాక - దేముడన్నా దెయ్యమన్నా - మనిషి తాలూకు ధృఢ సంకల్పమే మాలినిగారు షూటింగ్‌లకి వేళకి హాజరవాలని చాలా గట్టి నిర్ణయం తీసుకున్నారుట నిన్న రాత్రే ఆదిలోనే హంసపాదా అని మన షూటింగ్‌కి తాను రాలేని పరిస్థితి ఎదురయింది. అందుకని ఆమె దెయ్యం వొచ్చింది ఇలా అర్థం చేసుకోవాలి కదని వివరించాడు దర్శకుడు.

"దెయ్యం వొచ్చి ఏం లాభం, ఫిలిం దండగ ఏ ఆలస్యంగానో అసలు రారనే రమ్మంటేసరి ముందే నేను నమ్మలేకపోయాను. మాలిని టైముకి సెట్స్ మీదకి వచ్చారంటే."

"ఔను మాలిని ఆత్మ మాత్రం టైముకి కెమె రా ముందుకి రావడం కూడా ఆశ్చర్యమే. అత్యా 'శ్చర్యమే." అని ముక్తాయింపు పలికాడు డైరెక్టరు. □





# సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? – చర్చ

## తప్పుదారి పట్టవచ్చు



సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? అనే ప్రసక్తే సిగ్గుచేటు! గుప్పిట మూస్తేనే అందం! తెరిస్తే ఏమీలేదు ఎంతో మంది విద్యావంతుల్ని చూస్తుంటాం విద్య వున్నా సంస్కారం వుండదు ఏ విద్యాధిక్యతా లేని నిరక్షరాస్యులు కొందరిలో ఎంతో సంస్కారం కనిపిస్తుంది అందుచేత విద్యవలన అండర్‌స్టాండింగ్ పెరుగుతుందనుకోవడం భ్రమ

సెక్స్ ప్రకృతి సహజంగా అంతర్యంలో ఉదయించేది దీనికి ప్రత్యేకించి క్లాసులు తీసికోవడం ప్రారంభిస్తే తెలిసీ తెలియని వయసులోని స్త్రీ పురుషులు తప్పుదారి పట్టవచ్చు అపుడు సమాజం యింకా భ్రష్టుపట్టిపోతుంది

సెక్స్‌లో బార్యకు భర్త, భర్తకు భార్య గురువవుతారు! వారి వారి మనస్తత్వాలనుబట్టి సదవగాహనలో చక్కగా జీవితం గడుపుతారు ఒకరినొకరు అర్థం చేసుకునే శక్తి, మనస్సూ లేనపుడు ఎంత సెక్స్ ఎడ్యుకేషన్ ఏమి చేయలేదు!

అందుచేత తెలిసీ తెలియని, అనుభవశూన్యమైన యువతరపు మాటలను మెజారిటీ అభిప్రాయంగా తీసుకుని సెక్స్ ఎడ్యుకేషన్ ప్రారంభిస్తే మానవాళికే కీడు జరుగుతుంది

–ఎన్.సులోచన, బాపట్ల

## హానే ఎక్కువ



సెక్స్ – ఎడ్యుకేషన్ అవసరమా? అనే శీర్షిక మీద నాగార్జున యూనివర్సిటీ విద్యార్థుల అభిప్రాయములు చదివి ఆశ్చర్యపోయాను సెక్స్ ఎడుకేషన్ అవసరమే? కాని ఎంతవరకు? ఇది నేటి యువతరంపై ఎలాంటి పరిణామాలకు దారితీస్తుందో తెలుసుకోవటం కూడా అవసరమే ఇప్పుడు ఆడపిల్లలని కో-ఎడ్యుకేషన్ కాలేజీలకు పంపటానికే తల్లి-తండ్రులు భయపడుతున్నారు ఇంకా కాలేజీలలో కూడ ఈ అంశం మీద లెసన్స్ ప్రారంభిస్తే ఆడపిల్లలని ఎవరూ బయటకు పంపరు సెక్స్ ఎడ్యుకేషన్ ఉన్నందువలననే అమెరికా, రష్యా వంటి దేశాలు అభివృద్ధి చెందినాయనుకోవటం పొరపాటు అసలు మనదేశంలో పురుషులు స్త్రీని సెక్స్ పరమైన ఉద్దేశ్యంతో చూడకుండా ఉంటే స్త్రీలకు వారిపట్ల భయం తగ్గి వారికి సహకరించగలరు సెక్స్ అనేది స్త్రీ- పురుషుల మధ్య ఒక ప్రకృతి సిద్ధమైన చర్య అది వారికి ఎదుగుదలతో పాటు వస్తుంది గాని ఇలా కాలేజీలలో లెసన్స్ చెప్పినంత మాత్రాన రాదు ఇది యువతరం మీద హానినే ఎక్కువగా కలిగిస్తుంది

–కె. రేణుక, నెల్లూరు

## వరం కావచ్చు



సెక్సు అంటే ఏమిటి? అది ఒక ఆవేశం వంటిది దానికి భాష్యం చెప్పినపుడే సమస్య పరిష్కారం అవుతుంది కనుక సెక్సు ఎడ్యుకేషన్‌పై నాగార్జున విశ్వవిద్యాలయం విద్యార్థుల అభిప్రాయాలు సమర్థనీయంగా ఉన్నాయి అయితే వికృత శృంగార ఫలితమైన 'ఎయిడ్స్' గురించి ఏమంటాము? ఆచార్య రజనీష్ నివాసానికి స్థానం ఇవ్వడానికి దేశాలన్నీ ఎందుకు భయపడుతున్నాయి? ఈ ప్రత్యక్ష సాక్ష్యాలు చూస్తున్న మన ప్రజలు సెక్స్ ఎడ్యుకేషన్‌ను ప్రోత్సహించగలరా? కానీ ఆచార వ్యవహారాలు, సంఘపు కట్టుబాట్లు మొదలగువానికి మనదేశంలో ఇంకా స్థానం ఉన్నందువలన సెక్స్ ఎడ్యుకేషన్ మన పాలిట వరం కావచ్చుని ఆశిద్దాం.

సి. వి. గోపాలరత్నం, కడప

## గమనిక

సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? అనే విషయంపై రాసేవారు తమ రచనలని 500 అక్షరాలకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాసి పంపాలి పరిశీలనకి పంపే రచనతో పాటు తమ ఫొటో ని కూడా విధిగా పంపాలి రాసినవారి పూర్తి పేరు, చిరునామా స్పష్టంగా ఇవ్వాలి ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపగోరేవారు వాటితో పాటు తగినన్ని స్టాంపులు అతికించిన కవరు పంపాలి రచన, ఫొటో లని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక గాంధీనగరం, విజయవాడ–520003 అనే చిరునామాకి పంపాలి వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు

–సం

## జీవితావసరాలలో ఒకటి



మనిషికి తిండి, కట్టుకోవటానికి బట్ట, ఉండటానికి ఇల్లు ఎంత అవసరమో సెక్స్ కూడా అంత అవసరం యువతీ యువకులలో సెక్స్‌పై లేనిపోని అపోహలు సరియైన లైంగిక విజ్ఞానం లేక వారు తమ బంగారంలాంటి భవిష్యత్తును నాశనం చేసుకోవటం జరుగుతున్నది బాల్య దశ నుండి యవ్వన దశకు అడుగు పెడుతున్న యువతీ యువకులలో సెక్స్ గురించి తెలుసుకోవాలనే కోరిక విపరీతంగా ఉంటుంది ఆ కోరికను తీర్చుకోవటం కోసం వారు చాలా ఇబ్బందుల పాలు అవుతూ ఉంటారు ఈనాడు విద్యార్థులు కూడా సెక్స్ పరమైన ఆలోచన్లతో తమ విలువైన కాలాన్ని వృధా చేసుకుంటున్నారు అందుచేత ఈ ఓపెన్ సీక్రెట్‌ని లైంగిక విద్య ద్వారా సెకండరీ స్థాయి నుండి ప్రవేశ పెట్టవలసిన అవశ్యకత ఎంతైనా ఉన్నది

–షేక్ వలి, దొండపూడి, (ప గో జిల్లా)

## ప్రాధాన్యత ఇవ్వాలి



మానవ జీవితంలో తిండి, గుడ్డ, నీడకు ఎంతటి ప్రాధాన్యత గలదో సెక్సుకు గూడ అంతటి ప్రాదాన్యత ఉన్నది మానవునకు సెక్సును గురించి సరియైన శాస్త్రీయ పరిజ్ఞానం లేకనే అనవసరమైన అపోహలకు గురిఅవుతున్నాడు అంతేకాదు ఒకవ్యక్తి సెక్సును గురించి చర్చిస్తే ఎదుటి వ్యక్తికి అతనిపై సదభిప్రాయం కలగదు, కారణం సెక్సును గురించి సరియైన పరిజ్ఞానం లేకుండుటయే విద్యార్థికి యవ్వన దశ ప్రారంభ దశలో నే కళాశాల విద్య ప్రారంబం అవుతుంది, అందువలన ఇంటర్‌మిడియట్ స్థాయినుండే సెక్సు ఎడ్యుకేషన్‌ను ఒక సబ్జక్టుగా ప్రవేశపెట్టాలి నేటి ప్రభుత్వం విద్యా విధానంలో విప్లవాత్మకమైన మార్పులను ప్రవేశపెట్టాలని యోచిస్తున్నది అందులో భాగముగానే సెక్సు ఎడ్యుకేషన్‌కు ప్రాధాన్యత యివ్వాలి అంతేగాదు అక్షరజ్ఞానంలేని పల్లె ప్రాంతవాసులకు సెక్సు ఎడ్యుకేషన్‌కి సంబంధించిన సినిమాలను శాస్త్రీయ పరముగా నిర్మించి వారిని గూడ ఎడ్యుకేట్ చేయవచ్చును

–జెని రామచంద్రగుప్త, తాడిపత్రి □

సీరియల్

# సర్ప యాగం

[illegible]

(గత సంచిక తరువాయి)

దేవరకొండ గ్రామానికి ఉత్తరం వేపు గుంపుగా నున్న చింత చెట్ల కింద ఓ పాక వుంది ఆ పాకే ఆ వూరికి సారాకొట్టు దాని యజమాని గురవయ్య ఆ వూళ్ళో వున్న చాలా మంది 'బలహీనత'ను గురవయ్య అక్కడే డబ్బుగా మార్చుకొంటూ వుంటాడు వస్తువుల్ని కుదవబెట్టుకుంటూ వుంటాడు

కొట్టు బయట కుర్చీలో కూర్చుని బీడీ కాలుస్తున్నాడు వీర్రాజు అతడి చూపులు మాత్రం అక్కడే కాస్త దూరంలో చింతపేళ్ళు చెక్కుకుంటున్న చిల్లరకొట్టు సీత ఒంటి మీద పారాడుతున్నాయి సరిగ్గా అప్పుడే వెంకట్రాముడు తన వెంట బంధువుల్ని తీసుకుని ఆ కొట్టు ముందుకొచ్చాడు

యేందిరా యానాది నాయాలా! కొల్లబోయిన సెరువుకాడికి పయానమైనట్టు యెవుర్నో తోడుకొని పయానమై వొచ్చినావు – కాలిపోయిన బీడీని అవతల పారేస్తూ వెంకట్రాముడిని ప్రశ్నించాడు వీర్రాజు

యీడికే వొస్తిమన్నా సారాయి కోసం – బదులు చెప్పాడు వెంకట్రాముడు

సారాయి కోసమా? వీళ్ళంతా యెవుర్రా? – వెంకట్రాముడి వెంట వున్న వాళ్ళ వేపు చూస్తూ అడిగాడు వీర్రాజు

యీళ్ళది యల్లంపల్లి యీ పొద్దు మా గోయిందుడి పెండ్లి వాళ్ళంతా పెండ్లి కూతురి తరపన వొచ్చిన బందుగులు సారాయి కోసం యీడికి తోడుకొచ్చినా

"గురవయ్యా! యీ పొద్దు నీకు మంచి బేరం వొచ్చింది సూడబ్బా – అంటూ లోపల వున్న గురవయ్యను వెలుపలికి పిలిచాడు వీర్రాజు

అతడి 'కేక విని గురవయ్య లోపలి నుంది వెలుపలి కొచ్చాడు వెంకట్రాముడు గురవయ్యతో సారా విషయం గురించి చెప్పాడు 'రండి' అంటూ గురవయ్య వెంకట్రాముడి వెంట వున్న ఆరు మందిని కొట్లోపలికి తీసుకెళ్ళాడు

వెంకట్రాముడు లోపలికి వెళ్ళకుండా కొట్టు బయటే నిలబడిపోయాడు

అతడికి తాగుడన్నా, తాగే వాళ్ళన్నా చెప్పలేనంత అసహ్యం

వొరేయ్ యంకట్రామా! జంగాలపల్లి జాతర్లో నువ్వొకదాన్ని తోడుకొని వొచ్చినావంట వూళ్ళో యెవురో సెప్పగా వినబడితి నిజమేనా?' – అడిగాడు వీర్రాజు

నిజమే అన్నట్టు తల ఆడించాడు వెంకట్రాముడు

పిల్ల బాగా నాన్నెంగానే వుండాదా? పరవాలేదా? – వీర్రాజు అలా అడగడంతో వెంకట్రాముడికి ఒళ్ళు మండిపోయింది నా పెళ్ళాం ఎలా వుంటే వీడికెందుకు? అని మనసులో అనుకుని మౌనం వహించాడు వెంకట్రాముడు

'యింతకు ముందు అది యెంత మందిని మార్చిందంట? దానికి నువ్వెన్నో మొగుడివి? – చాలా కుతూహలంగా అడగడం మొదలెట్టాడు వీర్రాజు

యెంత మందిని మారిస్తే యేంవుందన్నా? మాకు అట్టాంటి పట్టింపుల్లేవు

అది నిజమేలే మీ యానాది జాతిలో ఆడముండ్లకు వొక నీతా నియమవా?

తమ జాతినీ, తమ జాతిలోని స్త్రీలనీ మరి నీచంగా, చులకనగా వీర్రాజు మాట్లాడడం వెంకట్రాముడు ఏమాత్రం సహించలేక పోయాడు

'అదేందన్నా అట్ల మాటాడ్తా వుండావు? వొకో జాతికి వొకో నీతి ఆశారం వుంటాయి

ఆఁ మీకేమి నీతిలే నాబొంద

కట్టుకున్న మొగున్ని యిడ్సిపెట్టేసి నచ్చినోడితో యెళ్ళిపోయి కాపరం సేస్కుంటారు మా జాతి ఆడోళ్ళు కట్టుకున్న మొగుడితోటే వుండి యింకో మొగాడితో శానా గుట్టుగా కాపరం సేస్తుంటారు మీ జాతిలోని ఆడోళ్ళు అంతే తేడా

వెంకట్రాముడు సూటిగా అన్న ఆ మాట అగ్రవర్ణంలో పుట్టిన వీర్రాజు గుండెల మీద కాలిపోయిన యినుప కడ్డీలా చురుక్కున స్పృశించింది వీర్రాజులోని జాత్యహంకారం ఆ మాటతో కుతకుత ఉడికిపోయింది

"వొరేయ్ యంకట్రామా! వొక ఆడది మొగున్ని యెందుకు యిడ్సి పెట్టిపోతాదో తెల్సునా?"

"తెలవదు "

"ఆ మొగుడి దగ్గర పస (చాతుర్యం) లేక పోవడం సేతనే నీ దగ్గర ఆ పసే వుంటే నీ మొదటి పెండ్లాం నిన్ను యెందుకు యిడ్సిపెట్టిపోతాది? ఆ పస లేనోడివి మళ్ళీ నువ్వు యింకో ఆడదాన్ని తెచ్చి కొంపలో పెట్టుకోవడమెందుకు?" అన్నాడు వీర్రాజు వెంకట్రాముడి మీది కసితో

"ఆడదాన్ని కొంపలో తెచ్చి పెట్టుకోక, పెండ్లి సేసుకోక వొంటిగా బతికేదానికి నేనేమన్నా కొజ్జానా?"- వీర్రాజును సూటిగా చూస్తూ వెంకట్రాముడు ధైర్యంగా అనేశాడు

దారిన పోయే వాడిని దగ్గరకు పిలిచి వాడి చేత తిట్టించుకుని ముఖం మీద ఉమ్మించుకున్నంత పనైంది వీర్రాజుకు ఇంత వరకు తను పెళ్లి చేసుకోకపోవడం

**జరిగిన కథ-4 :** దేవరకొండ గ్రామంలోని ప్రాథమిక పాఠశాలలో పంతులు గుర్నాథం వీర్రాజు, గుర్నాథం మాట్లాడుతుండగా స్కూలు బయట పాము వచ్చిందని పంతులుతో చెప్తాడు బాలయ్య బాలయ్య పాములును పట్టే యానాది వాడిని పిలుచుకురావడానికి వెళ్తాడు ఇంతలో నాగరాజు అక్కడికి చేరుతాడు ఆ గ్రామంలో మంచి పలుకుబడి ఉన్న వ్యక్తి నాగరాజు. వెంకట్రాముడు వచ్చి పాముని పట్టేసాడు నర్సయ్య కొడుకు గోవిందుడికి నాగినితో పెళ్లి నిశ్చయమవుతుంది వెంకట్రాముడు తాను కూడా పెండ్లి చేసుకోవాలనే ఉద్దేశ్యంతో జాతర జరిగే రోజున గోవిందుని వెంట పెట్టుకుని మనువుల బండ దగ్గరికి వెళ్తాడు గౌరి వెంకట్రాముడి భార్య అయింది గోవిందుడి నాగిల పెళ్లి హడావుడి మొదలయ్యింది

చేత... తనను ఉద్దేశించే 'నేనేఁవన్నా కొజ్జానా' అని వెంకట్రాముడన్నాడని వీర్రాజు చాలా సులభంగానే గ్రహించగలిగాడు.

తనను వెంకట్రాముడు అంత మాట అనగలడని వీర్రాజు ఎప్పుడూ అనుకోలేదు. అవమానంతో అతడి ముఖం కందగడ్డలా అయిపోయింది.

అయినా యిప్పుడిక తను చెయ్యగలిగింది ఏమి లేదు. ఇక వెంకట్రాముడి ముందు అనవసరంగా నోరు పారేసుకోకూడదని నిర్ణయించుకున్నాడు వీర్రాజు



కూర్చున్నవాడల్లా చటుక్కున నిలబడి రిస్ట్ వాచ్‌లో టైం చూసుకుని... అర్జంటుగా మరో ప్రోగ్రాం వున్నవాడిలా ముందుకు కదిలాడు వీర్రాజు.

"టయిఁవెంతైందన్నా?" అడిగాడు కొట్టొంచి వెలుపలికొచ్చిన ఓ పెద్దాయన.

"తొమ్మిదిన్నర" చెప్పాడు వీర్రాజు.

"యింగా తొమ్మిదిన్నరేనా? పదిన్నర పైనే అయ్యుంటుంది. యీ టైఁవు తప్పేఁవో" వెంకట్రాముడన్నాడు.

"నా సేతికున్న యీ వాచీ తయారైంది జపాన్లో. నేను కొనింది అయిద్రాబాద్‌లో" అంటూ వీర్రాజు వెంకట్రాముడి వేపు సీరియస్‌గా చూసి ముందుకు నడిచాడు వీర్రాజు. ఎడం చేతికున్న ఆ పాత గడియారం ... ఆగిపోయి అప్పటికి ఆరు గంటలు దాటింది.

'గౌరి' అంటే వెంకట్రాముడికి అమితమైన ప్రేమ. అటువంటి గౌరిని పట్టుకుని 'అది' 'దానికి' అంటూ వీర్రాజు తన ముందు సంబోధించడంతో వెంకట్రాముడు మరి రెచ్చిపోయాడు అందుకే వీర్రాజును నువ్వొక కొజ్జావి అని పరోక్షంగా దెబ్బ తీశాడు

సారా తాగే కార్యక్రమం ముగించుకుని, అందరూ కొట్టొంచి వెలుపలికొచ్చారు సారాకు అయిన ఖర్చు మొత్తం గురవయ్యకు చెల్లించి అక్కడి నుండి కదిలాడు వెంకట్రాముడు మిగిలిన వాళ్ళు అతని వెంటే నడవసాగారు

"బీడీలు లేవు కదబ్బా!"

"కొనుక్కుందాంలే"

"వూళ్లో అంగిడి వుందా?"

"అంగిడీ సరే... సిల్లర"... అంటూ పెద్దాయన వెంకట్రాముడి వేపు చూశాడు

"సారాయికి పోగా మిగిలిన సిల్లర కొంచెం వుందిలే బీడీలు కూడా తీస్కుందాం" అన్నాడు వెంకట్రాముడు

దేవర కొండలోని చిల్లర కొట్టు వద్దకు వెళ్ళి రెండు బీడీ కట్టలు కొన్నాడు వెంకట్రాముడు అందరూ తిరిగి మామిడి తోట చేరుకునేసరికి పదిన్నర దాటింది

ఉదయం సద్ది నీళ్ళు మాత్రం తాగడం తప్ప ఆ యానాది వాళ్ళకు టిఫెన్లూ, కాఫీలు అలవాటు లేదు వాటిని తయారు చేసుకుని తినే ఆర్థిక స్థోమత కూడా వాళ్ళకు లేదు బంధువులకు సద్ది నీళ్ళు పొయ్యడం మర్యాద కాదు కనుక ఉదయాన్నే నర్సయ్య అన్నమూ, కూరలూ వండించాడు

పదకొండు గంటలకల్లా అందరూ భోజనాలు ముగించేశారు ఇక

# సర్పయాగం

ముహూర్తానికి గంట మాత్రమే వ్యవధి వుంది. భోజనాలు ముగించిన బంధువులంతా మామిడి చెట్టు నీడలో కూర్చుని కబుర్లలో మునిగిపోయారు.

నర్సయ్య ముహూర్తానికి ఏర్పాట్లు చెయ్యడం మొదలెట్టాడు కొంత మంది వాళ్ళ ఆచారం ప్రకారం పెళ్ళి కూతుర్ని అలంకరింపసాగారు పసుపు తాడును అదివరకే గౌరి సిద్ధం చేసింది సూర్యుడు నడి నెత్తికి మెల్లమెల్లగా వస్తున్నాడు

"వొరేయ్ యంకట్రాఁవా! యంకట్రాఁవా!" అంటూ హడావుడిగా లోపలికొచ్చాడు నర్సయ్య

"యేంది పెద్దయ్యా! శానా ఆత్రపడిపోతా వుండావు?" అడిగాడు వెంకట్రాముడు

"ముహూర్తం యాళ వొచ్చేస్తా వుందిరా యింగ తీరుబాటుగా కూచ్చుంటే యెట్టా?"

"పొద్దు నడి నెత్తికొచ్చిందా?"

"వొస్తా వుంది నువ్వా మూల నుండి గెడ్డపారను తీస్కొని బయటకెళ్ళి భూఁవిలోకి దిగెయ్యి "

నర్సయ్య ఆ మాట అనగానే ఆ యింట్లో ఓ మూల నున్న పలుగును తీసుకుని వెంకట్రాముడు వెలుపలికి వచ్చాడు ఆ పాక ముందు ఓ చోట భూమిలోకి ఆ పలుగును నిటారుగా దిగేశాడు నిటారుగా నిలబడ్డ ఆ పలుగు నీడ పడమటి వేపు కొద్దిగా పడుతోంది

మధ్యాహ్నం సరిగ్గా పన్నెండు గంటలకు యానాదులు తాళి బొట్టు కడుతారు అయితే సరిగ్గా పన్నెండు గంటలు అయినదీ లేనిదీ తెలుసుకునేందుకు ఆ యానాదివాళ్ళ చేతులకు గడియారాలుండవు కనుక సరిగ్గా ఆ టైంను తెలుసుకునేందుకు వాళ్ళకు ఆ పలుగు లేదా రోకలే సాధనాలు.

భూమిలోకి పలుగును కానీ రోకలిని కానీ వాళ్ళు నిటారుగా పాతి పెడతారు. భూమి తలంపై ఆ పలుగు లేదా రోకలి తొంభై డిగ్రీల కోణంలో నిలబడి ఉంటుంది ఆ పలుగు నీడ (రోకలి నీడ) దానికి చుట్టు పక్కలా ఎక్కడా పడకుండా. ఆ పలుగు మొదటి భాగంలో ఒక 'స్పాట్‌గా' పడిందంటే సరిగా అప్పుడు పన్నెండు గటలని యానాదుల అభిప్రాయం

నర్సయ్య గుడిసె మందు గోవిందుడూ నాగి పక్క పక్కన కూర్చున్నారు వాళ్ళ కొంగులు ముడి వెయ్యబడి వున్నాయి భూమిలోకి పాతిన పలుగు నీడ దాని మొదటి భాగంలో చుక్కలా పడుతోంది సరిగ్గా అప్పుడే గోవిందుడు నాగి మెడలో తాళి బొట్టు అనబడే ఆ పసుపు తాడును కట్టేశాడు

## 6

బృందావనం గార్డెన్స్‌లో రెండడుగులూ కొడైకెనాల్లో మరో రెండడుగులూ, ఊటీలో ఆఖరి అడుగుల్నీ వేసి. తెలుగు సినిమా హీరో హీరోయిన్స్‌లా వెంకట్రాముడు, గౌరి డ్యూయెట్స్ పాడుకోలేదు తెల్లని బట్టలు ధరించి దయ్యాల్లా గాల్లో విహరించినట్టు వాళ్ళెప్పుడూ రంగుల కలలు కనలేదు

అయినా వాళ్ళిద్దరికీ ఒకరంటే ఒకరికి ప్రాణం ఏ ముహూర్తాన వాళ్ళు జంగాలపల్లి జాతర్లో కలుసుకున్నారోగానీ. అప్పటి నుండి వాళ్ళ నడుమ గాఢమైన అనుబంధం ఏర్పడి పోయింది ఒకరిని వదిలి మరొకరు వుండేవారు కాదు ఒక వేళ అలాంటి పరిస్థితి వస్తే వాళ్ళకు క్షణం ఓ యుగంలా గడిచేది.

వెంకట్రాముడికి వెస్పా ఎక్కి ఊరంతా రౌండ్లు కొట్టి రావాలని లేదు నాగరాజుగారి పెద్దబ్బాయిలా ఖరీదైన బొమ్మల చొక్కాలను తొడుక్కోవాలని లేదు. అప్పు చేసి అర్జెంటుగా కవితా సంపుటిని అచ్చేసుకుని అర్ధాంగికి అంకితం యివ్వాలనే ఆశ అంతకన్నా లేదు గౌరితో జీవితాంతం గడిపెయ్యాలనే కోరిక మాత్రం గాఢంగా వుంది

ఆ మామిడి తోటలో వుండే ప్రతి చెట్టుకూ పుట్టకూ, రాయీ రప్పకు వెంకట్రాముడికీ గౌరికీ నడుమగల అవినాభావ సంబంధం గురించి బాగా తెలుసు గౌరిని అతడు కంటికి రెప్పలా చూసుకుంటాడు గౌరి కాల్లో ముల్లు విరిగితే ఆ ముల్లు తన కాల్లో విరిగినట్టు విల విలలాడిపోతాడు వెంకట్రాముడు

ఉదయం తొమ్మిది గంటలు దాటుతోంది తన పాకకు ముందు భాగంలో వున్న రాతి మీద కత్తిని నూరుతూ పదును పెట్టుకుంటున్నాడు వెంకట్రాముడు 'ఊదర కుండ' నిండా చెత్తా చెదారం నింపి అందులో ఓ నిప్పును పడేసి ఆ ఊదర కుండను సిద్ధం చేస్తోంది గౌరి

"గౌరీ! యింక యలబారిపోదాఁవా?" అంటూ గౌరి దగ్గరకు వచ్చాడు వెంకట్రాముడు

"నేనెందుకూ?"

"అదేం మాటే? నువ్వు రాకుండా నేనొకడే బోతే నా మొనుసంతా నీమీదే వుంటాది"

"అయితే యీడనే వొదిలేసి పో "

"యెవుర్ని?"

"నీ మొనుసును" అంటూ కిలకిలా నవ్వేసింది గౌరి

"అబ్బా నువ్వు నొవ్వతా వుంటే నీ పండ్లు "

"నా పండ్లు?"

"యెండలో నాగుపాము మాదిరిగా మెరస్తా వుండాయే" వెంకట్రాముడన్నాడు

"నోరు తెరిస్తే సాలు. నాగుపాము అనే మాట తప్ప మరో మాట రాదుగదా".

"నన్నేం సెయ్యమంటావే? నాకది బాగా అలవాటైపోయింది

"అది సరేగానీ యెలికల్ని పట్టే దానికి యియ్యాల నేను నీతో రాను నువ్వొంటిగానే పోవాల నాకింట్లో పనుండాది" అంది గౌరి

"యేం పని?"

"నూకలు దంచుకోవాల "

"తిరిగొచ్చినాక దంచుకోవచ్చులే "

"మనం యెలికల్ని పట్టుకొని వొచ్చే యాళకు మద్దేనం అవతాది మళ్ళెప్పుడు నూకలు దంచి యెసరు పెట్టేది?"

"రొండు మూడు యెలికలు దొరకంగానే వొచ్చేద్దాం లేవే"- బలవంతం చేశాడు వెంకట్రాముడు

"యిప్పుడట్టే అంటావు నీకు యాడైనా పాము కన్పిస్తే మాయిటేల (సాయంత్రం) దాకా రావు పాము కన్పిస్తే సాలు యింగ పెండ్లాం మాట కూడా గురుతుండదు" అంది గౌరి

"సీ సీ అదేం మాటే? పాము కాదుగదా యీ పెంపంచం గూడా నా పెండ్లాంతో సఁవానం గాదు" అంటూ గౌరి బుగ్గను చిలిపిగా గిల్లాడు వెంకట్రాముడు

"యీ సంబండానికేఁవీ తక్కువ లేదులే "

"యలబారు మరి. పొద్దెక్కిపోతా వుంది సల్ల పూటే తిరుక్కొని వచ్చేదాం "

వెంకట్రాముడు అలా బలవంతం పెట్టేసరికి గౌరికి యిక బయల్దేరక



తప్పింది కాదు ప్రస్తుతం వాళ్ళు ఎలుకలను పట్టుకుని రావడానికి బయల్దేరుతున్నారు ఎలుకలూ ఉడుతలు మాత్రమే వాళ్ళకు సులభంగా దొరుకుతాయి యానాదులకు అందుబాటులో వుండే మాంసాహారం కూడా అవే.

వెంకట్రాముడు ముందు నడుస్తున్నాడు. గౌరి వెనక నడుస్తోంది వెంకట్రాముడి భుజం మీద ఓ పలుగుంది అతడి వీపుకు వెనుక వేపు . ఆ పలుగు చివరి భాగానికి ఉదరకుండ వేలాడుతోంది. ఆ కుండకు అడుగు భాగానగల బొరియలోంచి పొగ సన్నగా వస్తోంది

ఎలుకల్ని సునాయాసంగా చంపేందుకు ఆ ఉదరకుండే యానాదులకు మంచి సాధనం అది ఎలుకల పాలిట యమపాశం ఎలుకల ప్రాణాల్ని పావుగంటలో ఆ ఉదరకుండే పూడ్చుకుపోతుంది

కుమ్మరి వాడు బంక మట్టితో తయారు చేసిన ఒక కుండను యానాదులు కొనుక్కుంటారు ఆ కుండకు అడుగు భాగంలో ఒక రంధ్రం చేస్తారు ఆ రంధ్రం చిటికెన వ్రేలు పట్టేంత చిన్న పరిమాణంలో వుంటుంది ఆ కుండ ముందు భాగం ద్వారా కుండ నిండా చెత్తా చెదారం దోపుతారు

తర్వాత కుండలోని ఆ చెత్తలో ఓ నిప్పు వేస్తారు అప్పుడు కుండలోని చెత్త మెల్లగా రగులుకుని జ్వాలలు రాకుండా పొగ మాత్రమే వస్తుంది కుండలోంచి ఆ పొగ ముఖం ద్వారానూ, వెనుక నున్న రంధ్రం ద్వారానూ వెలుపలికి వస్తుంది

పొలం గట్ల వద్ద అక్కడక్కడా భూమిలోకి బొరియలు వుంటాయి యానాదివాడు ఆ బొరియల దగ్గరగల మట్టిపై ఎలుకల అడుగు జాడలు ఉన్నది లేనిది పరిశీలించి చూస్తాడు ఎలుకల పెంటను కూడా పరిశీలిస్తాడు తద్వారా ఆ బొరియల్లో ఎలుకలు వుంటున్నదీ లేనిదీ వాడు తెలుసుకుంటాడు

ఏ బొరియలోనైనా ఎలుకలున్నాయని యానాదివాడు నిర్ధారణ చేసుకుంటే ఆ బొరియమీద ఉదర కుండను బోర్లించి పెడతాడు కుండ ముందు భాగంలోని అంచు చుట్టూ, మట్టిని కప్పేస్తాడు అలా మట్టిని కప్పడం వల్ల అందులోని పొగ నేరుగా బొరియలోకే చొచ్చుకుపోతుంది

తద్వారా కుండ వెనుక భాగంలో వున్న ఆ చిన్న రంధ్రం వద్ద నోటిని వుంచి రంధ్రం ద్వారా ఆ కుండ లోపలికి నోటితో యానాదివాడు గాలిని వూదుతాడు అలా గాలి వూదటం చేత కుండలో వుండే చెత్త మరింతగా రగులుకుని పొగ ఉత్పత్తియై ముమ్మరంగా ఆ ఎలుకల బొరియలోకి వ్యాపిస్తుంది

అలా యానాదివాడు నోటితో గాలిని పావుగంటసేపు ఊదుతాడు పొగ బొరియ నిండా బాగా వ్యాపించి పోవడంతో ఆ బొరియలో వుండే ఎలుకలకు ఊపిరి ఆడక విల విలా తన్నుకుని ఆ బొరియలోనే చనిపోతాయి బొరియలోంచి ఆ ఎలుకలు తప్పించుకోవాలని వెలుపలికొస్తే సరాసరి రగిలే కుండలోకి రావలసి వస్తుంది కనుక అవి ఆ ప్రయత్నం చెయ్యవు

పావుగంట గడిచాక యానాదివాడు ఆ ఉదరకుండను బొరియ వద్ద నుండి తీసేసి పలుగుతో బొరియను తవ్వుకుంటూ పోతాడు కొంతదూరం తవ్వేసరికి ఆ బొరియలో చచ్చిపడి వున్న ఎలుకలు కన్పిస్తాయి యానాదివాడా ఎలుకల్ని తీసుకుపోయి కాల్చుకుని తింటాడు

కేవలం పొలం గట్లలోనే కాకుండా కొన్ని ఎలుకలు అడవుల్లోనూ, మామిడి తోటల్లోనూ మొదలయిన మెట్ట ప్రాంతాల్లో కూడా బొరియల్లో నివసిస్తుంటాయి ఈ రకం ఎలుకల్ని 'ఎల్లెలుకలు" అంటారు అనగా పొలం గట్లలో గాకుండా వెలుపలి ప్రాంతాల్లో నివసించే ఎలుకలని అర్థం

యానాది వాళ్ళు ఈ రకం ఎలుకలుండే బొరియలకు కూడా ఉదర పెట్టి, వాటిని చంపి . తింటుంటారు అయితే పొలం గట్లలోని బొరియల్లో నివసించే ఎలుకలు రాగులనూ, వడ్లగింజల్నీ మొదలైన ధాన్యాల్ని తింటుంటాయి గనుక . . అవే బాగా కొవ్వెక్కి వుంటాయి యానాదులకు అవి రుచిగా వుంటాయి

విశాలమైన ఆ మామిడి తోటలో నడుస్తున్న వెంకట్రాముడికి ఓ చోట పెద్ద మర్రిచెట్టు దగ్గర .. ఒక బొరియ కన్పించింది. బొరియ వద్ద గల మట్టిని పరిశీలించి చూశాక... ఆ బొరియలో ఎలుకలు వుంటున్నట్టు గ్రహించాడు వెంకట్రాముడు. వెంటనే అతడు ఉదరపెట్టే ప్రయత్నంలో నిమగ్నమయ్యాడు

గౌరి మాత్రం మర్రిచెట్టుకు ఎడం వేపున గల వేప చెట్టు దగ్గర అటూ యిటూ తిరుగుతూ . అక్కడక్కడా ఎండుపుల్లల్ని ఏరుకుంటోంది సరిగ్గా

# నక్షత్రాలు మొలుస్తాయి

–డా. సి. నారాయణరెడ్డి

నాటుతా చిల్లిగవ్వలను
నక్షత్రాలు మొలుస్తాయి.
దాటుతా పిల్లకాల్వలను
నయాగరాలు జడుస్తాయి

అక్షరం నా నిధి
అంబరం నా అవధి.
సముద్రాలు దాటొచ్చినా
సమాజం నా పరిధి.

కాళ్ళేమో నేలపైన
శిరసు ఉనికి శిఖరం.
వేళ్ళేమో మట్టిలోన
వృక్షం ఊపిరి గగనం.

ఆ సమయంలో కెవ్వున అరిచింది గౌరి 'పాము మా(వా' పాము కర్సేసింది' అని అరిచింది

వెంకట్రాముడు వెంటనే చేతో ఓ కర్ర పట్టుకుని ఒక్క ఉదుటున గౌరి వద్దకు పరుగెత్తి 'యేదీ? యక్కడ పాము? యక్కడ?' అంటూ ఆతృతగా కలయచూశాడు

"అదో యాప సెట్టు కాడ పోతావుంది సూడు - అంటూ వేప చెట్టు వద్ద ప్రాకిపోతున్న పామును వెంకట్రాముడికి చేతో చూపెట్టింది గౌరి

ఆ నాగుపామును చూడగానే పళ్ళు పటపట కొరికాడు వెంకట్రాముడు తన గుహలోకి వచ్చి తననే దెబ్బ కొట్టిన మదగజం వేపు చూసే సింహంలా తనను పొడిచిన దుప్పి వేపు క్రూరంగా చూసే పులిలా సరసరా ప్రాకిపోతున్న ఆ పాము వేపు చూశాడు వెంకట్రాముడు

తన ప్రాణానికి ప్రాణమయిన గౌరినే కాటేస్తుందా అది? ఎన్ని గుండెలు దానికి! ఎంత కండ కావరం'అని మనసులో అనుకుంటూ రెచ్చిపోయిన వెంకట్రాముడు క్షణంలో చేతి కర్రతో పాము దగ్గరకు పరుగుతీశాడు

మనిషిని చూసిన ఆ పాము మరింత వేగం పుంజుకొంది తన ఒంట్లోని సర్వశక్తుల్నీ కూడదీసుకుని కర్రను పైకెత్తి బలంగా పాముపై ఓ దెబ్బ వేశాడు వెంకట్రాముడు పాము తోలుపై ఆశ పెట్టుకున్న వాడు ఆ పామును తలపై మాత్రం కొట్టి చంపుతాడు లేదా ప్రాణం తో టే పట్టుకుంటాడు

అంతేగానీ పాము ఒంటి మీద మాత్రం దెబ్బకొట్టడు కారణం ఒంటి మీద కొడితే దెబ్బ తగిలిన చోట పాము చర్మం చిరిగిపోతుంది అలా చిరిగిపోయిన చర్మాన్నెవరూ సంతలో కొనుక్కోరు

అయితే ప్రస్తుతం వెంకట్రాముడికి ఆ పామును పట్టుకుని చర్మం తీసి అమ్ముకోవాలన్న ఆలోచనే లేదు అతనికి ఆ క్షణంలో పుట్టిన ఆలోచన ఒక్కటే – ఆ పాము తన గౌరిని కాటేసింది కనుక దాన్ని నరికి పోగులు పెట్టాలి అంతే

అమితమైన ఆగ్రహంతో వెంకట్రాముడు కొట్టిన ఆ దెబ్బ పాము తోకపై చివరి భాగంలో మాత్రం తగిలింది అందుకే ఆ తోక చివరి భాగం తెగిపోయింది. మొండి తోకతో ఆ పాము తప్పించుకుని నాగజెముడు ముళ్ళపొదలో కెళ్ళిపోయింది

చిన్నముక్కగా తెగి, అక్కడ పడి వున్న ఆ పాము తోక చివరి భాగం . యింకా అటూ యిటూ కదులుతూనే వుంది చేతిలోని కర్రతో దాన్ని కసిగా పొడిచి గబగబా గౌరిని తమ పాక దగ్గరకు తీసుకుపోయాడు వెంకట్రాముడు

(ఇంకా ఉంది)

# వ్యక్తిగతం



ప్రపంచంలో అత్యున్నత శిఖరం అయిన ఎవరెస్టుని మొట్ట మొదటి సారి అధిరోహించిన ఇద్దరిలో ఒకరైన టెన్సింగ్ నార్కే (72) మే 9న డార్జిలింగ్‌లో మరణించారు గత సంవత్సరం అస్వస్థతకి గురై ఆయన కొంతకాలం ఢిల్లీ ఆసుపత్రిలో ఉన్నారు 1953లో ఈయన న్యూజిలాండ్‌కి చెందిన సర్ ఎడ్మండ్ హిల్లరీతో కలిసి ఎవరెస్టుపై కాలు మోపారు ఎవరెస్టు శిఖరాన్ని అదిరోహించాలన్న తమ చిన్ననాటి కలని నిజం చేసుకున్న అదృష్టవంతుడు ఈయన. షెర్పా కుటుంబంలో జన్మించిన ఈయన ఎన్నో బృందాలతో కలిసి పర్వతారోహణలో పాల్గొన్నారు.

1952 లో ఒక స్విస్ బృందంతో కలిసి 28250 అడుగుల ఎత్తు వరకూ వెళ్లి ఎవరెస్టు శిఖరాగ్రం ఇంకా కొన్ని వందల అడుగుల దూరం ఉన్నా అప్పుడు దాన్ని అధిరోహించటానికి వీలుకాలేదు 1953 మే 29న టెన్సింగ్‌నార్కే కలలు పలించాయి సర్ ఎడ్మండ్ హిల్లరీతో కలిసి అంతవరకూ మానవమాత్రులెవరూ కాలుమోపని ఆ శిఖరాగ్రంపై తొలిసారిగా అడుగుపెట్టి అక్కడ 15 నిమిషాలు గడిపి తిరిగివచ్చారు సర్ ఎడ్మండ్ హిల్లరీ ప్రస్తుతం భారతదేశంలో న్యూజిలాండ్ హైకమిషనర్‌గా ఉన్నారు టెన్సింగ్‌నార్కే మృతిపట్ల ఆయన తమ ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తం చేశారు టెన్సింగ్ నార్కే పర్వతారోహణలో ఎంతో మందికి శిక్షణ ఇస్తూ వచ్చారు ధైర్యసాహసాలకి మారుపేరుగా ఆయన అందరి మనసులలో నిలిచిపోతారు ... □



చదరంగంలో జాతీయ ఛాంపియన్ అయిన విశ్వనాథన్ ఆనంద్ భారత చదరంగ చరిత్రలో ఒక కొత్త అధ్యాయాన్ని సృష్టించాడు. ఇటీవల కొత్త ఢిల్లీలో జరిగిన ఖిల్వారా అంతర్జాతీయ గ్రాండ్ మాస్టర్స్ చదరంగం పోటలలో ఆనంద్ ప్రపంచ చదరంగం మేటి ఆటగాళ్లలో ఒకరైన సోవియెట్ సూపర్ స్టార్ గ్రాండ్ మాస్టర్ వ్లాదిమిర్ తుక్‌మకోవ్‌పై ఘనవిజయాన్ని సాధించాడు అతి పిన్న వయస్కుడైన ఈ జాతీయ ఛాంపియన్ ప్రదర్శించిన అద్భుతమైన ఆట మిగతా వాటిని వెలవెల పోయేలా చేసింది. □

# వారఫలం

## 6–6–1986 శుక్రవారం మొదలు 12–6–1986 గురువారం వరకు

★ **మేషం** : వారం బాగా అనుకూలం గ్రహచారం బాగున్నది వ్యాపార వ్యవహారాలందు అనుకూలం కుటుంబానందానికి అవకాశ మున్నది అధిక వ్యయం కూడా సూచించువారమే బాధ్యత పెరుగు తుంది స్త్రీలకు ఎంతో కాలంగా ఎదురు చూచే శుభ కార్య నిర్వహణానికి అవకాశం

★ **వృషభం** : వారమంతా శుభంగా, ఆనంద దాయకంగా ఉంటుందనలేము గాని, వారాంతం శుభావహంగా సుందరంగా జరుగుతుంది యత్న కార్యసిద్ధి, ధనలబ్ధి, రాజకీయంగా బాగా మెలకువతో మెలగ వలసిన సమయం స్త్రీలకు దైవ కార్యాచరణకు అనుకూలం రాజకీయంగా యత్న సాధనకు అవకాశం గలవారం

★ **మిధునం** : విరోదివర్గం ఉన్నదను కోవటం పొరబాటు మన మనస్తత్వాన్ని బట్టే శత్రువులు, మిత్రులు, యద్భావం తద్భవతి మీ భావాన్నిబట్టే పరిస్థితులు, వ్యవహారాలు సంతానాన్ని గూర్చిన భయాందోళనలు కొందరకు, కుటుంబానందం లో పెంచటం కొందరకు చెప్పదగిన అంశాలు స్త్రీలకు భయాందోళనలు, అనవసరంగా మాటలు పడుటకు అవకాశ ముంటుంది, గ్రహించాలి

★ **కర్కాటకం** : రాజకీయంగా మేలు పొందాలని చేసే యత్నాలు పలించవు, కలసిరాని సమయం అని గ్రహించాలి కొందరు అయినవారో, కానివారో, ఏదో విధంగా మిమ్ముల వంచన చేయాలని చేసే యత్నాలు గమనించి మెలగాలి ప్రయాణా లుంటాయి, జాగ్రత్త అవసరం స్త్రీలకు వృధాకాలక్షేపం, అపరిమిత ఖర్చులు, ఆందోళన

★ **సింహం** : వారమంతా సుఖ సంతోషాలతో గడుస్తుంది రాజకీయంగా మీరు గావించే యత్నాలు సాగివస్తాయి వారికి వీరికి యిచ్చిన డబ్బు రాబట్టుకొనే యత్నాలు చేయటం అవసరమని గ్రహించాలి వ్యర్థ కాలక్షేపం ఎంత మాత్రం తగదని గ్రహించాలి స్త్రీలకు అధిక వ్యయం, శుభ కార్యాచరణ యందు లోపం, అధికారుల వలన మాట పడటం, ఆరోగ్య లోపం కూడా కొందర విషయంలో చెప్పదగిన అంశం

★ **కన్య** : సర్వవిధాలా అనుకూలం కుటుంబానందం కుమారుని కొరకో, కూతురి కొరకో యత్నించిన ఉద్యోగయత్నం సానుకూలం కావటం విశేషం, రాబడిలో కొంత పెంపు చెప్పదగిన సమయం "కోర్టు" వ్యవహారాలుంటే గెలుపు మీదేనని గ్రహించాలి. స్త్రీలకు : అధికార మందు పెంపు. యోగ్యుల నుండి ప్రశంసలు. పుణ్యకార్యాచరణం.

★ **తుల** : క్రమక్రమంగా గ్రహానుకూల్యత మీ రాశికి లభిస్తున్నది మధ్య వయస్కులకు ధనాదాయ మున్నది కృషి ఫలిస్తుంది సత్కార్యాచరణానికి నాంది పల్కుతుంది వస్తు సేకరణకు, విక్రయానికి అనుకూలవారం ఉత్తమ ఫలదాయక వారం స్త్రీలకు సంఘంలో గౌరవం పెంపు స్థిరాస్తి యందు వృద్ధి

★ **వృశ్చికం** : మీ ఆలోచనలు సక్రమంగా సాగి, సత్ఫలదాయకాలు కాగలవు వ్యాపార విస్తరణకు చేసే యత్నాలు ఫలిస్తాయి పత్రికా సభా గౌరవాదులకు ఆస్కార మున్నది రాజకీయాలకు ఎంత దూరంగా ఉంటే అంత మంచిది శుభకార్యాలు వాయిదా వేయటం మంచిది స్త్రీలకు అధికార మందు వృద్ధి, వృత్తియందు పెంపు

★ **ధనుస్సు** : మీ ప్రజ్ఞను, బుద్ధి వికాసాన్ని గమనించి, మీ పెంపును గూర్చి గ్రహించి కొందరు అసూయ పడుతారు అలాంటి వ్యక్తులను యింటికి రానీయకండి స్తోత్ర పాఠకులను రానీయకండి కాలం వృధా చేయకండి వారంతం లాభదాయకం స్త్రీలకు గృహాలంకరణ, వస్తు సేకరణకు అవకాశం, కొందరకు వృత్తి యందు పెంపు

★ **మకరం** : మీ మాటలకు అధికాదరణం లభ్యం కాగలదు మీ యింట శుభం జరిగే అవకాశ మున్నది మీ వ్యాపార విస్తరణకు సదవకాశాలున్నాయి రావలసిన డబ్బు సమయానికి అందటం గ్రహింపదగిన అంశాలు స్త్రీలకు రచనా వ్యాసంగాన లాభం కుటుంబానందం వృత్తి యందు పెంపు చేకూరుతుంది

★ **కుంభం** : వారమంతా విజయ ప్రదమే ఆస్తి, భూములందు, కొంత పెంపు కనిపిస్తుంది విద్యా పరిశ్రమ బాగా సంతృప్తి నిస్తుంది అతిది అభ్యాగతుల నాదరించ వలసిన సమయం ఉద్యోగరీత్యా వృద్ధి కనిపిస్తుంది కుటుంబానందం, ధనాదాయానికి అవకాశం స్త్రీలకు రాజకీయరంగాన పెంపు, ఉద్యోగాన వృద్ధి

★ **మీనం** : మీ నుండి ధనం గుంజుకోవాలని, మీ వలన కార్యసాధన గావించు కోవాలని యత్నిస్తారు వ్యాపారంలో చేరమని గొడవ చేస్తే మరి మీరు యోచించాలిసిన అగత్య మున్నది, గ్రహించండి వృత్తి యందు చికాకులు ఉదయిస్తాయి, గమనించి మెలగండి స్త్రీలకు వృత్తియందు ఏదో లోపం కనిపిస్తుంది అధికారుల వలన కొందరకు యిబ్బంది జరుగవచ్చు స్త్రీలకు : ముఖ్యావసరాలు తీర్చుకొన తాపత్రయ పడుతారు అందుకు ధన సహాయం అవసరం గదా! గ్రహించి మెలగండి.

– విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

మీ చిన్నారి పాప నూనూగు బుగ్గలపైన మీరిచ్చే ముద్దులా సున్నితంగా

పాప చిన్నారి లోకంలో యిమిడే అలరె అతి ప్రత్యేకమైన అతి కొద్ది వస్తువుల్లో ఒకటి – జాన్సన్స్ బేబీ సోప్.

అపేక్ష చిలికే మీ స్పర్శలా మృదువుగా చేస్తుంది జాన్సన్స్ బేబీ సోప్‌లోని లెనోలిన్ అనే పదార్థం. మరి దానిలోని ఆ సువాసన మీ పాపపై చిలుకుతుంది, దాంతో యిక పాపకు చక్కగా సహజమైన ఆ సువాసన.




జాన్సన్స్ బేబీ సోప్
శుద్ధమై... సౌమ్యమై... భద్రమైనది.

Johnson & Johnson

OBM/2193 TEL

# అభిమన్యుడు చావలేదు

శ్రీమతి ఉష

అవినీతి నిరోదక శాఖ ఆఫీసర్ రాజారావు గారింట్లో డ్రాయింగ్ రూంలో

గోడ మీది పోస్టర్‌లోని పులి - మీదకు దూకడాన్కి సిద్ధంగా వున్నట్టుంది! ఆ గదిలో అరగంట నుండి నిరీక్షిస్తున్న రామారావుకా గది పులి బోనులానే అనిపించింది! చీమ చిటుక్కుమంటే ఉలికి ఉలికి పడుతున్నాడు గాని ఆఫీసర్‌గారి దర్శనం మాత్రం కాలేదు

రామారావు హృదయం అల్లకల్లోలంగా వుంది ఆలోచిస్తున్నకొద్దీ రక్తం మరిగిపోతోంది కసి పెరిగిపోతోంది

నీతికి, నిజాయితీకి పట్టంగట్టి, అందువల్ల అష్టకష్టాలు పడుతున్న అభాగ్యజీవి - రామారావు ఒక ఆఫీసులో యు డి సి అతని పక్కింటి గోపాలరావు కూడా అదే ఆఫీసులో అంతే జీతం తెచ్చుకునే యు డి సి

అయినా యిద్దరి జీవితాల్లోనూ తేడా కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది

గోపాలరావు ఒంటి నిండా దర్జా వుంది ఇంటి నిండా దర్పం వుంది వాళ్ళింట్లో టీ వీ, సీలింగ్ ఫ్యాన్‌లూ వున్నాయి. అతనికి స్కూటర్ వుంది పిల్లలు కాన్వెంట్‌లో చదువుతున్నారు కాన్వెంట్‌కి వెళ్ళే ముందు హార్లిక్స్, సాయంకాలం యింటికి రాగానే బోర్నవిటా, ఆటలయాక బూస్ట్, చదువు అయాక పాలు తాగుతారు ఆ పిల్లలు ఆరోగ్యంగా మిసమిసలాడుతూ బంతుల్లా గంతులేస్తూ వుంటారు

మరి రామారావు యింటిలో టీ వీ కాదు గదా ట్రాన్సిస్టర్ అయినా లేదు స్కూటర్ కాదు కదా సైకిల్ అయినా లేదు పిల్లలు మునిసిపల్ స్కూల్లో చదువుతున్నారు ఈసిరోమంటూ ఉంటా రెప్పుడూ

ఇద్దరి జీతం సమానమే అయినప్పుడు జీవితాలెందుకు సమానం కాలేదు?దానికొక్కటే కారణం

రామారావు నీతిని నమ్ముకుంటే -గోపాలరావు అమ్ముకున్నాడు!

అతని భోగ భాగ్యాలు చూసి రామారావు ఎప్పుడూ ఈర్ష్యపడలేదు కాని భార్య మాత్రం దెప్పడం ప్రారంబించింది - లంచం తీసుకోవడం చేతగాకపోతే, కనీసం గోపాలరావుని చూసి నేర్చుకోమని! ఇంట్లో పోరు ఎక్కువైంది ఆఫీసులో కూడా అతని పరిస్థితి యిరకాటంలో పడింది

ఒక ఏడాది క్రితం ఆఫీసులో కాంటీన్ నిర్మాణానికి టెండర్లు పిలిచారు అతి తక్కువ మొత్తానికే కాంటీన్ నిర్మిస్తానన్న రంగాకి పని అప్పగించబడింది

అప్పట్లో - రంగా కట్టించిన అనేక బిల్డింగ్‌లు కూలిపోయాయనీ, అతని కంట్రాక్ట్ అంగీకరించడం క్షేమదాయకం కాదనీ - రామారావు నోట్ రాలా దాన్ని నిర్లక్ష్యం చేసి, లంచం మింగి, ఆఫీసర్ - రంగాకే పని అప్పగించాడు

ఆరు నెలలు గడిచాయో, లేదో కాంటీన్ కూలిపోయింది వంటవాడు చనిపోయాడు అతని భార్య నష్టపరిహారం కోరుతూ ఆఫీసర్ మీద కేసు పెట్టింది అతనికి గంగవెర్రులెత్తాయి

రామారావుని పిలిచి అతడు అప్పట్లో రాసిన నోట్ కొట్టేసి వేరే కాగితం మీద -తక్కువ టెండర్‌దారునికే పని అప్పగించవలసిందిగా మరో నోట్ రాయమని కోరాడు డబ్బు ఆశకూడా చూపించాడు అలా చేస్తే తన కొంప మునుగుతుందని రామారావుకి తెలుసు అందుకే నిరాకరించాడు దానితో అతని కష్టాలు ప్రారంభం అయ్యాయి అవమానాలు ఎదురైనాయి కక్షసాధింపు ఎక్కువైంది

రామారావు యూనియన్ లీడర్స్‌తో మొరపెట్టుకున్నాడు గతంలో, పిల్లి అపానవాయువు వదిలితే సమ్మె నోటీసు యిచ్చిన ఆ పెద్దలు వ్యక్తిగత విషయాల్లో యూనియన్ కలగజేసుకోకూడదని ధర్మపన్నాలు వల్లించారు దానిక్కారణం వాళ్ళూ లంచగొండులు కావడమే తీగ లాగితే డొంకంతా కదులుతుందని వారి భయం

ఓ రోజు ఆఫీసు నుండి రామారావు యింటికి రాగానే భార్య అతనికో కవరు యిచ్చింది - ఎవరో యిచ్చి వెళ్లారట

కవరు విప్పి చూసాడు రామారావు ఒక వంద రూపాయిల కాగితం, ఒక ఉత్తరం ఉన్నాయి

కంట్రాక్టర్ రంగా మీద మరిన్ని అభాండాలు సృష్టించి ప్రచారం చేస్తే మరి కొంత డబ్బు యిస్తాననీ, ప్రస్తుతానికి ఆ వందతో సంతృప్తి చెందమనీ - ఉంది ఆ ఉత్తరంలో

రామారావు ఆశ్చర్యం నుండి తేరుకోక ముందే అవినీతి శాఖ అధికారులు దాడి జరిపి, ఆ కవరు స్వాదినం చేసుకున్నారు

తన తప్పు ఏమీలేదని చెప్పుకున్నాడు రామారావు వాళ్ళు వినలేదు ఏవో పత్రాల మీద సంతకాలు పెట్టించుకొని ఆఫీసర్‌ని కలుసుకోమన్నారు

చేయని నేరానికి శిక్షా?నీతికే దండనా? ఇంత దారుణమా?' రామారావు హృదయం కుత కుత ఉడికిపోతున్నది ఆఫీసర్ రాజారావు తన గోడు వింటాడా? న్యాయం కలగజేస్తాడా? వచ్చి అరగంట అయినా దర్శనమే లభించలేదు

గోడనున్న పులి పోస్టర్ ప్రక్కనే వున్న ఫోటోలో తన క్లాస్‌మేట్ పోలికలు కనిపిస్తున్నాయి ఆ రాజారావు ఈయనా ఒక్కరేనా? అతడే యితడైతే తనకు న్యాయం జరగదు!

ఆ రాజారావుకి నీతి నియమాల మీద గౌరవంలేదు కాపీ కొట్టి పరీక్షలు పాస్ అయేవాడు పరీక్ష హాలులో తనముందు సీటులోనే అతని స్థానం జవాబులు చెప్పమని వేధించేవాడు తన ఆన్సర్ బుక్ లాక్కుని కాపీ చేయడాన్కి ప్రయత్నించేవాడు తను వాచర్‌కి రిపోర్ట్ చేస్తే పెద్ద గొడవ జరిగింది బుసలు కొట్టాడు రాజారావు ఆనాటి కసి యింకా అతనిలో మిగిలే వుంటుంది అలాంటివాడు తనకు సాయం చేస్తాడా?' ఇంటికి వెళ్ళిపోదామనిపించింది రామారావుకి

హల్లో రామారావుగారూ! నీతిలోంచి దారితప్పి యిలా అవినీతిలోకి వేంచేసారేమిటి! వెటకారంగా నవ్వుతూ లోనికి వచ్చాడు రాజారావు తన క్లాస్‌మేట్ రాజారావే!

దిగ్గున లేచి నుంచున్నాడు రామారావు అతని హృదయం బగ్గున మండింది రక్తం సలసల కాగిపోయింది అవినీతి నిరోధక శాఖ అధిపతే ఒక అవినీతిపరుడు! ఇంక న్యాయం బ్రతికి బట్టకడుతుందా?

ఆవేశాన్ని అదుపులోనికి తెచ్చుకున్నాడు రామారావు పేదవాని కోపం పదవికి చేటు!

తమరు వచ్చిన పనేమిటో ?!" ఎగతాళి! హేళన!!

ఒక దోషిలాగ తలవంచుకుని, తన నిర్దోషిత్వం గురించి ఒక అవినీతిపరుడికి చెప్పుకోవలసిన దుస్థితి కలిగినందుకు దురపిల్లుతూ అంతా వివరించాడు రామారావు

పరీక్షల్లో నీవు నాకు సాయం చేయలేదు నేనిప్పుడు నీకెందుకు సాయం చేయాలి? సూటిగా అడిగాడు రాజారావు సోఫాలో కూచుంటూ

రామారావు నిలబడే వున్నాడు నువ్వు సారి . మీరు ఆ రోజుల్లో అడిగింది అన్యాయానికి సాయం చేయమని!! నేనిప్పుడు అడుగుతున్నది న్యాయానికి సాయం చేయమని! అన్నాడు గంభీరంగా

"నేను నిన్ను రక్షిస్తానని ఆశిస్తున్నావా?'

"ఆ ఆశతో నే వచ్చాను నాకిప్పుడాఆశలేదు కాని నిర్దోషిని రక్షించడం మీ బాధ్యత ఉద్యోగ ధర్మం ."

"ప్రభుత్వ ప్రత్యర్థులను వేధించడానికే మా శాఖ ఉంది గలగల నవ్వాడు రాజారావు

నేను ప్రభుత్వ ప్రత్యర్థిని కాను "

న్యాయ వర్తనులందరూ ప్రభత్వ ప్రత్యర్థులే!" అని మళ్ళీ నవ్వాడు తనను వేళాకోళం పట్టిస్తున్నట్టు గ్రహించాడు రామారావు

నవ్వు ఆపి, గంభీరంగా అన్నాడు రాజారావు "ఒక మంత్రిగారి ప్రాపకంతో నాకీ ఉద్యోగం లభించింది మీ ఆఫీసర్‌కి మరో మంత్రి అండ కంట్రాక్టర్ వెనుక ఒక శాసన సభ్యుడు కాంటీన్ కూలిపోయిన కేసులో నీవు వాళ్ళకి ప్రత్యర్థివి నిన్ను లొంగదీసుకోడాన్కి, నీ సాక్ష్యం బలహీనపడడానికే ఈ ప్రయత్నం!"

వెనుక యింత గ్రంథం వుందని తెలియని రామారావు నిర్ఘాంతపోయాడు పిచ్చుక మీద బ్రహ్మాస్త్రమా! అన్నాడు నీరసంగా

"పిచ్చుకలే ఒక్కోసారి విమానాన్ని కూడా కూల్చేస్తాయి తెలుసా?" అన్నాడు రామారావు కూర్చోమని సంజ్ఞ చేస్తూ

విమానం సంగతి దేవుడెరుగు మొదట పిచ్చుక చచ్చిపోతుందిగా - అనుకున్నాడు రామారావు విషణ్ణంగా

రామారావు కూర్చున్న తరువాత రాజారావు ధోరణే మారిపోయింది ముఖంలోని ఎగతాళి, వెక్కిరింత మాయమై నిజాయితీ, సహృదయత ప్రతిఫలించాయి రామారావులో ఆశ రెప రెపలాడింది

'నీకో నిజం చెప్పనా రామారావ్! నీవు నాకు సాయం చేయకపోయినా, నీవల్ల నాకు కీడే జరిగినా, నీ పట్ల నాకు కసి వున్నా - దాన్ని మించి నీ మీద నాకు గౌరవం వుంది రామూ! స్కూలులోనే కాదు, జీవితంలోనూ అవినీతిని దరి జేరనీయకుండా నీతిగా నిజాయితీగా బ్రతుకుతున్న నిన్ను చూస్తే -నీ స్నేహితుడవైనందుకు నాకు గర్వంగా వుంటుంది అవినీతి అనే పద్మవ్యూహం మధ్య నిలిచి అసహాయశూరుడిలా నీవు చేస్తున్న యుద్ధం చూస్తోంటే అభిమన్యుడు జ్ఞాపకం వస్తున్నాడు "

తన చెవులను నమ్మలేకపోయాడు రామారావు అతని ఛాతీ ఉప్పొంగిపోయింది ఉత్సాహం ఉరకలు వేసింది కాని అంతలోనే చప్పగా చల్లారిపోయాడు అభిమన్యుడు! పెద్దలు సృష్టించిన పద్మవ్యూహంలో చిక్కుకుని చివరకు చివరకు

నీ గతీ అంతే అని హెచ్చరిస్తున్నాడా రాజారావు? హటాత్తుగా కాలింగ్ బెల్ మోగింది రామారావు యింటి మీద దాడి జరిపిన ఇనస్పెక్టర్ లోనికి వచ్చి ఏదో చెప్పబోయి, రామారావుని చూసి ఆగిపోయాడు

తర్వాత వాళ్ళిద్దరూ ప్రక్క గదిలోకి వెళ్ళి ఏదో మాట్లాడుకున్నారు చాలాసేపు స్పష్టంగా వినిపించక పోయినా, తన గురించే అని గ్రహించాడు రామారావు

గోడ మీద - దూకడానికి సిద్ధంగా వున్న పులి మరింత భయంకరంగా కనిపించింది అతనికి ఇనస్పెక్టర్‌ని పంపివేసి తన వద్దకు వస్తున్న రాజారావు నిజంగానే పులిలాగ కనిపించాడు రామారావుకి

రాజారావు లోనికి వస్తూ నిశ్చలంగా చూసాడు మిత్రుని వైపు ఆ చూపులో చల్లదనం వుంది భరించలేనంత చల్లదనం రక్తాన్ని గడ్డ కట్టించేటంత చల్లదనం!

అతని మీదకు దూకలేదు కాని, వచ్చి మిత్రుని పక్కనే కూచున్నాడు రాజారావు

రామారావు హృదయం గుబ గుబలాడిపోయింది సోఫా భూమిలోకి కూరకుపోతున్నట్టుగా వుంది. పెదవులు తడి చేసుకుని గొంతు సవరించుకుని ఏదో అడగబోయాడు

ఈలోగానే రాజారావు అందుకున్నాడు 'ఇనస్పెక్టర్ చెబుతున్నాడూ - మినిష్టర్‌గారు ఫోన్ చేశారట 'ఆ సంగతి' ఏం చేశారూ - అని' అంటూ అతడి భుజం మీద చేయి వేసాడు అది పులి పంజాలాగ తగిలింది

అయితే నన్ను నన్ను .. అరెస్ట్ చేస్తారా? ఉద్యోగంలోంచి పీకేస్తారా?" అడిగాడు రామారావు అతని హృదయం గజగజలాడిపోతోంది స్వరం గద్గదం అయింది కన్నీళ్ళు తిరిగాయి

రాజారావు, చిద్విలాసంగా నవ్వాడు లేచి కిటికీ వద్దకు వెళ్ళాడు కిటికీలోంచి బయటకు చూస్తూ 'బ్రిటిష్‌వాళ్ల కాలంలో కట్టిన ఆనకట్టలూ, వంతెనలూ చెక్కు చెదరకుండా యింకా నిలిచి వున్నాయి స్వతంత్రం వచ్చాక మనం కట్టుకున్న ఆనకట్టలు గండిపడుతున్నాయి వంతెనలు కూలిపోతున్నాయి ఎందుకని?' అన్నాడు

ఆ ప్రసక్తి యిప్పుడెందుకో - అర్థంకాలేదు రామారావుకి రాజకీయ కాలుష్యం, లంచగొండుల్ని వెనకేసుకొచ్చే మంత్రులు, నిజాయితీపరుల్ని వేధించే అవినీతి నిరోధక శాఖ యిలా సవాలక్షకారణాలు చెప్పగలడు రామారావు కానీ, ఒక్క మాటా అతని పెదవి దాటి బయటకు రాలేదు పరిస్థితి అలాంటిది



# ఈ వేమన పద్యాలు




విధిలేక జరగదనుచును
మదిలో పలనెపుడు దలచి మమతను బుద్ధిన్
పొదలుచు విడువగ జాలని
యదియే సంసార బీజ మనబడు వేమా

రాజారావు అతని వైపు తిరిగాడు సమాధానం చెప్పమన్నట్లు గుచ్చి గుచ్చి చూసాడు అతనికేమో చెలగాటంలా వుందేమో గాని రామారావుకి మాత్రం ప్రాణసంకటంలా వుంది ఏం సమాధానం చెబితే అతనికెక్కడ కోపం వస్తుందోనని గత్యంతరం లేక అవినీతి అని గొణిగాడు మనసులో మాత్రం - నీలాంటి అవినీతిపరులైన ఆఫీసర్ల వల్లనే దేశం ఇలా తగలడిపోతోందిరా దౌర్భాగ్యుడా! అనుకున్నాడు కసిగా

అవినీతిపరుల్ని నిందించి లాభంలేదు మిత్రమా! చిన్న మనుషులకు ఓట్లేసి పెద్ద కుర్చీల్లోకి పంపే ప్రజలదే తప్పు! ఎలాంటి ప్రజలకు అలాంటి

## అభిమన్యుడు చావలేదు

ప్రభుత్వమే లభిస్తుంది అవినీతిని తిడుతూ కూచేదం తప్ప తుడిచిపారేద్దాం అన్న సంకల్పం ప్రజలకు లేదు ఎందుకంటే - ప్రతివాడిలోనూ అవినీతి వుంది కాని ప్రతి వాడికీ ఎదుటివాడిలోని అవినీతి మాత్రమే కనిపిస్తుంది విమర్శించుతారు. కాని తన అవినీతిని ఎవరైనా వేలెత్తి చూపితే - సమర్థించుకుంటాడు నిజంగా అవినీతిని అంతం చేసే ప్రభుత్వం ఎవరికీ అక్కర్లేదు అందుకే - అందుకే - ఆదాయపు పన్ను ఎగగొట్టేవారికి ఓట్లు వేస్తారు ప్రజలు కుంభకోణాల్లో యిరుక్కున్నవారికి ఓట్లు వేస్తారు పార్టీలు పిరాయించే వారికి, నీతి నియమాల పట్ల గౌరవంలేని వారికి పచ్చి రౌడీలకూ ఓట్లు వేసి కుర్చీలో కూచో బెడతారు దేశం సర్వనాశనం అవుతోందంటే దానిక్కారణం రాజకీయ నాయకులు కాదు వాళ్ళని ఆ పదవుల్లోకి పంపిన ప్రజలు! ఎవరికీ అక్కర్లేని నీతి నియమాలు నీ ఒక్కడికే ఎందుకయ్యా పిచ్చి పుల్లయ్యా! ఆవేశంగా అన్నాడు రాజారావు

అతని భావాలు దారుణంగా కనిపించాయి రామారావుకి కాని అతనితో వాదించడాన్కి సమయం కాదది

కాలింగ్‌బెల్ మళ్ళీ మోగింది ఉలిక్కిపడ్డాడు రామారావు మళ్ళా ఆ యినస్పెక్టరో ఒకసారి అని గలగల నవ్వేసి రామారావు వైపు ఒకసారి చూసి అంత హడావుడిగానూ వెళ్ళిపోయాడు రాజారావు ముఖం వికసించింది

పద్మవ్యూహంలో చిక్కుకున్న అభిమన్యుడికి ఎవరైనా సాయం చేసి వుంటే మహాభారతమే మారిపోయి వుండేది ఆ కథ చదివినప్పుడల్లా నాకదే అనిపిస్తుంది అందుకే అవినీతి పద్మవ్యూహంలో అభిమన్యుడిలా చిక్కుకుపోయిన నీకు సాయం చేయాలనిపించింది చేసాను నీకింక ఏ భయమూ లేదు అన్నాడు రాజారావు

రామారావులో సుడిగాలిలా వ్యాపించింది ఆ ఆనందం గబుక్కున లేచి అతనిని కౌగలించుకున్నాడు కృతజ్ఞతలు చెప్పుకోవా లనుకున్నాడు మాట రాలేదు ఏడ్చేశాడు

ఆ ఉద్వేగం చల్లారిన తర్వాత మరి మినిస్టరుగారు అన్నాడు సంశయంగా

ఈ మంత్రులందరూ వెనక ఉండి ఆడించేవారే బయటపడరు నీ వద్ద ఆఫీసరికి వ్యతిరేకంగా బలమైన సాక్ష్యాధారాలున్నాయని, నిన్ను అరెస్టు చేస్తే వాటిన్ని బయటపెట్టి కోర్టుకెక్కుతానని బెదిరించావని మంత్రిగారి పేరు బయటకు వస్తుందని - ఆయనకు ఫోన్ చేయించాను, కోర్టులూ, కేసులూ - అందువల్ల వార్తాపత్రికల్లో జరిగే వ్యతిరేక ప్రచారం అంటే మంత్రులకు మహా భయం అందుకే మహానుభావుడు తొక్క ముడిచాడు కానీ నీకు బదిలీ కావచ్చు అందుకు సిద్ధంగా ఉండు నీకో సాయం కావాలన్నా నన్ను కలుసుకో

థాంక్యూ మై డియర్ ఫ్రెండ్' నిన్ను తిట్టుకున్న మాట నిజమే నన్ను క్షమించు నీవే నిజమైన మిత్రుడవు. నీకు చేయెత్తి నమస్కరిస్తాను కాని ఒక్క అనుమానం నేను కూడా అవినీతిపరుడనే అయితే నీవు నన్ను రక్షించేవాడివా?

తల అడ్డంగా తిప్పాడు రాజారావు

"నా నిజాయితీ నిన్ను కదిలించింది నన్ను రక్షించింది ఈ లోకంలో నీతికి, నిజాయితీకి - యింకా గౌరవం లభిస్తూనే వుంది అన్నాడు రామారావు సగర్వంగా

చిన్నగా నవ్వుకున్నాడు రాజారావు' □

విడి వనస్పతి?



# ఈసారి మీ కుటుంబానికి సన్‌ఫ్లవర్ రక్షణ కవచంతో భద్రత నివ్వండి.




## సన్‌ఫ్లవర్ ఎకానమీ ప్యాక్. విడి వనస్పతి కంటే కొద్ది పైసల ఎక్కువ ధరకే శుద్ధమైనది.

మీ కుటుంబానికి అత్యంత సురక్షితమైనదీ, భద్రమైనదీ ఇవ్వండి: సన్‌ఫ్లవర్ బ్రాండ్ వనస్పతి. సన్‌ఫ్లవర్ రక్షణ కవచంతో ప్యాక్ చేయబడి, సీలు చేయబడినది. విటమిన్ ఎ,డి చేరిన పరిశుద్ధమైన పుష్టికరమైన వనస్పతిని మీ కందించే నిమిత్తం ఇలా చేయబడింది.

# సన్‌ఫ్లవర్ బ్రాండ్ వనస్పతి

మంచి నెయ్యి మాత్రమే దీన్ని మించగలది.




WPL/25 35

1కిలో, ½కిలో ప్యాక్‌లలో లభ్యం

WIPRO LTD - Closer to the consumer

సీరియల్

# బలి కోరిన ప్రేమ

ఎం.డి.సౌజన్య

(గత సంచిక తరువాయి)

అంత వరకు కాంతిభూషణ్ చెప్పిన స్వీయ చరిత్ర విన్న అన్నపూర్ణ "డియర్ పర్వతారోహణ బృంద నాయకుడు మహిపాల్ ఎంత దుర్మార్గుడో నాకు అతన్ని వివాహం చేసుకొనే ప్రయత్నంలో నే తెలిసింది!" అది బాధపడుతూ

"అవంతీ! నాకు ఇప్పటికీ ఆశ్చర్యం నువ్వు మహిపాల్ మాటల్ని అంత తేలిగ్గా ఏ విధంగా నమ్మావో!?" అన్నాడు విషయం తెలుసుకోవాలనే కుతూహలంతో కాంతిభూషణ్

అన్నపూర్ణ అతని డైరీలు చదివి వుండడటం వల్ల కొంత, అతను అంత వరకు పర్వతారోహణ కాలంలో జరిగిన కుట్ర వివరాలు చెప్పటం వల్ల అన్నపూర్ణకు విషయం కొంత వరకు అవగాహన అయింది

తను మహిపాల్ శ్రీమతిగా గడిపిన కాలాన్ని గురించి ఏం కల్పించి చెప్పినా పెద్దగా ఎవరికీ ఇబ్బంది వుండదు

ఆ చెప్పేది మహిపాల్ మీద కక్ష ఇంకాస్త పెరిగేట్టు, తన మీద ఇంకా సానుభూతి కలిగేట్టు చెప్పుకుంటే నష్టం ఏమిటి? అనుకుంది అన్నపూర్ణ ఆలోచిస్తూ

అన్నపూర్ణ మౌనానికి కారణం బహుశా ఆమె మహిపాల్‌ను వివాహం చేసుకోవటం వల్ల కలిగిన పరితాపం, అతనితో ఆమె విడిపోవటానికి దారి తీసిన సంఘటనలు వాటికి సంబంధించిన చేదు నిజాలు చెప్పటం ముఖ్యంగా తనకు చెప్పటానికి ఆమె సంశయిస్తున్నదేమోనన్న ఆలోచన కాంతిభూషణ్‌కు కలిగింది

నిజానికి అవంతి స్థానంలో వచ్చిన తను ఏం చెబితే అతని సానుభూతిని బాగా సంపాదించవచ్చో, అన్నపూర్ణ ఆలోచిస్తోంది

"అవంతీ! నీకు అంత బాధ కలిగించే విషయాలు చెప్పమని నేను కోరను !!" అన్నాడు ఆమె పట్ల సానుభూతితో

అన్నపూర్ణ ఈలోపు ఒక కథ అల్లుకుంది, తను చదివిన అతని డైరీలోని విషయాలు కొన్ని గుర్తు చేసుకొని వాటిని ఏ సందర్భంలో ఎక్కడ వాడాలో వూహించుకుంటూ,

"కాంతిభూషణ్" నువ్వనుకున్నట్టు ఆ దుర్మార్గుడు మహిపాల్‌తో నా వివాహం జరిగే వుండేది " కాని నా అదృష్టం బాగుండి ఆ వివాహం త్రుటిలో తప్పిపోయింది

ఖాట్మండ్ ఎయిర్‌పోర్ట్‌కు దగ్గరగా పది మైళ్ళ దూరంలో వున్న పశుపతి నాద దేవాలయంలో మేము వివాహం చేసుకుందామనుకున్నాం!

మా వివాహం కాగానే ఖాట్మండ్ నుంచి, కాశ్మీర్, హనీమూన్‌కు వెళ్లాలని మేమిద్దరం ఆ రాత్రి ఫ్లయిట్‌కే ప్లేన్ టిక్కెట్లు రిజర్వ్ చేసుకున్నాం!

పశుపతినాద దేవాలయం మన హిందూ సనాతన ధర్మశాస్త్రబద్ధంగా వైదిక విధిలో వివాహాలు జరుగుతాయి

దానికి కావలసిన ఏర్పాట్లు అన్నీ ముందు రోజే మహిపాల్, అతని మిత్రులు చేశారు

నాకు పరిచారికగా తోటి పనిమనిషిగా వుండటానికి నేపాల్ అమ్మాయి ఒకామెను మహిపాల్ తనే ఏర్పాటు చేశాడు

నేను ఆ రాత్రి ఆ అమ్మాయితో ఖాట్మండ్‌లోని హోటల్ 'గంగోత్రి'లో వున్నాను

తెల్లవారితే నేను, నేపాల్ అమ్మాయి గుర్రాల మీద పశుపతినాథ దేవాలయం చేరాలి వివాహం అవగానే విందు, తరువాత రాత్రికి కాష్మీర్ హనీ మూన్ ట్రిప్

అయితే ఆ రోజు రాత్రి మంచు తుపాను ప్రారంభమైంది

అసలా చలికి రాత్రి నిద్రే పట్టలేదు

నేను, నాతో పాటు నేపాల్ అమ్మాయి ముందు వివాహ మండపం వున్న దేవాలయం చేరుకోవాలి! "ఈ మంచు తుఫానులో గుఱ్ఱాలు నడవవు! పోనీ ఏదైనా జీప్‌లాంటి వాహనం పోయే మార్గం కాదది! దాదాపు కాలిబాటలా వుంటుంది ఆ దారి!" అంది నేపాల్ అమ్మాయి

"అయినా మనం వెళ్ళకపోతే ఎలా? పోనీ మనను సురక్షితంగా ఆ దేవాలయం చేర్చే బృందం ఏదయినా ఎంత డబ్బయినా తీసుకుని సాయపడటానికి సిద్ధంగా వుందేమో ప్రయత్నించు!" అన్నాను నేను

ఆ అమ్మాయి హోటల్ ప్రొప్రయిటర్‌తో నా ముందే సంప్రదించింది

ఎవరూ ఆ తుపానులో బయలుదేరటానికి సాహసించకపోగా "గుఱ్ఱాల మీద ఈ మంచు తుపానులో ప్రయాణం మొదలు పెడితే గుఱ్ఱాలు నడవవు " ఒక వేళ వాటిని హింసించి బలవంతం చేస్తే అవి బెదరి పిచ్చి పట్టినట్టు పరుగులు పెడతాయి! అది మరి ప్రమాదం ఏ విదంగానైనా కాలి నడకే మంచిది!" అన్నారు

చివరికి తాగబోయించి చాలా పెద్ద మొత్తాలు ముట్ట చెబుతామని ఆశపెడితే, యాత్రికులకు మూటలు మోసే షెర్పాలు నలుగురు దొరికారు! నేను వివాహ మంటపం త్వరగా చేరాలని ఇంకా తెల్లవారక మునుపే నా ఉన్ని దుస్తులు దిట్టంగా ధరించి బయలుదేరాను

ఒక గట్టి ఇనుప రాడ్‌ను నలుగురు షెర్పాలు రెండు పక్కలా ఇద్దరిద్దరు చొప్పున పట్టుకొని నడుస్తుండగా నేను, నేపాల్ అమ్మాయి మా సూట్‌కేసులతో ఆ రాడ్‌ను ఆదారంగా పట్టుకొని నడవసాగాము

మంచు తుఫాను ఉధృతం మేము ఊహించినదానికంటే అధికంగానే వుంది

కాలు ముందుకు సాగటం లేదు! తుపాన్ మమ్మల్ని నెట్టి వేస్తోంది కాళ్ళు క్రింద జారిపోతున్నాయి

మంచు వుండలు ముఖం మీద దొర్లించినట్టు పడుతుండటం వల్ల చూపు సరిగా ఆనటం లేదు

అలాంటి తుఫానులో నడిచే అలవాటున్న షెర్పాలు అతి కష్టం మీద కొంత దూరం నడిచి ఆగిపోతున్నారు

అలా మా ప్రయాణం నాలుగు గంటలు పట్టింది అదేమి విచిత్రమో మేము ఆ పశుపతినాదదేవాలయం చేరేప్పటికి ఆ మంచు ఉధృతం తగ్గింది

అక్కడ అప్పటికే పురోహితుడు మంటపం దగ్గర సిద్ధంగావున్నాడు

నేను ఇక మహిపాల్ కోసం ఎదురు చూడాల్సి వచ్చింది

ఆ రాత్రికి మహిపాల్ ఆ దేవాలయ సత్రంలో వుండి అక్కడ జరిగే డిన్నర్‌కు సంబందించిన ఏర్పాట్లు చేస్తానన్నాడు!

అతను అక్కడే వుంటాడు కాబట్టి ఇబ్బంది లేదనుకున్నాను!

కాని అతను మంచు తుఫాను ప్రారంభం కాక మునుపే రాత్రే అక్కడి నుంచి వెళ్ళిపోయినట్లు తెలిసింది పెళ్ళి వేళకు తప్పకుండా వస్తాడనుకుని తక్కిన

**జరిగిన కథ-9 :** ప్రమాదవశాత్తు మంటల్లో పడటం వల్ల కాంతి భూషన్‌కి కళ్ళు పోయాయి అవంతి స్థానంలో అవంతిగా అన్నపూర్ణ కాంతి భూషణ్‌తో నటించడం ప్రారంభించింది, ఎవరో అజ్ఞాత వ్యక్తి ఫోను చేయగా రమాదేవి, అన్నపూర్ణ హోటల్ ఏషియాకు బయలుదేరారు ఆ అజ్ఞాత వ్యక్తి రవికాంత్, అతనితో తనకిక ఎలాంటి సంబంధం లేదని కచ్చితంగా చెప్పి వచ్చేస్తుంది అన్నపూర్ణ అవంతిగా నటిస్తున్న అన్నపూర్ణతో మంచు తుపాను ముందు రోజు హిమాలయాలు దిగి వస్తుండగా జరిగిన సంఘటన చెప్పసాగాడు కాంతిభూషణ్ తనపై ఏ విధంగా హత్యా నేరం మోపబడింది, తరువాత నిర్దోషియని రుజువై ఏ విదంగా విడుదలయింది చెప్పసాగాడు కాంతిభూషణ్

ఏర్పాట్లు చేసుకున్నాము

పెండ్లి ముహూర్తపు కాలం సమీపిస్తున్నది. రాహు ఘడియలు రాక మునుపే మాంగళ్యధారణ జరగటం శ్రేయస్కరమని పురోహితుడు తొందర చేయసాగాడు

ఉదయం పదకొండున్నరకు ముహూర్తం'' పన్నెండున్నర అయినా మహిపాల్ జాడ ఎక్కడా లేదు''

పోనీ అతనేమయ్యాడో తెలుసుకోడానికి అవకాశం కూడా లేదు

మంచు తుపాను వల్ల నేను పెళ్ళి జరిగే దేవాలయానికి రాలేకపోతే నన్ను తేవాలని ఏమైనా వెళ్ళి వుంటాడా?

ఏమో? అంతా నేను వూహిస్తున్నదే''? అతను నిజంగా ఏమయి వుంటాడో తెలియదు'

రాత్రి చీకటి పడే వరకు అక్కడే ఎదురు చూశాను మహిపాల్ కోసం'

కాని అతని జాడ లేదు

చివరికి నేను నాతో పాటు ఆ నేపాల్ అమ్మాయి మిగిలాం'

తిరిగి నేను అక్కడి నుంచి బయలుదేరాను

ఎక్కడికెళ్ళాలో ఏం చేయాలో తెలియదు

పీటల మీద పెళ్ళి ఆగిపోయినందుకు అదొక అశుభమనే బాధ వుంది'

మహిపాల్ నన్ను మోసం చేయాలనే భావన వున్నవాడైతే అసలు పెళ్ళి పీటల దాకా రానిచ్చేవాడా?

అతనికేదో అయ్యుంటుందనే అనుమానం నాలో బలపడసాగింది

అదెమిటో అతనెలాటి పరిస్థితిలో వున్నాడో తెలుసుకోవటమెలా?

ఇలా ఆలోచిస్తూ ఖాంట్‌మండ్ ఎయిర్‌పోర్ట్‌కు వెళ్ళాను'

ప్లేన్ టైం ప్రకారం ప్లేన్ వెళ్ళిపోయింది'

ఆ ప్లేన్‌లో మేము కాష్మీర్ హనీమూన్‌కు దంపతులుగా వెళ్ళాల్సి ఉంది.

మరి ఆ టిక్కెట్లతో, కనీసం మహిపాల్ అయినా వెళ్ళాడా లేదా తెలుసుకుందామని వెళ్ళి ఎంక్వయిరీలో వివరాలు అడిగాను

మహిపాల్ అనే అతన్ని ఖాట్‌మండ్ బార్డరులో నల్ల మందు స్మగుల్ చేసి తెస్తుండగా సెక్యూరిటీ సి ఐ డి లు పట్టుకున్నారని, అతని ఫ్లయిట్ క్యాన్సిల్ చేయమని వాళ్ళే అధికారికంగా చెప్పారట'

ఈ వార్త వింటూనే నాకు మిన్ను విరిగి మీద పడ్డట్లయింది'

స్మగ్లింగ్‌లాంటి నేరస్తులని నేపాల్‌లో అత్యంత కఠినమైన శిక్షలు విధిస్తారు

నాతో పాటు వున్న నేపాల్ అమ్మాయి, మహిపాల్‌కు ఉరి శిక్ష పడుతుందని చెప్పింది'

నేను నీకు ద్రోహం చేసి, అతని మాట నమ్మినందుకు తగిన శిక్షే పడిందని కుమిలిపోయాను తిరిగి నీకు నా ముఖం ఎలా చూపాలో అర్థం కాలేదు

ఇన్నాళ్ళూ మొహం చెల్లక ఇటు రాలేకపోయాను కాని ఎందుకో ఒకసారి నిన్ను చూడాలనిపించింది

నా ముఖం నువ్వు చూస్తావో . చూడటానికి ఈసడించుకుంటావో తెలియదు' అయినా ప్రాణం ఆగక ఇటు వచ్చాను' ఆ చేదు గతాన్ని గుర్తు చేసుకోవటం నాకు ఇక ఇష్టం లేదు- అంది అన్నపూర్ణ

జరిగింది ఏమి దాపరికం లేకుండా చెప్పినందుకు కాంతిభూషణ్ సంతోషించాడు

ఇక అతను ఆ విషయంగా ఏమి అడగకూడదనే నిర్ణయించుకున్నాడు

మహిపాల్ చేసిన ద్రోహానికి అతనికి తగిన శిక్షే పడ్డందుకు కాంతిభూషణ్ సంతోషించి ''అవంతీ? తప్పు చేయటం మానవ సహజం ' నేను నిన్ను దురదృష్టవశాత్తు దూరం చేసుకున్నాను కాని విధి మనని మళ్ళీ ఈ పరిస్థితిలో కలుపుతుందని ఇలా కలుపుతుందని కలలో కూడా అనుకోలేదు'' ఓ వేళ నా చూపు తిరిగి రాకపోతే '?' అన్నాడు కంఠం రుద్ధమవుతుండగా,



# బలికోరిన ప్రేమ

కాంతిభూషణ్

'లేదు డియర్" నువ్వు అలా అనకు " మనిషి ఎప్పుడూ ఆశాజీవిగానే జీవించాలి"' అంది అతనిని నిస్పృహ చెందనీయకుండా ధైర్యం చెప్పే ప్రయత్నంలో

కిడెంచి మేలెంచమంటారు " ఓ వేళ నాకు చూపు తిరిగి రాకపోతే " నువ్వు ఈ గుడ్డివాడి కోసం నీ నూరేళ్ళ నిండు జీవితాన్ని బలి చేసుకోకు అవంతీ"' అన్నాడు ఆమె చేతులుపట్టుకుని ఏడుస్తూ

అన్నపూర్ణకు ఆ మాటలతో హృదయం అర్ద్రమయింది

మనిషి ప్రేమించేది కేవలం బాహ్య రూపాన్నే అయితే అది కామమే కాని ప్రేమ కాదు " మన ప్రేమ ఈ శరిరాకర్షణలకతీతమైంది " ఇక బ్రతికినా, చచ్చినా నీతో నే డియర్" నీతో నే!'' అంది అన్నపూర్ణ

'వద్దు అవంతీ" నేను అంత త్యాగానికి అర్హుణ్ణి కాను" లోకమే శాశ్వతంగా అంధకారమైన ఈ గుడ్డివాడి కోసం నీ బ్రతుకు శాశ్వతంగా చీకటి చేసుకుంటావా?'' అన్నాడు ఆమె గుండెల మీద వాలిపోయి ఏడుస్తూ

ఇంతలో ''అబ్బాయ్ భూషణ్ మి గిరి మామయ్య వచ్చాడ్రా?" అమ్మాయ్ అవంతీ! నేను చెప్పలా పోలీస్ ఆపీసర్ చేసి రిటైరైన మా అన్నయ్య వస్తున్నాడని"' అంది సంతోషంతో

ఇంతలో హలో అల్లుడూ హౌ డూ యూ డూ అంటూ వచ్చి కళ్ళకు కట్టివున్న పెద్ద కట్టు చూసి బాదగా ఆగిపోయాడు ఆయన

అన్నపూర్ణ అతనికి తన ముఖం కనపడకుండా చాటుగా వెళ్ళింది

కళ్ళకు ఇంత ఘోరంగా ఎలా తగిలిందమ్మా ఇంత పెద్ద దెబ్బ '? అడిగాడు చెల్లెల్ని గిరి

ఏంచెప్పమంటావన్నయ్యా '? నా తల రాత ' అంటూ కన్నీళ్ళు కుక్కకుంది, రమాదేవి తరువాత ఆమె జరిగింది చెప్పింది మేనల్లుడికి వచ్చిన విపత్తుకు బాదపడటం తప్ప, ఇంకేమి చేయలేకపోయాడు గిరి

ఆదునిక విజ్ఞానశాస్త్రం ఎంతో ప్రగతి సాధించింది భూషణ్" ఈ అత్యాదునిక యుగంలో అసాద్యం ఏది లేదు " కంటి చూపు విషయంలో బయపడాల్సిందిఏమి లేదు " గుండె మార్పిడి చేస్తున్న ఈ రోజుల్లో కంటి చూపు ఒక పెద్ద విషయంకాదు! అన్నాడు ధైర్యం చెబుతూ, కాంతిభూషణ్ బుజం తడుతూ

అత్తయ్య రాలేదా మామయ్యా? అడిగాడు భూషణ్ కుతూహలంగా

నేను రిటైర్డు అయిన తరువాత ఆమే యాక్టివ్ జీవితం నుండి రిటైరయ్యింది" టైంటేబిల్ వేసుకుని దేశంలోని పుణ్యక్షేత్రాలన్నీ చుట్టుబెట్టుకు వస్తోంది" ఆమె సింహాచలం వెళ్ళింది " నేను ఎన్నోసార్లుచూశాను ఆ సింహాచలం "పైగా సింహాచలం దేవాలయంలో జరిగిన దేవుడినగల అపహరణ కేసు నేను టేకిల్ చేసిందే! అన్నాడు




ఈ లోపు రమాదేవి క్రింద ఏదో ఏర్పాట్లుచేయాలని వెళ్ళగానే ఈ అమ్మాయి ? అంటూ ఆగాడు, గిరి

మిస్ అవంతి నా వుడ్‌బి " అవంతీ ఈయన మా పోలీస్ సూపర్నెంట్ మామయ్య! అన్నాడు కాంతిభూషణ్

నమస్తే! అంది అన్నపూర్ణ చేతులు జోడించి, ఆయన వైపుకు తిరిగి

నమస్తే! అంటూ గిరి ఆమె వైపు తిరిగి ఏదో గుర్తొచ్చినట్లు అయి, అలాగే చూస్తూ వుండిపోయాడు

ఆయనను ఎక్కడో చూసినట్లు గుర్తు రాగానే అన్నపూర్ణ షాక్ అయ్యింది

నిన్ను ఎక్కడో చూసినట్లుంది? అడిగాడు గిరి అన్నపూర్ణ సమాదానం వెంటనే చెప్పలేకపోయింది

మనుషుల్ని పోలిన మనుషులుంటారుగా మామయ్యా" నువ్వు అవంతిని ఎక్కడా చూసి వుండవు " అంతవరకు కచ్చితంగా చెప్పగలను" అన్నాడు బల్లగుద్దినట్లు

''ఏమిటి భూషణ్ " అంత కచ్చితంగా ఎలా చెబుతున్నావ్ '?'' అన్నాడు గిరి

''అవంతి చిన్నప్పటి నుంచి అస్సాం ప్రాంతంలో పెరిగింది" ఆమె ఆంధ్ర అమ్మాయి అయినా ఆమె తల్లిదండ్రులు ఉద్యోగ రిత్యా అస్సాంలో వుండటం వల్ల ఆమె దాదాపుగా ఈ ప్రాంతానికి కొత్త! '' అన్నాడు వివరణ ఇస్తూ

కాని ఆ సమాదానం గిరికి సంతృప్తి కలిగించలేదు!

అతను ఒక పోలీస్ అదికారి పాత నేరస్తుణ్ని చాలా కాలం తరువాత చూసి గుర్తుపట్టటానికి ప్రయత్నించినట్లు నిశితంగా చూడటం ప్రారంభించాడు

అన్నపూర్ణకు ఇక అక్కడుంటే ఇంకేం ప్రశ్నలు అడుగుతాడో, తను ఏం సమాధానం చెప్పాల్సి వస్తుందోనన్న బయం పట్టుకుని అక్కడి నుంచి క్రిందికి వెళ్ళిపోయింది

అయితే గిరి ఆమె వెంటే క్రిందికి వెళ్లాడు

అన్నపూర్ణ క్రిందికి వెళ్ళగానే ఆమెను ఆపి ''నీ పేరు అన్నపూర్ణ నువ్వు డ్రామా నటివి కదూ? అన్నాడు గిరి తీక్షణంగా

అన్నపూర్ణ దెబ్బ తిన్నట్టు అతని వైపు చూసింది బయం బయంగా!

''రవికాంత్ అనే ఓ మోసగాడు నిన్ను రిజిష్టర్ వివాహం చేసుకున్నాడు !'' చెప్పాడు గిరి

''అయితే మీరు?!'' అంది అన్నపూర్ణ షాక్ తిని

''ఆ రోజు రవికాంత్‌ని, నిన్ను అరెస్ట్ చేసిన పోలీస్ అదికారిని !'' అన్నాడు, గిరి తనెవరో చెబుతూ

అన్నపూర్ణ గుండె బయంతో మరింత గట్టిగా కొట్టుకోవటం ప్రారంబించింది!

''మైగాడ్ " ఈయన కాంతిభూషణ్‌కి మేనమామ కావటమే కాక ఈయన సరిగా ఇప్పుడే అక్కడికి రావాలా? ఈ నిజం ఆయన చెబితే అసలే తలకు దెబ్బ తగిలి వున్న కాంతిభూషణ్ ఏమయిపోతాడో !'' అని ఆమె హృదయం తల్లడిల్లిపోసాగింది ఆమె ఏ సమాధానం చెప్పలేకపోయింది

''యూమై కరెక్ట్!'' అన్నాడు గిరి రెట్టిస్తూ

అన్నపూర్ణ తల వూపింది- ఇంకేం చేయాలో- ఏం చెప్పాలో- మరో మార్గం లేక

''అయితే మళ్ళీ మా కాంతిభూషణ్‌తో ఈ ప్రేమాయణమేమిటి?'' అడిగాడు గిరి

అన్నపూర్ణ జరిగింది చెప్పి ఏ పరిస్థితిలో తను అవంతిగా నటించటానికి అంగికరించిందో చెప్పింది

''అవునన్నయ్యా" నేనే అన్నపూర్ణను అవంతిగా రమ్మనమని బ్రతిమాలి తెచ్చాను! ఇందులో అన్నపూర్ణ తప్పేమిలేదు! ' అంది, అన్నపూర్ణ మాటలు అంత వరకు విన్న రమాదేవి అక్కడికొచ్చి గిరి ఏమి అనలేకపోయాడు!

అన్నపూర్ణవంటి నటి కాంతిభూషణ్ జీవితంలో ప్రేయసిగా నటించటం ఆయనకు నచ్చలేదు

# జై కిసాన్ పనితనం అద్భుతం
# పొలంలో పండింది బంగారం

కారణం ఏమిటంటే ఉత్తమ శాస్త్రీయ పద్ధతిలో తయారైన జైకిసాన్ ఎరువులు నీటిలో ఇట్టే కరుగుతాయి మొక్కలకు వెంటనే అందుతాయి అందుచేత కాస్తంత ఎరువు కూడా వృధాగా పోదు. పూర్తిగా మొక్కలకు అందుతుంది మరి మీరు కూడా జైకిసాన్ ఎరువులు తెచ్చుకోండి పొలంలో బంగారం పండించండి!

**జైకిసాన్ యూరియా 46 4% నత్రజని**

స్వచ్ఛమైన తెల్లని గుళికల రూపంలో వుండే జైకిసాన్ యూరియా 46 4% నత్రజనితో సమృద్ధమైనది ప్రతి నేలకూ ప్రతి పంటకూ ఉత్తమమైనది

**జైకిసాన్ సంపూర్ణ 19 19 19**

ముఖ్యంగా ప్రత్తి వరి గోధుమ చెరకు మొదలైన పంటలకూ పొటాష్ లోపం గల నేలలకూ ఉత్తమమైనది

**జైకిసాన్ సామ్రాట్ 18 46 0**

వర్షాధార పంటలకు ఇది అతి ఉత్తమమైన ఎరువు ప్రతి నేలకూ ప్రతి పంటకూ అనువైనది

---

సరైన సంతులిత ఎరువులు వాడితే అత్యధిక లాభాలు చేకూరుతాయి జువారి వారి ఉచిత భూసార పరీక్షా సేవను వినియోగించుకొని ప్రయోజనం పొందండి

---













## జై కిసాన్ రాజ్యం-ధాన్యలక్ష్మి సామ్రాజ్యం

**జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్ గోవా**

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు సికింద్రాబాద్ విజయవాడ బెంగుళూరు హుబ్లి నాగ్‌పూర్ పుణె ఇండోర్ ఆగ్రా జువారి నగర్

LINTAS ZUA 133 2317 TL

## బలికోరిన ప్రేమ

జీవితంలో నటించటం జీవితాలతో నటించటం ఎప్పటికీ మంచిదికాదని నా నమ్మకం' అయినా అబదాలతో మోసంతో ఎవరినైనా ఎన్నాళ్ళు మభ్యపెట్టగలం' అన్నాడు గిరి

ఈ ఎరిస తుల్లో ఇంతకంటే గత్యంతరం లేకపోయిందన్నయ్యా' అన్నపూర్ణ అసలు ఈ ఎనిని ఋతారామూ వొప్పుకోలేదు' నా బలవంతం మిద తనకు అయిష్టమైనా కాంతిభూషణ్ కోసం నేనే వొప్పించాను' అంది రమాదేవి అన్నపూర్ణను సమరి స్తూ

ఇంతలో పోను మ్రోగితే రమాదేవి వెళ్ళింది

చూడమ్మా' రమాదేవి వాలకం చూస్తే నిన్ను నిజంగానే అవంతిని చేసేటట్లుంది'' కాని నువ్వు మిసెస్ రవికాంత్‌వన్న సంగతి మర్చిపోకు'' అలా మరచిపోవటం జరిగితే అది నీతో పాటు మా భూషణ్‌ని కూడా ఊబిలోకి లాగుతుంది'

అన్నపూర్ణకు రవికాంత్‌తో మద్రాసులో రిజిస్టర్ మ్యారేజ్ అయిన సంగతి పోలీస్ ఆపసర్‌గా గిరికి తెలుసు'

రవికాంత్‌ప్రస్తుతం విశాఖపట్నంలో నేవున్న సంగతి గిరికి చెబుదామనుకుంది అన్నపూర్ణ ఇంతలో రమాదేవి వచ్చి రామ్మా' అబ్బాయికి బోజనం వేళయింది' అంది

అన్నపూర్ణ యాంత్రికంగా నడిచిందే కాని ఆమెకు గిరి యిచ్చిన హెచ్చరిక గుర్తొస్తూనే ఉంది

అనవసరంగా యింకా ఊబిలోకి దిగటంలేదు కదా? అనుకుంది అన్నపూర్ణ

కాని ఎటి మద్యలోకి వచ్చిన వ్యక్తి ఏదో విదంగా అటు వొడు చేర్చాలి మద్యలో వెనక్కు తిరిగి రాలేదు కదా'?

అలాగే వుందనుకుంది తన ఎరిస తి

గిరి తన చెల్లెలితో ఎదో మాట్లాడుతూ వుండటం టీలగా వింది అన్నపూర్ణ బహుశా తనను గురించే అయివుంటుందనుకుంది రమాదేవి సహకారం వున్నందువల్ల తన ఎని కొంత మేలనుకుంది

గిరి ఇంట్లో వున్నంతసేపూ అన్నపూర్ణకు ముళ్ళమిదవున్నట్లే వుంది అతను ప్రతిక్షణం ప్రతిదాన్నీ ప్రతి వస్తువునూ నిశితంగా ఎరిశీలించే అలవాటున్న వ్యక్తిలా కనిఎంచాడు

అతను ఎమి మాట్లాడినా ఆమెకు ఏదో కనిఎంచని వ్యంగ్యం ఆ మాటల వెనక గోచరమవసాగింది అతని ప్రతి కదలికలో ఒక ప్రత్యేకత ఆమెకు స్ఫురింపసాగింది

ఆమెను అతను గుచ్చి గుచ్చి చూస్తున్నాడనిఎంచసాగింది

దీనితో ఆమెకు ముళ్ళ మీద కూర్చున్నట్లే వుంది

ఇక్కడి నుంచి ఆయనగాని నేనుగాని ఎంత త్వరగా వెళ్ళిపోతే అంత బాగుండు అనిఎంచింది

కాని గిరి ఏదో ఎట్టుదలతో ఒక దృఢ నిశ్చయంతో వ్యవహరిస్తున్నట్టు కనిఎంచసాగాడు అతను ఎక్కువసేపు ఏదో కబుర్లు చెబుతూ మాటలు కల్పించుకుని కాంతిభూషణ్‌గదిలో నే వుండసాగాడు

రమాదేవి కూడా ఈ వాతావరణం అన్నపూర్ణకు ఇబ్బంది కలిగిస్తోందని అర ం చేసుకుంది'

ఆమె అన్నయ్యను అక్కడి నుంచి ఎంపవేయాలని గట్టిగా నిర్ణయించుకుంది

కాని అతను ఏదో ప్రత్యేక ఎట్టుదలతో అక్కడే మొండిగా ఉండాలనుకున్నట్టుగా మీ వదిన సంహాచలం నుంచి వచ్చేదాకా ఇక్కడే విశ్రాంతి తీసుకుంటాను'

ఏమిటో ఇన్ని వూళ్ళు తిరిగాను కానీ నాకు ఎందుకో వాల్తేరు బాగా నచ్చుతుందమ్మా' అన్నాడు

ఆ రోజు సాయంత్రం రమాదేవి షాపింగ్‌కని బయలుదేరుతూ అన్నపూర్ణా' నేను లేనప్పుడు మా అన్నయ్య ఒక వేళ నిన్నేమి అడిగినా ప్రశ్నించినా తెలివిగా మసలుకో' అంటూ హెచ్చరించి వెళ్ళింది

తను లేనప్పుడు తనను గురించిన నిజం కాంతిభూషణ్‌కు చెప్ప అతని మనసు ఎక్కడ విరుస్తాడో లేనిపోని ఏ కలతలు సృష్టిస్తాడో ' అని అన్నపూర్ణ ఒక ప్రక్క ఆందోళన చెందుతోంది లొలో ఎల

ఆమె బయపడుతున్నట్టుగానే రవికాంత్ ఫోన్ చేశాడు

మొదట కాంతిభూషణ్ ప్రక్కనే కూర్చుని ఎవో జోక్స్ వేస నవ్విస్తున్న గిరి పోన్ అందుకుని హలో అని అది అన్నపూర్ణకు వచ్చిన పోన్ అని తెలిస పోన్ అందించాడు

అన్నపూర్ణ హలో అనగానే గుడ్‌మార్నింగ్ డియర్' మీ అత్త రమాదేవిగారు బయటికి వెళ్ళటం తెలిసే పోన్ చేస్తున్నాను' మనిద రం దంపతులైన క్షణాన మనను అరెస్టుచేస విడదీసిన అప్పటి పోలీస్ ఆఫీసర్ కాంతిభూషణ్ బందువని తెలిసింది గుడి వాడని నువ్వు కాంతిభూషణ్ కళ్ళల్లో కారం కొట్టవచ్చు' కాని అవులిస్తే ప్రేవులు లెక్కపెట్టే మాజీ పోలీసు అదికారిని నువ్వు మోసం చేయలేవు' నీ గట్టు ఇంకా పూర్తిగా రట్టు కాక మునుపే నువ్వు అక్కడి నుంచి బయటపడి వస్తే ఇప్పటికైనా నిన్ను నా డబ్బులో హాఫ్ పోర్షన్ ఇచ్చి నిన్ను నా బెటర్ హాఫ్‌గా స్వకరిస్తారు '' నా ఫోన్ నెంబరు 999 హోటల్ చెప్పాడు రవికాంత్

అతని మాటలు ఎక్కడా బయటకు వినపడతాయో' అవి వింటే మాజీ పోలీసు ఆఫీసరు గిరి నుంచి ఎటువంటి ప్రతిఘటన వస్తుందోనని అన్నపూర్ణ తన ముఖ కవళికలలో ఆ వార్త తాలూకు బయంకాని ఆందోళనగాని ముఖంలో ప్రతిఫలింపనీయలేదు

తన ముఖంలోకి అతను చూస్తున్నాడేమోనని ఒక ప్రక్క చూస్తూనే ఆమె పోన్ సంబాషణలు సాగిస్తూ అలాగే '' ఆ ఆ' వీలునుబట్టి అవసరమైతే అలాగే ఫోన్ చేస్తాను' అంది పోన్‌పెట్టివేస్తూ

ఎవ్వరు పోన్? అడిగాడు గిరి

ఒక పాత ఫ్రెండ్' చెప్పింది అన్నపూర్ణ

ఏమంటాడు? అడిగాడు మళ్ళీ గిరి

ఏదో విషయంలో హెల్ప్ కావాలా అన్నాడు అవసరమైతే తప్పకుండా అలాగే ఫోన్ చేస్తానన్నాను '' ఎర్సనల్ విషయంలెండి' అంది

## శివోక్తం

(ప్రఖ్యాత కన్నడ కవి సర్వజ్ఞవచనాలు ఆదారంగా)

జనసమూహమ్ము లేని రాజ్యమ్ముగాని
కందువులు లేని ఎట్టి బాగ్యమ్ముగాని
బంధు వర మ్ము లేనట్టి బ్రతుకు గాని
మదిని రంజింపలేవే యదనునైన

నీదు మునుజన్మ కర్మలు నిన్ను దగులు
వదల వెన్నడు కావున ప్రాజ్ఞుడగుచు
ననుబవింపుము ఎలితమేమైన గాని
మంచి చెడ ల నొకరీతి నెంచుమయ్య

మూర్ఖునికి చాల కాలమ్ము బోద జేస
నను సుగుణలేశ మతనిలో గనగలేము
గండశిల మీద ఘనఘనాఘనము కురియు
గాని ఒకబొట్టు శిలలోన గనగలేము

–కనమలూరు వెంకటశివయ్య

తన ముఖంమీద ఏ విధమైన భయం తాలూకు ఛాయలు కన్పించనీయకుండా

లోలోపల ఆమెకు రవికాంత్ మళ్ళీ ఫోన్ చేస్తే ఆ కాల్ గిరి తీసుకుంటే పరిణామములెలా ఉంటాయో అన్న భయం ఒక ప్రక్క పీకుతోంది

మాజీ పోలీస్ ఆఫీసర్ ఆ మాటలు నమ్మినట్లు లేదు

అవంతీ! ఇక్కడ మంచంమీద కూర్చుని కూర్చుని బోర్‌గా ఉంది! నన్ను హోటల్ డాల్ఫిన్ రూఫ్ గారెన్‌కు డిన్నర్‌కు తీసుకెళ్ళు! అన్నాడు కాంతిభూషణ్

అత్తయ్య ఇంట్లో లేరు! ఆమె రాగానే అడిగి వెడదాం? అంది అన్నపూర్ణ

అమ్మ వద్దంటుందా? అమ్మకు నేను తరువాత చెపుతాను ఎద అవంతీ!! అన్నాడు మంచం తడుముకుంటూ లేచిన కాంతిభూషణ్

వెళ్ళమ్మా!! మా సిస్టర్‌కి నేను చెపుతాలే !! మా భూషణ్ ఆనందంగా ఉండటంకంటే మా రమాదేవి వేరే కోరుకొనేదేముంటుంది? బయలుదేరమ్మా! అన్నాడు గిరి వాళ్ళను ప్రోత్సహిస్తూ

మామయ్యా కారు అమ్మ తీసుకెళ్ళినట్లుంది! ఏదయినా టాక్సీ స్టాండుకి ఫోన్ చేసి ఓ టాక్సీని ఇక్కడికి వెంటనే రమ్మనమను! అన్నాడు కాంతిభూషణ్

ఐదు నిమిషాలలో టాక్సీ హారన్ వినపడింది క్రింద ఈలోపు కాంతిభూషణ్ కోటు తొడగటంలో అన్నపూర్ణ సాయం చేసింది

అన్నపూర్ణ అతని చేయి పట్టి మెల్లగా నడిపిస్తూ టాక్సీ ఎక్కించి అతనిప్రక్కనే కూర్చుంది

హోటల్ డాల్ఫిన్! అంటూ టాక్సీ డ్రైవర్‌కు చెపుతూ

టాక్సీ వరకు సాగనంపటానికి వచ్చిన గిరి ఆమె మాటలు విన్నాడు

టాక్సీ కొంత దూరం వెళ్ళగానే పామ్‌గ్రోవ్‌కెళితే బాగుంటుందే ? అంది అన్నపూర్ణ

అలాగే వెళదాం! డ్రైవర్ పామ్‌గ్రోవ్ హోటల్‌కి పోనీ! అన్నాడు కాంతిభూషణ్

ఎస్సార్! అన్నాడు డ్రైవరు రూటు మారుస్తూ

మీ మామయ్య గిరిగారికెందుకో నా మీద సదభిప్రాయంలేదు! చెప్పింది అన్నపూర్ణ

ఆయన సదభిప్రాయంతో మనకేం పని! నీకేదో ఫోన్ వస్తే ఆయన గుచ్చి గుచ్చి అడగటం నాకే బాధనిపించింది!! ఆయన పోలీస్ ఆఫీసర్ కదూ ఎప్పుడూ ప్రతి వాళ్ళని ప్రతి దాన్నీ నిశితంగా పరిశీలించటం అవసరం వున్నా లేకపోయినా ఆరాలు తీసి ఏదో కూపీలు లాగటం ప్రతిదాన్నీ అనుమానించటం ఆయనకు అలవాటే! చెప్పాడు కాంతిభూషణ్

నాకెందుకో ఇక్కడ నుంచి ఈ వాతావరణం నుంచి వెళ్ళిపోదామని దూరంగా ఉందామని ఉంది! చెప్పింది అన్నపూర్ణ

నో అవంతీ నో!! ఓవేళ నువ్వు వెళ్ళేట్టయితే నన్ను నీతో పాటే తీసకెళ్ళు!! అసలే ఈ అంధకారపు బ్రతుకు నువ్వు లేకపోతే మరింత అంధకారమయిపోతుంది! అన్నాడు

ఇంతలో పెట్రోల్ బంక్ దగ్గర టాక్సీ ఆగింది

పెట్రోలు పోయించుకోడానికి ఆగిందనుకుంది అన్నపూర్ణ

ఓ ఫైవ్ ఛేంజ్ ఉంటే ఇవ్వండి మేడమ్! అంటూ టాక్సీ డ్రైవర్ అన్నపూర్ణ ఉన్న వైపు వచ్చాడు

ఆమె అతనికి డబ్బు ఇవ్వబోతూ గతుక్కుమంది! ఆమె చెయ్యి రాయిలా బిగుసుకుపోయింది!

ముఖంమీద ఒక్కసారి షాక్‌తో చెమట పట్టినట్లనిపించింది!

చెవుల్లో నించి వెచ్చటి ఆవిరి వచ్చినట్లనిపించింది ఆ టాక్సీ డ్రైవర్ రవికాంత్ అయివుండటానికి అవకాశం ఉందని ఆమె అనుకోలేదు

(ఇంకా ఉంది)




ఓ పా కర్నూలు

నా వయస్సు 22 సంవత్సరములు నాకు 2 నెలల నుండి మలబద్ధకముగా వున్నది విరోచనానికి మందు వేసుకుంటేనే రోజూ విరోచనం అవుతుంది అది కూడా చాలా గట్టిగా అవుతుంది విరోచనము అయినప్పుడు అక్కడి చర్మం చీలి రక్తం వస్తుంది ఆ రోజంతా కాళ్ళు గుంజుతాయి విరోచనము సాఫీగా అయితే రక్తము రాదు రక్తము వచ్చినప్పుడు అక్కడ మంటగా వుండి రెండు రోజులు తర్వాత దురదగా వుంటుంది

ప్రతి రోజూ లిక్విడ్ పారఫిన్ తీసుకోవటం మంచిది ఆకుకూరల వాడకం ఎక్కువ చెయ్యవలసి ఉంటుంది మలవిసర్జన సాఫీగా జరగటానికి లాక్సేటివ్స్ వాడటం వల్ల చాలామటుకు ఉపశమనం కలుగుతుంది ఎప్పటికైనా వైద్యులను కలసి మలవిసర్జన ప్రాంతంలో ఫిషర్ పైల్స్ మొదలయినవి లేవని నిర్ధారణ చేయించుకోవటం అవసరం

ఎస్ బి ఎమ్మిగనూరు

నా వయస్సు 13 సం లు నేను రోజూ రాత్రి నిద్రలో మూత్రం విసర్జిస్తాను దీనికి సరి అయిన మందు చెప్పండి

ఆర్థోపీడిక్ వైద్యులు న్యూరాలజిస్టులు సైకాలజిస్టులు మిమ్మలను పరీక్షించవలసి ఉంటుంది

వెన్నెముక అమరికలో కొన్ని లోపాలు (స్పైనా బైఫిడా వంటివి) ఉన్నప్పుడు ఇలా మూత్రవిసర్జన జరిగే అవకాశం ఉంటుంది

ప్రత్యక్షంగా చూడనిదే వైద్యం చెయ్యటం కుదరదు

డి ఎస్ కంభం

నేను చాలా లావుగా ఉంటాను ఒక నాలుగు నెలలపాటు ఒక పూట భోజనం మానివేసినాను ఇంకా లావు అయినాను నా స్నేహితురాలు ఉదయముననే సెనగలు నానబెట్టి పరగడుపున తిని అన్నం తగ్గించి బాగా పని చేస్తే ఒళ్ళు సన్నపడుతుంది అని చెప్పింది ఇది నిజమేనా? సన్నపడాలంటే ఏం చెయ్యాలి?

ఉదయాన్నే సెనగలు ఎక్కువగా తింటే ఇంకా లావయ్యే అవకాశం ఉంటుంది పనికి తగిన ఆహారం దానికి తగినంత వ్యాయామం అస్తమానమూ ఏదో ఒక వ్యాపకం అవసరం

అన్నం మానాము కదా అని టిఫిన్లు ఎక్కువగా తింటే లావు తగ్గకపోగా ఇంకా ఎక్కువ అవుతుంది ఆహార ప్రమాణాన్ని ఓర్పుగా తగ్గించటం వల్ల తప్పక శరీర దారుఢ్యాన్ని తగ్గించవచ్చును దీనికి మానసిక పట్టుదల (విల్ పవర్) అవశ్యం □

# చెర్నోబిల్-బరువు



చెదిరి తిన్న చెర్నోబిల్ రియాక్టర్

అణుశక్తి ద్వారా విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చెయ్యటం విషయంలో సోవియెట్ యూనియన్ కన్నా ఫ్రాన్సు, అమెరికా సంయుక్త రాష్ట్రాలే ఎక్కువ అభివృద్ధి సాధించాయి. జపాన్, సోవియెట్ యూనియన్‌ల అణుశక్తి - విద్యుచ్ఛక్తి దాదాపు సమానంగా ఉంటోంది. బ్రిటన్ కన్నా సో.యూ.లో రెండున్నర రెట్లు అణుశక్తి ద్వారా విద్యుచ్ఛక్తి తయారవుతోంది. తూర్పు యూరోపు దేశాలలో సో.యూ. నిర్మింప చేసిన అణుశక్తి విద్యుచ్ఛక్తి కేంద్రాలు మాత్రమే పని చేస్తున్నాయిట.

## చెర్నోబిల్ సృష్టిస్తున్న భయాందోళనల కారు మేఘాలు!

సోవియట్ యూనియన్ దాటి వస్తున్న రేడియేషన్ ప్రభావం యూరోప్‌లో కూడా చాలా భాగం విస్తరిస్తున్నది.

మొట్టమొదటి వారం రేడియేషన్ ప్రభావం

గాలివాటున ఉన్న ప్రాంతాలలో ఉధృతంగా ఉన్న రేడియేషన్ ప్రభావం (6వ రోజు)

# ...రు గ్రాఫయిట్ - ప్రమాదం




అణు పరీక్షలను బహిష్కరించాలని కోరేవారికి చెర్నోబిల్ దుస్సంఘటన కొండంత బలాన్ని ఇస్తోంది!

సోవియెట్ యూనియన్‌లో రెండు రకాల అణు శక్తి కేంద్రాలని వాడుతారు

ఒకటి ఎడనం కింద ఉండే నీటిని వాడేది (ప్రెషరయిస్‌డ్ వాటర్ రియాక్టర్) పాశ్చాత్య దేశాలలో వాణిజ్య అణుశక్తి విద్యుచ్ఛక్తి కేంద్రాలు ఈ రకానివే ఈ దినుసులే సో యూ వారు వివిధ దేశాలకి ఎగుమతి చేస్తూ ఉంటారు

అయితే వీటిని చక చక కట్టటం కష్టం (అందు చేతనే 1990 నాటికి అణుశక్తి ద్వారా విద్యుచ్ఛక్తి ఉత్పాదన శక్తి అంచనాలకన్నా 40 శాతం తక్కువ ఉండవచ్చుట)

ఈ అలస్యాలని దృష్టిలో ఉంచుకునే కావచ్చు సోవియెట్ యూనియన్‌లో ఇంకొక రకం అణుశక్తి కేంద్రాలని నయితం నిర్మిస్తున్నారు ఇవి సాదారణ జలం దినుసువి (ఆర్డినరి వాటర్ రియాక్టర్) ఇందులో మామూలు నీరునే చల్లబరచటానికి వాడుతారు కాని బొగ్గులో ఒక రకమయిన గ్రాఫయిట్ సాధనాన్ని కూడా ఉపయోగిస్తారు. రాసే పెన్సిళ్ళలో వాడేది ఈ పదార్థమే. రాజమండ్రిలో గ్రాఫయిట్ క్రూసిబుల్ పరిశ్రమ పేరు పొందినది

# రేడియేషన్ మహమ్మారి!

రేడియేషన్ ఫలితాన్ని అంచనా వెయ్యడం కష్టం ఐసోటోప్‌లు దేహ భాగాల్లో చేరుకొని రక రకాల వ్యాధులను కలుగజేయవచ్చు!

### క్రిప్టాన్ 85

10.7 సంవత్సరాల అర్ధ జీవిత కాలాన్ని కలిగిన ఈ క్రిప్టాన్ 85 మొత్తం దేహంపై ప్రభావాన్ని చూపి ల్యూకేమియాని కలిగిస్తుంది.

### అయోడిన్ 131

ఇది థైరాయిడ్ గ్రంథి చేరుకొని కొన్ని దశాబ్దాల తరువాత క్యాన్సర్‌ని కలిగించవచ్చు. దీని అర్ధ జీవిత కాలం 8 రోజులు!

### సీసియమ్ 137

30.2 సంవత్సరాల అర్ధ జీవితకాలం కల ఈ [illegible] కాలేయాన్ని, ప్లీహాన్ని, కండరాలను బాగా బలహీనపరచి నిర్వీర్యం గావిస్తుంది.

### బేరియమ్ 140

ఇది ఎముకల్లో చేరుకొని 20-30 సంవత్సరాలలో కంతులను ఏర్పరుస్తుంది. దీని అర్ధ జీవిత కాలం 12.8 రోజులు!

## పాడి పంటలకు గట్టి దెబ్బ

చెర్నోబిల్ నుంచి విడుదలవుతున్న రేడియేషన్ వల్ల యూకరైన్ బెలో రష్యాలలో ని వ్యవసాయ క్షేత్రాలు బాగా దెబ్బ తింటాయని అంచనా

| పాడి పంటలు | | ఉత్పత్తి శాతం యూకరైన్‌లో | ఉత్పత్తి శాతం బెలో రష్యాలో | సోవియెట్ యూనియన్ సాలుసరి ఉత్పత్తి (మిలియన్ టన్నులలో) |
|---|---|---|---|---|
| పాలు | – | 23/ | 7/ | 104 |
| మాంసం | – | 23/ | 6/ | 18 |
| బంగాళాదుంపలు | – | 23/ | 14/ | 86 |
| గోదుమ | – | 21/ | 1/ | 92 |
| దుంప పంచదార | – | 60/ | 2/ | 9 |

పీడనం కింద ఉన్న నీటిని వాడే సాధనం







మరిగే జలం వాడే సాధనం




గ్రాఫయిట్ సాధనాల సహాయంతో పరమాణువులని ఛేదించేందుకు వాడే న్యూట్రాన్‌లని అంటే విద్యుత్ గుణం లేని అణు కణాలని అదుపులో పెడతారు! ఈ రకం రియాక్టర్‌లో 1693 వేరు వేరు పాత్రలలో అణు ఇందనాన్ని అమరుస్తారు ఈ రకం నిర్మాణం చాలా క్లిష్టంగా ఉంటుందనే పాశ్చాత్య దేశాలలో దానిని వాడరు రష్యా మాత్రం ఎందుకు వాడుతోందని ఎవరయినా అడిగితే దీనితో ప్లుటోనియమ్‌ని తయారు చెయ్యటం తక్కిన వాటితో కన్నా తేలిక అని నిపుణులు సమాధానం చెబుతారు

ఇలాంటి సాదారణ జలం రకం అణుశక్తి కేంద్రాలు సో యూ లో 15 ఉన్నాయిట అ

## విద్యుత్తు కోసం అణుశక్తి మీద ఆదారపడి ఉన్న ప్రపంచ దేశాల వివరాలు

| దేశం పేరు | అణు రియాక్టర్‌ల సంఖ్య | విద్యుత్ ఉత్పత్తి శాతం |
|---|---|---|
| అర్జెంటీనా | 2 | 23 |
| బెల్జియమ్ | 8 | 60 |
| బ్రెజిల్ | 1 | 1 |
| బ్రిటన్ | 33 | 19 |
| బల్గేరియా | 4 | 32 |
| కెనడా | 16 | 12 |
| జెకోస్లోవేకియా | 5 | 15 |
| తూర్పు జర్మని | 5 | 12 |
| ఫిన్‌లాండ్ | 4 | 38 |
| ఫ్రాన్స్ | 40 | 65 |
| హంగేరి | 2 | 5 |
| ఇండియా | 6 | 2 |
| ఇటలీ | 3 | 4 |
| జపాన్ | 33 | 27 |
| నెదర్‌లాండ్స్ | 2 | 6 |
| పాకిస్తాన్ | 1 | 2 |
| దక్షిణ ఆఫ్రికా | 4 | 18 |
| దక్షిణ కొరియా | 4 | 18 |
| స్పెయిన్ | 8 | 24 |
| స్వీడెన్ | 12 | 42 |
| స్విట్జర్‌లాండ్ | 5 | 34 |
| తైవాన్ | 6 | 59 |
| సోవియెట్‌యూనియన్ | 50 | 11 |
| ఐక్యరాజ్యాలు | 98 | 16 |
| పశ్చిమజర్మని | 18 | 30 |
| యుగోస్లేవియా | 1 | 5 |

(అటమిక్ ఇండస్ట్రియల్ ఫోరమ్ నివేదిక ఆధారంగా)

# అమెరికా సంయుక్త రాష్ట్రాలలో గతంలో జరిగిన అణుశక్తి ప్రమాదాలు

- **జులై 24 1959** లాస్ ఏంజిల్స్‌కి దగ్గరలో ఉన్న శాంతా సుసానాలోని పవర్ రియాక్టర్‌లో 12 రేడియోధార్మిక మూలకాలు కరిగిపోయి అణు ప్రమాదం ఏర్పడింది
- **జనవరి 3 1961** ఇదాహోలోని ఒక మిలిటరి రియాక్టర్‌లో పొరపాటుగా కంట్రోల్ రాడ్స్ తీసివేయడం వల్ల ప్రమాదం సంభవించి ముగ్గురు సాంకేతిక నిపుణులు బలి అయ్యారు మనుషులు చనిపోవడం ఇదే మొదటిసారి
- **అక్టోబర్ 5 1966** డెట్రాయిట్‌లోని బ్రీడర్ రియాక్టర్‌లో సోడియమ్ కూలింగ్ వ్యవస్థ దెబ్బ తిని అణు ప్రమాదానికి దారి తీసింది
- **జూన్ 5 1970** మోరిస్‌లోని న్యూక్లియర్ సంస్థలో ఎగ్నల్ తప్పుగా ఇవ్వడం వల్ల అయోడిన్ రేడియో ఐసోటోపు వాతావరణం లోకి ప్రవేశించింది
- **నవంబర్ 19 1971** మాంటిసెల్లోలో రేడియో ధార్మిక లక్షణాలుగల వ్యర్థ పదార్థాలను భద్రపరిచే రియాక్టర్ బాగా దెబ్బ తిని 50వేల గాలన్‌ల వ్యర్థ పదార్థాలు మిసిసిపి నదిలో కలిసిపోయాయి
- **మార్చి 22 1975** డెకాటర్‌లోని బ్రౌన్స్‌ఫెర్రి రియాక్టర్‌లో అగ్ని ప్రమాదం సంభవించింది అయితే ఈ సంఘటనలో రేడియో ధార్మిక మూలకాలు వెలువడలేదు'
- **మార్చి 28 1979** మిడిల్ టవున్‌లో వాణిజ్య సంస్థకు చెందిన ఒక రియాక్టర్‌లో కోర్ దెబ్బ తిని అణు ప్రమాదం ఏర్పడి ప్రజల ఆరోగ్యానికి భంగం వాటిల్లింది
- **ఆగస్ట్ 7 1979** ఎర్విన్ సమీపంలో ఉన్న ఒక రహస్య న్యూక్లియార్ సంస్థలో ప్రమాదం సంభవించి యురేనియమ్ బాగా విడుదలైంది ఈ సందర్భంలో వెయ్యిమంది దాకా అనారోగ్యంపాలయ్యారు'
- **ఫిబ్రవరి 11 1981** టెన్నెసీలోని న్యూక్లియర్ ప్లాంట్‌లో అనుకోని విధంగా ప్రమాదం జరిగి 110 000 గాలన్‌ల రేడియో ధార్మిక పదార్థాలు పరిసరాలని కలుషితం చేసాయి
- **జనవరి 25 1982** న్యూయార్క్‌లోని రోచెస్టర్‌లో న్యూక్లియర్ ఎలక్ట్రిక్ ప్లాంట్ దెబ్బ తిని ప్రమాదకర మైన రేడియో ధార్మిక పదార్థాలు గాలిలో కలిసాయి
- **జూన్ 9 1985** ఒహాయోలో సాంకేతిక లోపాలవల్లా కొంత వరకు అశ్రద్ధ వల్లా ఓక్‌హార్బర్‌లోని న్యూక్లియర్ ప్లాంట్ చెప్పుకో దగ్గ ప్రమాదానికి గురయింది అయితే పెద్ద నష్టం వాటిల్లలేదు
- **జనవరి 4 1986** ఓక్లాలోని ఒక న్యూక్లియర్ వ్యవస్థలో యురేనియమ్ హెక్సాఫ్లోరైడ్ ఉన్న సిలిండర్ పేలిపోయి ఒకరు మరణించగా 100 మందికి పయిగా ఆసుపత్రిపాలయ్యారు

(1986 జనవరి నాటి అటామిక్ ఇండస్ట్రియల్ 'ఫోరమ్‌వారి నివేదిక ఆధారంగా')

రాజ్యంలో తయారయ్యే అణుశక్తి ద్వారా విద్యుచ్ఛక్తిలో 60 శాతం ఇవే ఉత్పత్తి చేస్తాయిట ఇవి కాకుండా అదనంగా 15 కట్టటానికి పథకాలు తయారయ్యాయని తెలుస్తోంది ఈ ప్రమాదం తరువాత ప్రణాళికల పథకాలు మారవచ్చు

భారత దేశంలోని అణుశక్తి ద్వారా విద్యుచ్ఛక్తి కేంద్రాలలో యూరేనియమ్ 235నే ఇంధనంగా వాడుతారు ఇందులో మళ్లీ రెండు రకాలు ఉంటాయి సహజంగా శుద్ధి చేసినది కృత్రిమంగా మరింత సారవంతం (ఎన్‌రిచ్‌డ్)గా చేసినది ఒక్క తారాపూర్‌లోనే రెండవ రకం యురేనియమ్ వాడుతారు మిగతా కేంద్రాలలో సహజంగా శుద్ధి చేసినది మాత్రమే ఉపయోగిస్తారు

తారాపూర్‌లో సాధారణ జలాన్నే వేడిని తగ్గించటానికి- మోటారు కారులలో నీటిని వాడినట్లే- వాడుతారు సాధారణ జలాన్ని వత్తిడి కిందనూ వాడవచ్చు వత్తిడి బదులు మరుగుతున్న స్థితిలోనూ వాడవచ్చు

ఇతర కేంద్రాలలో సాధారణ జలం బదులు బరువు నీటి ని ఉపయోగిస్తారు బరువు నీటిలోని ఉదజని అణువు కేంద్రం బరువు ఎక్కువగా ఉంటుంది ఇతర న్యూట్రాన్‌ల తాకిడులకి ఈ బరువు ఉదజని కేంద్రంలోని న్యూట్రాన్‌లు విడిపోయి ఇంకా వేరే కేంద్రాలని ఢీకొని మళ్లీ న్యూట్రాన్‌లని విడగొడతాయి ఎన్నో అణు కేంద్రాల విచ్ఛిన్నం ఫలితంగా అణుశక్తి విడుదల అవుతుంది దీనినే ఇంగ్లీషులో చెయిన్ రియాక్షన్ (గొలుసు ప్రక్రియ!) అంటారు

భారత దేశంలోని అణుశక్తి కేంద్రాలలో నీటినే చల్లబెట్టటానికి న్యూట్రాన్‌లని విడుదల చెయ్యటానికి కూడా వాడితే సోవియెట్ యూనియన్‌లోని అణుశక్తి కేంద్రాలలో వేడిని తొలగించి చల్లబెట్టేందుకు నీటినీ న్యూట్రాన్‌లని విడుదల చేసేందుకు గ్రాఫయిట్‌నీ ఉపయోగిస్తారు

-రామలింగం



కలుషితమైన రిజర్వాయర్




### సి హెచ్ ఎన్ ఆర్ సత్తెనపల్లి

★ మీ ప్రొద్దు తిరుగుడు పువ్వు ఇంకా నారుపోస్తూనే వున్నారా? ప్రస్తుత పరిస్థితి ఎక్కడ వుంది?

● ఏం చెయ్యను? సినిమా తీయడం అంటే తెలియలేదు! ప్రస్తుతం నవల రెండో ముద్రణలో వుంది దాల్లో బాగా రక్తి కట్టిన దృశ్యాలు - రెండు మూడు సినిమాల్లో వున్నాయి!!

★ మద్రాసులో కూడా యిక్కడిలాగ దోమలూ నల్లులూ ఈగలూ విపరీతంగా వున్నాయా?

● మద్రాసేం ఫారినా?! ఇదివరకు మన రాష్ట్రంలో చేరిందే కద! అన్నీ సవ్యంగా యిక్కడా వున్నాయి కార్పొరేషను అప్పుడప్పుడు పని చేస్తూంటుంది కనుక /విపరీతంగా అన్న మాట వాడను అంతే

### జి పి ఎస్. టెక్కలకోట (బళ్ళారి)

★ నాకు తెల్ల వెంట్రుకలు వస్తున్నాయి రెండు సంవత్సరాలుగా తల నొప్పి దీనికీ దానికి సంబంధం వుంటుందా? తెల్ల వెంట్రుకలు పోడానికి ఏం చెయ్యను?

● తలనొప్పికి డాక్టర్ని తెల్ల వెంట్రుకలకి బార్బర్ని సంప్రదించండి కళ్ల జబ్బున్నా యితరత్రా ఏమివున్నా డాక్టరు సూచిస్తాడు ఇక శుభ్రంగా రంగేసి పంపుతాడు సెలూన్‌వాడు

### సి హెచ్ డి కదిరి

★ కాలేజీలలో ఆడపిల్లలు చేరడంవల్లే మగపిల్లలు చదవలేక పోతున్నారు!

● అప్పుడు కాలేజీ చదువుల కెగపడకుండా కాయకష్టం చేయడం అలవాటు చేసుకుంటే హాయి- మగపిల్లలు

### కె. జి ఎమ్ బిలాస్‌పూరు

★ మా సంపాదన తక్కువ చుట్టాలు ఎక్కువ ఈ బారం ఎలా తప్పించుకోవడం?

● సూటిగా చెప్పడం ఒకదారి మంచి దారి ఎప్పుడూ అదే మంచిది మేం పెట్టలేం మీరు క్షమించండి అనడం నేర్చుకుంటేగాని కొన్ని సంసారాలు నిలబడవు

### ఏ జె ఆర్ కొమరగిరి

★ మీరు ఆడవాళ్ల తప్పులను పక్కకు నెట్టి మగవారిపై దాడి చేయడానికి కారణం?

● ఆడది తప్పు చేయడానికి కారణం వుంటుంది మగవాడికి వుండదని – నమ్మకం!

### సి వి ఎస్ ఆర్ విజయవాడ

★ జీవిత బాగస్వామి రాలేదు అర్థం చేసుకొని ఆలంబన యిచ్చే స్నేహితులు లేరనిపిస్తోంది

● జీవిత భాగస్వామి అర్థం చేసుకుంటారనీ స్నేహితుల ఆలంబన లేదనీ అనుకోడానికి ముందు– వాటిని మీ రెవరికేనా అందిస్తున్నారా! ఆలోచించండి

### జ్యోతి, విజయనగరం

★ ప్రతి చిత్రకారుడూ రచయిత స్త్రీని నగ్నంగానే వూహించి చిత్రిస్తా రెందుకు?

● తమకు నచ్చిన వలువలు తొడగడానికి!

### ఎస్ జె హెచ్ తంబళ్లపల్లి

★ మానవత్వం అంటే ఏమిటి?

● మనిషిని మనిషిగా గౌరవించడం

### ఎస్ వి సంగం జాగర్లమూడి

★ ప్రభుత్వం మారినప్పుడుల్లా చొక్కాలు మార్చే రాజకీయంతో స్త్రీ మనసును పోల్చిన – ఆ రచయితని మీరెలా శపిస్తారు?

● శపించడం ఎందుకు? ఆ రచయిత అవగాహన అది అనుకుంటాను

### బి ఎల్ రాజమండ్రి

★ దేవుళ్లందరూ కొండపైనే వున్నా రెందుకు?

● భక్తుల పట్టుదల పరీక్షించడానికి

### కె బి ఆర్ టాటానగరు

★ చుట్టాలు యింటికి వస్తే ఆప్యాయంగా ఒక రోజు చూస్తారు రెండో రోజు వాళ్ళంటే చూపరు ఎందుచేత?

● చుట్టం చేపా మరునాటికి కంపు కొడతాయని సామెత!

### కె ఏ ఎమ్ చీరాల

★ ప్రతి చిన్న విషయానికి గొడవపడి కొట్టుకుంటూ సంసారాన్ని నరకం చేసే తల్లితండ్రుల మధ్య పెరిగే పిల్లలకు తెలివి తేటలు లుప్తమయిపోవా? బాధ్యతలు సక్రమంగా నిర్వహించలేని తల్లితండ్రులపై సానుభూతి చూపాలా? మీ వివరణ కావాలి?

● ఒక్కొక్కప్పుడు మీరనుకున్న దానికి బిన్నంగా పిల్లలు అతి తెలివి తేటలు తెచ్చుకోవచ్చు తల్లితండ్రుల మధ్య ఘర్షణ పిల్లల మనస్సులపై తప్పక- ముద్ర వేస్తుంది అందుకే పిల్లలముందు కాక – ఏకాంతంలో కొట్టుకు చావాలి తల్లి తండ్రులు – (పిల్లల మీద ఏమాత్రం అబిమానం వున్నా) బాధ్యతలు సక్రమంగా నిర్వహించని తలి తండ్రులు– వుంధరు- వాటిని సరిగా అర్థం చేసుకోని వాళ్లే ఎక్కువ పిల్లల పెంపకం ఆషామాషీ విషయం కాదు అదొక తపస్సు ఫలితం ఎదురు చూడక – చేసే తపస్సు అది మరిచి పోతేనే - గొడవ □





సీరియల్

# జీవితం చేజారిందా?

కాకాని కమల

(గత సంచిక తరువాయి)

అసలు ఒక ప్రక్క భర్త ప్రవర్తనే మనసులో అగ్నిలా దహిస్తుంటే తల్లి ఎతిపొడుపు ఆజ్యం పోసినట్లు అయ్యింది

దాంతో సుబద్రమ్మ కాస్త తగ్గింది

ధోరణి మార్చింది

అనవే తల్లీ అను నేను పెట్టలేనిదాన్ని తగుదునమ్మా అని నీ యింటికి వచ్చానా అనకేం చేస్తావ్? అంది నిష్ఠూరంగా

అయినా ఏదో అప్పటికి తాత్కాలికంగా వూరుకున్నా ఆవిడ ఆలోచన్లు ఆవిడవే

అక్కడ వున్న నాల్గు రోజులూ ఏదో ఒక రకంగా సీతని వేదిస్తూనే వుంది

సీత మెషిన్ మీద ఫళ్ళరసం తీసి రెండు గ్లాసుల నిండా పోసి గ్లూకోస్ పొడి కలిపి పిల్లలిద్దరికి ఇచ్చింది

తరువాత తల్లికి కూడా ఓ గ్లాసునిండా జూస్ నింపి ఐస్ ముక్కలు వేసి యిచ్చింది.

ఒసేయ్ సీతా! ఇలా అంటున్నానని కాదు గాని ఈ నీ సవతి పిల్లల్ని నెత్తికి ఎత్తుకోవడమేనా లేక నీకంటు ఓ పిల్లా పాపని, సంసారం అంటూ అఘొర్చుకొనేది ఏమైనా వుందా? నీ జాగ్రత్త నువ్వు పడకపోతే నీకూ ఆ సుబ్బులుకి ఈ ఇంట్లో అట్టే తేడా వుండదే ఇప్పుడు నా మాటలు నీకు వెగటుగానే అనిపించవచ్చు కాని ముందు ముందు నీకే తెల్సివస్తుంది ఏదో తల్లిని పెద్దదాన్ని గనక అనుబవంతో చెప్తున్నాను ఆపైన నీ యిష్టం ఆలోచించుకో అంది హితోపదేశం చెప్తున్నట్లు

సీత తల్లి మాటలకి సన్నగా నవ్వుకుంది

**జరిగిన కథ-10** ఇద్దరి పిల్లల తండ్రియైన ప్రబాకర్‌తో సీతకు వివాహం జరిగింది సీతకి పిల్లల పట్ల ఉన్న శ్రద్ధ ప్రేమ చూస్తుంటే ప్రబాకర్‌కి ఆనందం కలుగసాగింది ఆ ఆనందమే అతనికి సీతంటే అభిమానం ఏర్పడేలాగా చేసింది ప్రబాకర్ స్నేహితురాలు ఆష వచ్చి వెళ్ళటంతో సీత మనసు కలత పడింది సీత ప్రభాకర్‌కి బార్యలా గాక పని మనిషిలా ఉందని ఆష అనేటప్పటికి ప్రబాకర్ హర్ట్ అవుతాడు ప్రబాకర్‌కి సీతంటే కొంచెం జాలి కొండంత సానుభూతి ఉంది ఆమెపై తనకుగల మమకారం పైకి వ్యక్తం చేస్తే ఆమెకి లోకువయిపోతానేమోనని అది మనసుకే పరిమితం చేసుకున్నాడు సీతను చూడటానికి సీత తల్లి ఊర్నించి వచ్చింది తల్లి ప్రవర్తన సీతకు చికాకు కలిగిస్తుంది

అల్లుడి దృష్టిలో తన కూతురు సీత స్థానం ఎమిటో తెలిస్తే ఈ తల్లి ఏమవుతుంది? అనుకుంది

పెళ్ళికి ముందే అతడు చేసుకున్న హృదయ నివేదన ఇంకా సీత మనసులో బద్రంగానే వుంది తలపుకి వచ్చినప్పుడల్లా వాడిగా ముల్లులా కదులుతూనే వుంది

ఇవన్నీ తల్లికి ఏం అర్థం అవుతాయి

అసలు ఆరోజే ఆ విషయాలన్ని తల్లికి చెప్పి తనకి పెళ్లి ఇష్టంలేదని గట్టిగా పట్టుబట్టవలసింది కాని సీత నిట్టూర్పు ఆపుకుంది

ఒసే సీతా! ఇంత పెద్ద బంగళాకి ఇల్లాలు అనిపించటం లేదే తల్లి నిన్ను చూస్తుంటే అంది నిరాశగా సుబద్రమ్మ సోపాలో నడుం వాలుస్తూ

సీతకి తల్లి మనస్సు అర్థంకాలేదు

ఇప్పుడు ఏమయిందమ్మా? అంది ఆశ్చర్యంగా చూస్తూ

ఆవిడ పెదవి విరిచింది

ఇంకా ఏమవ్వాలే తల్లి ఇంత అమాయకురాలివి ఎట్లా బ్రతుకుతావ్? మీ ఆయన చూడబోతే పేరుప్రతిష్టలున్న పెద్ద వ్యాపారవేత్త లక్షాదికారి ఖరీదయిన బట్టలు కట్టి కార్లో మీద తిరుగుతాడు

కాని నువ్వు?

చూడు ఎలా వున్నావ్?

వెలిసిపోయిన పాత గుడ్డలు మెళ్లో పుస్తె ముక్క నీ సవతి కూతురు చూడు ఎలా వుంది?

వేలెడంత లేదు

ఒళ్ళంతా బంగారమే

జిగేల్‌మనిపోతూ గంటకో గౌను మారుస్తోంది

మా అల్లుడు ధనవంతుడని మురిసిపోయాను రెండో పెళ్ళి అయినా పిల్ల సుఖపడుతుంది కదా అని ఆశపడ్డాను

కానీ చూడబోతే నీ గొంతు కోసినట్లున్నానే తల్లి?

కొంగుతో అద్దుకుంటూ సన్నగా శోకం తీసింది సుబద్రమ్మ

సీతకి తల్లి వాక్ధోరణి కాస్త ఖంగారు కలిగించింది

చ చ మంజా ఇదంతా వింటే ఏమనుకుంటుంది? వాళ్ళ నాన్నకి చెప్తే?

సుబ్బులు- రంగా వింటే ఏమనుకుంటారు?

పేదవాళ్ళ కక్కుర్తి గుణం ఎక్కడికి పోతుంది అనుకోరా?

అయినా ఇప్పుడు తను ఆడంబరాల కోసం ఏడుస్తోందా? భర్త అనురాగం కన్న అవి ఎక్కువా?

ఒంటి నిండా నగలు దిగేసుకుని పట్టు చీర కట్టుకుని వుత్సవ విగ్రహంలా

అలంకరించుకుంటే సరిపోయిందా?

మనసుకి శాంతి సుఖం లేకపొయ్యాక ఏమిటి ప్రయోజనం?

సీతకి తల్లి మాటలు కలవరం రేకెత్తించాయి

రంగా ఫర్నిచర్ డస్ట్ తుడుస్తూ ఓ చెవి ఇటు పడేసి వాలుగా చూస్తుంటే సీతకి కంపరం అనిపించింది

అబ్బబ్బ! వూరుకోమ్మా! అనవసరంగా లేనిపోనివన్ని వూహించుకొని బాధపడకు అయినా అసలు నాకు ఇప్పుడు వచ్చిన లోటు ఏమిలేదు ఆయనకి వ్యాపారం పన్లలో తీరిక తక్కువ ఇలాంటి చిన్న చిన్న విషయాలు ఇంటి గొడవలు పట్టవు ఈసారి మా అత్తగారు వచ్చినప్పుడు ఆవిడ్ని అడిగి అన్ని అమర్చుకుంటాలే  అంది

ఆ మాటతో గయ్యిమంది సుభద్రమ్మ

మీ ఆయనకి ఇంటి గురించి పిల్లల గురించి వ్యాపారం గురించి బాగానే పడుతుంది

కాని

కట్టుకున్న పెళ్ళాం సంగతి మాత్రం పట్టదా?

అలాంటప్పుడు అసలు పెళ్ళెందుకు చేసుకోవటం?

ఓ ఆడపిల్ల గొంతు కొయ్యటం కాదూ?

సీత విస్తుబోతూ తల్లి ముఖంలోకి చూసింది

ఏమిటమ్మా ఆ మాటలు? ఈ రోజు నీకేమయిందసలు?

కళ్ళ నుంచి బొట బొట నీళ్ళు కారుతూంటే తల అడ్డంగా తిప్పింది సుభద్రమ్మ

ఏం కాలేదే తల్లి ఎంతో ఆశ పెట్టుకుని వచ్చాను నీ గురించి ఎంతో గొప్పగా వూహించుకున్నాను నీ సిరి - సంపద కళ్ళారాచూసి మురిసి పోదామను కున్నాను

నీ చెల్లెళ్ళు అక్కడ కట్టు గుడ్డ లేక కడుపు నిండాసరి అయిన తిండి లేక నానా అవస్థపడుతున్నారు

దనవంతురాలైన అక్కవి వున్నావు కదా! ఆదుకోకపోతావా అని సంబర పడ్డాను

కాని

నిన్ను చూస్తుంటే నా కడుపు తరుక్కుపోతూందే తల్లి

నీ కంటేఈ ఇంట్లో పనివాళ్ళు నాకు ఎంతో నయమనిపిస్తున్నారు

సుభద్రమ్మ కంఠం రుద్ధం అయిపోయింది ఆవిడ గొంతులో ఆవేదన ఆక్రోశం పోటీపడుతున్నాయి

తల్లి రాకలోని ఆంతర్యం సీతకి అర్థం అయ్యింది కాని తను నిస్సహాయురాలు

నేనేం చెయ్యగలనమ్మా? అంది నిర్లిప్తంగా



## జీవితం చేజారిందా

సుబద్రమ్మ మొఖం ముడుచుకుంది

అంతేలే తల్లి ఎవరి సొమ్ము వాళ్ళకి గట్టి ఎక్కడన్న బావగాని వంగ తోట దగ్గర కాదని సామెత వుండనే వుంది అంటూ చిరచెంగుతో కళ్ళు మొఖం తుడుచుకుంది

చాటుమాటుగ ఇంత స్టీలు సామాను వుప్పులు పప్పులు ఇన్ని చీరలు ఇచ్చి పుట్టింటిని ఆదుకుంటే ఆవిడ దృష్టిలో సీత చాలా మంచిది

నిజమే!

సీత అలా చేసినా ప్రబాకర్‌కి తెలిసే అవకాశంలేదు

కావాలనుకుంటే సీత ఆ రకంగా పుట్టింటిని చాలా విదాలుగా ఆదుకోవచ్చు

నిజానికి సుబద్రమ్మ కడుపులో మాట కూడా అదే!

కాని -

ఎంతో ఆత్మాబిమానం అతి సున్నితమైన మనసు ఆకలేస్తే అమ్మని అడగటానికే మొగమాటంపడే సీత ఆ విదంగా ప్రవర్తించగలదా?

రోజూ పుట్టింట్లో సగం కడుపు ఖాళీగా అర్ధాకలితో వుండే సీతకి అత్తింటికి వచ్చాక కడుపు నిండా తినటానికి కూడా ఎమిటో వెరపుగా సంకోచంగా అనిపించేది

ఆ ఇంటికి వచ్చి పది నెల్లు కావస్తున్నా ఎంతో స్వేచ్ఛ వున్నా ఇదంతా నాది అన్న బావం ఏర్పడటంలేదు

నా ఇల్లు - నా సంసారం అన్న మమకారం కలగటంలేదు

ఏదో ఇప్పుడిప్పుడే ఇంత తిని తిరగటానికి అలవాటు పడుతూంది

అటువంటి సీత పుట్టింటిని ఏ విదంగా ఆదుకోగలదు?

తల్లిని ఎలా సంతృప్తి పరచగలదు?

వారం రోజులుండి సుబద్రమ్మ తిరుగు ప్రయాణం కట్టింది

ఒసేయ్ సీతా! నీ చెల్లెళ్ళు పట్నం చూడాలని సరదాపడుతున్నారె అంది ఆరాటంగా

అలాగే పంపమ్మా! దానికేముంది? అంది చిరునవ్వుతో

అస్తమానం ఇలా తన పుట్టింటి నుంచి ఎవరో ఒకరు వచ్చి వెళుతుంటే ప్రభాకర్ ఏమనుకుంటాడో అని లోలోన సంకోచం కలిగినా తల్లిని తృప్తి పరచటం కోసం ఆ మాటెలాగో అనగలిగింది

ఎదుటివారు ఏమైనా అనుకొని అవసరం గడిస్తే చాలు అని చూస్తారు కొందరు

సుభద్రమ్మ ఆ కోవకి చెందింది

పుట్టినప్పట్నించి అనుబవించిన దారిద్ర్యం, అధిక సంతానం ఆర్థిక ఇబ్బంది అవసరాలు ఆవిడ్ని అలా మార్చివేశాయి

ఒసేయ్ సీతా! మీ అత్తగారు మళ్ళీ ఎప్పుడు వస్తుందే అంది

ఏమోనమ్మా! బహుశా తొందర్లోనే రావచ్చు

ఒసేయ్ అమ్మాయ్! అస్తమానం అడిగాను అనుకోక మన లక్ష్మికి గిరిజకి కూడా ఆవిడ మంచి సంబందాలు చూస్తానందే నా మాటగా ఆవిడకి ఒకసారి జ్ఞాపకం చేసి పుణ్యం కట్టుకో అంది

సీతకి నవ్వు వచ్చింది

అమ్మా! మంచి సంబందం అంటే నాకు చూసిన లాంటి సంబంధమేనా? అంది వెక్కిరింపుగా

సుబద్రమ్మ బుగ్గలు నొక్కుకుంది

ఎమే! నీకిప్పుడేం తక్కువయిందనే? లంకంత ఇల్లు ఇంటి నిండా సామాను కార్లలో తిరిగే బర్త

సీత మళ్ళీ నవ్వింది

అమ్మా! మరి ఇందాక నువ్వు అంత బాదపడ్డావు ఎందుకు? ఈ పెళ్ళిచేసి నా గొంతు కోశామని నాకు సుబ్బులుకి తేడా ఏమి లేదని ఏదేదో అన్నావు కదా?

చేత్తో తల కొట్టుకుంది సుబద్రమ్మ

అన్నానే తల్లి! ఎందుకన్నాను? కన్నతల్లిని కనక కూతురు సుఖం కోసం తాపత్రయపడ్డాను నువ్వు ఒట్టి వెర్రి బాగుల్దానివి బ్రతుకు తెరువు తెలియదు లౌక్యం వంటపట్టలేదని ఏడిచాను! అక్షయపాత్ర దాచుకుని ఆకలితో ఏడ్చినట్టు నీ పిచ్చితనం చూసిబాదపడ్డాను కాని నీ సంసారానికేం లోటే? అడగందే అమ్మయినా పెట్టదు కొందరు మగవాళ్ళకి ఇంటి విషయాలు తెలియవు చాలా రోజులు మీ నాన్న అలాగే వుండేవారు కాబట్టి నెమ్మదిగా మీ ఆయన్ని నువ్వు మంచితనం చేసుకొని అన్ని అడిగి అమర్చుకోవాలి తెల్సిందా? అంటూ కూతుర్ని దగ్గర కూర్చొపెట్టుకుని బోదించింది జీవిత సత్యాలు వివరించింది

సీత అంతావింటూ నిశ్శబ్దంగా వుండిపోయింది

తల్లి ఆవేదనలో అర్ధం వుంది

కాని తనేం చేయగలదు?

ఆవేదన పడినంత మాత్రాన బ్రతుకులు బాగుపడతాయా?

బగవంతుడు ఎలా నిర్ణయిస్తే అలా జరుగుతుంది

ఆ మర్నాడు ఉదయమే తెల్లవారు ఝాము బస్సుకి సుబద్రమ్మ ప్రయాణం పెట్టుకుంది

రోజూలాగే ప్రబాకర్ ఆ రోజు సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో ఇంటికి వచ్చాడు

వస్తూనే చాలా హడావుడిగా వచ్చి పది నిమిషాలు వుండి తిరిగి ఏవో ఫైల్సు తీసుకుని హడావుడిగా వెళ్ళిపోయాడు ఏదో మీటింగ్ వుందని చెప్పాడు అతనితో పాటు ఎవరో పార్టనర్స్ కార్లో వచ్చారు

అంతా కల్సి హడావుడిగా వెళ్ళిపొయ్యారు

రెండు గంటల తర్వాత తిరిగి ఇంటికి వచ్చాడు

అతను ఫ్రెష్ అవగానే సీత భర్తకి భోజనం వడ్డించింది

అల్లుడు భోజనం చేస్తుంటే సుభద్రమ్మ తనకితనే వెళ్ళి పలకరించింది

తాను రేపు ఉదయానే ఊరికి వెళ్ళిపోతున్నట్టు చెప్పింది

సీత మౌనంగా భర్తకి ఏం కావాలో చూస్తోంది

ఇంతలో -

గదిలో ఎచి బాబు నిద్రలో వులికిపడి లేచి ఏడవటం మొదలెట్టాడు

సుభద్రమ్మ గబగబా వెళ్ళి బాబుని ఎత్తుకుంది కాని పది నిమిషాలైనా బాబు ఏడుపు ఆపలేదు సరికదా క్షణక్షణానికీ స్థాయి హెచ్చిపోతూంది

అలవాటు లేకపోవటంతో సుబద్రమ్మ చేతుల్లో వుండటంలేదు

నిద్రలో భయపడ్డాడో ఏమో గుక్కపట్టి అదే పనిగా ఏడుస్తున్నాడు

ఎంత సముదాయించినా పిల్లాడు నా చేతుల్లో వుండటంలేదే అమ్మాయ్! నిద్రలో ఝుడుసుకొన్నాడో ఏమో ! అంది సుభద్రమ్మ.

అప్పటికే కొడుకు ఏడుపుకి ప్రభాకర్ మనసు గిజ గిజమంటూంది అన్నం ఎక్కటంలేదు

సీతా! నాకు ఏం కావాలో మీ అమ్మగారు చూస్తారుగాని నీవెళ్ళి వాడ్ని

నిద్రపుచ్చు .." అన్నాడు అసహనంగా.

అతను అప్పుడే భోజనం బల్ల ముందు కూర్చున్నాడు

దాంతో సుభద్రమ్మ పొంగిపోయింది

"నువ్వు పిల్లాడి సంగతి చూడు తల్లీ. అల్లుడికి ఏం కావాలో నేను వడ్డిస్తాను" అంటూ సంతోషంగా భోజనాల బల్ల దగ్గరికి వచ్చింది.

తల్లి చేతుల్లోంచి బాబుని అందుకొని సీత గదిలోకి వచ్చి పాల గ్లాసు అందుకొని తాగించింది. తరువాత అరుబయట గార్డెన్‌లోకి తీసుకెళ్లి నెమ్మదిగా భుజాన వేసుకుని 'జో' కొట్టింది.

పావు గంట తరువాత బాబు ఏడుపు మాని అదమరిచి నిద్రపొయ్యాడు

సీత లోపలికి వచ్చి బాబుని మంజు ప్రక్కనే పడుకోపెట్టి బ్లాంకెట్ కప్పింది

అప్పటికే ప్రభాకర్ భోజనం పూర్తయింది.

వక్కపొడి నములుతూ డ్రాయింగ్ రూమ్‌లో సోఫాలో కూర్చుని దీక్షగా పైన వెలుగుతున్న షాండ్లియర్‌కేసి చూస్తున్నాడు

సీత వునికిని కూడా గమనించలేదు.

"బాబు పడుకున్నాడా? ఎందుకంతగా ఏడ్చాడు?" అని ఆతృతగా ఎప్పటిలా అడగలేదు.

ఇంతకు ముందులా అతని వదనం ప్రశాంతంగా లేదు

దీర్ఘ ఆలోచనలో పడినట్లు అతని కనుబొమలు తీవ్రంగా ముడిపడ్డాయి

భర్తని క్షణాల్లో అంత మూడీగా మార్చిన విషయం ఏమై వుంటుందా' అని ఆశ్చర్యపోయింది సీత.

కాని

అంతవరకు నిర్మలంగా వున్న అతని వదనం అప్రసన్నంగా మారటం మాత్రం ఆమె గమనించలేదు!

* * * *

తల్లి వచ్చి వెళ్లాక జోరున పెద్ద వాన కురిసి వెలిసినట్లు అనిపించింది సీతకి.

సుభద్రమ్మ వున్న నాల్గు రోజులు హోరెత్తించేసింది

"సిరి" ముట్టుకుంటే అంటుకునేది కాదు దేన్నయినా పొందాలంటే తగిన అర్హత, యోగ్యత వుండాలని సీత అభిప్రాయం

నడమంత్రపుసిరి పట్ల ఆమెకి ఆసక్తి లేదు

.. యాచించి పొందటం అంటే సీతకి నచ్చదు.

చిన్నప్పట్నుంచి అమ్మని కూడా ఆకలేస్తే అన్నం పెట్టమని అడగటానికి మొహమాటపడే మనస్తత్వం ఆమెది అవతలి వాళ్లు చిన్నమాట ఏదైనా హేళనగా అంటే వాడి ముల్లు గుచ్చుకున్నట్లు ఆమె మనసు విలవిల్లాడి పోతుంది.

అంతటి ఆత్మాభిమానం ఆమెది.

ఆమెకి వున్న సిరి - సంపదలు అవే! కాని -

దీనికి పూర్తి విరుద్ధం సుభద్రమ్మ

అందుకు తల్లి వున్న కొన్నాళ్లు సీతకి మనసు స్థిమితం తప్పినట్లు అయ్యింది

ఆవిడ వెళ్లిపొయ్యాక పంజరంలోంచి తప్పించుకున్న పిట్టలా ఆమె ప్రాణం హాయిగా అనిపించింది.

ఆ మర్నాడు సాయంత్రం ప్రభాకర్ కంపెనీ నుంచి ఫోన్ చేశాడు

సీత రిసీవ్ చేసుకుంది.

"తను సాయంత్రం ఆరు గంటలకి రావటం కుదరదనీ, ఒక ఫంక్షన్‌కి అటెండ్ అవ్వాలని, అందువల్ల ఈ రోజు తను పిల్లల్ని బయటికి తీసుకువెళ్లటం కుదరదని, రంగా చేత కొన్నేపు పార్కుకి పంపించమని" చెప్పాడు

సీత అన్నింటికీ నమ్రతగా "ఊ .. "కొట్టింది.

ఆఖర్న ప్రభాకర్ -

"సీతా! మంజు వుందా?" అని అడిగాడు మాట్లాడటానికి.

# స్నేహంలోని భేదాలు




## ధర్మపథం...

అందరితోనూ స్నేహంగా ఉండాలనే కోరుతూ ఉంటారు. మనం స్నేహం చేసే వ్యక్తి స్వభావం ఎటువంటిదో మొదట తెలిసికోవడం కష్టం. "ఉప్పు కప్పురంబు ఒక్క పోలికను" ఉండునట్లు అంతా బాగానే కనబడతారు. క్రమక్రమంగా వారి స్వభావం బోధపడుతుంది. చెడ్డవారితో స్నేహం చేస్తే వారు మొదట్లో ఎంతో ఎక్కువ స్నేహాన్నే చూపుతారు. దానికి స్వార్థమే కారణం. తమ పని తీరిన తర్వాత ఆ స్నేహం క్రమక్రమంగా తగ్గుతూ వస్తుంది. మనం ఉదయం ఎండలో నిలిచి ఉంటే మన నీడ చాలా చాలా పొడుగ్గా కానవస్తుంది. సూర్యుడు ఆకాశం పైకి ఎక్కిన కొద్దీ ఆ నీడ క్రమంక్రమంగా తగ్గుతూ చాలా పొట్టిగా కానవస్తుంది. దుష్టునితోడి స్నేహాన్ని ఈ నీడతో పోల్చవచ్చును. ఇలా స్నేహం తగ్గిపోతూ ఉన్న కొద్దీ ఆ దుష్టుల స్వభావం ఎలాటిదో బోధపడుతుంది. కొందరితో మైత్రి మొదట్లో కొద్దిగానే ఉంటుంది. అది క్రమక్రమంగా అభివృద్ధి అవుతుంది. ఆ స్నేహం తన మిత్రునికి ప్రాణాన్నయినా ఇవ్వడానికి సిద్ధంగా ఉండేటట్లు చేస్తుంది. పొద్దు తిరిగేటప్పుడు ప్రారంభంలో నీడ చాలా పొట్టిగానే కనబడుతుంది. క్రమక్రమంగా అది పొడుగవుతుంది. ఇది మంచివారి స్నేహానికి దృష్టాంతం!

మరొక విశేషం ఏమిటంటే – ఉదయకాలం ఎంతో పొడుగుగా కన కనబడిన నీడ క్రమంగా పొట్టిదై సూర్యుడు నడునెత్తికి వచ్చేసరికి మాయమైపోతుంది. అలాగే కుజనుల తోడి మైత్రి క్రమంగా తగ్గి చివరకు మాయమైపోతుంది. అపరాహ్ణ కాలంలోని నీడ మొదట స్వల్పంగా ప్రారంభమైనా క్రమక్రమంగా వృద్ధి పొంది చివరకు తిమిరంలో కలిసిపోతుంది. ఆ విధంగానే సుజనుల తోడి మైత్రి క్రమక్రమంగా పెరిగి పెద్దదయి సర్వత్రా వ్యాప్తమవుతుంది. దీనిని గమనించి మనం క్రమంగా స్నేహం తగ్గించే వ్యక్తులకు దూరంగా ఉండవలసి ఉంటుంది.

–బులుసు వేంకట రమణయ్య

## జీవితం చేజారిందా

కాని మంజు మంచి నిద్రలో వుంది

అదే చెప్పింది సీత

'సరే' నువ్వు కూడా భోజనం చేసెయ్ . నా కోసం ఎదురు చూడక . " అని చెప్పి ఫోన్ పెట్టేశాడు

ఆ సాయంత్రం రంగా పిల్లలిద్దర్ని చిన్న మూడు చక్రాల సైకిలుపై కూర్చో పెట్టి కాస్సేపు దగ్గర్లోనే వున్న "చమన్‌లో" ఆడించి తీసుకువచ్చాడు

ఆ తరువాత ఇంటికి వెళ్ళిపొయ్యాడు

ఆ రోజు రాత్రి ప్రభాకర్ ఇంటికి వచ్చేసరికి పదిగంటలు దాటింది

అతడు తన గదిలో డ్రస్ మార్చుకొంటుంటే లాంఛనంగా అడిగింది సీత–

"భోజనం చేస్తారా? పళ్ళ తీసుకురానా?"

"భోజనం అయ్యింది సీతా కొంచెం పళ్ళు ముక్కలు తీసుకురా. యాపిల్సు వున్నాయా? ."

"ఊఁ ..."

"అయితే కొంచెం తీసుకురా చాలు" అన్నాడు బద్ధకంగా ఆవులిస్తూ

సీత ఫ్రిజ్‌లోంచి యాపిల్స్ తీసి, చాకుతో ముక్కలు కోసి తీసుకువెళ్ళింది.

ప్రభాకర్ నైట్ డ్రస్ వేసుకుని బెడ్ మీద పడుకుని వున్నాడు.

ఏదో పుస్తకం చదువుతున్నాడు

ఆమె అందించిన ప్లేటు అందుకుని మృదువుగా ఆమె చేతిని పట్టుకున్నాడు మంచంమీద కొంచెం పక్కకి జరుగుతూ ఆమె కోసం చోటు చేసి -

"సీతా! ఇలా కూర్చో . ." అన్నాడు సౌమ్యంగా.

సీత కళ్ళు ఒక్కసారి సంభ్రమంగా అయి తిరిగి యధాస్థితికి వచ్చాయి.

అతని ఆ ఆహ్వానం కొత్తకాదు ఈ మధ్య అలవాటు అయ్యింది రోజులు గడుస్తున్న కొద్దీ ఇద్దరి మధ్య దూరం తగ్గి భార్యాభర్తల మధ్య వుండే తియ్యని అనుబంధం క్రమంగా ఏర్పడుతూంది

అది కాదు ఆమెని సంభ్రమపరిచింది.

(ఇంకా ఉంది)

# మిత్రమా, రా, పోదాం పైపైకి....

మహాకవి శ్రీ శ్రీ "వస్తున్నాయ్, వస్తున్నాయ్, జగన్నాథ రథచక్రాల్, జగన్నాథ రథచక్రాల్" అన్నారు. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన పదేండ్లకు, ఆంధ్ర ప్రదేశ్ అవతరించిన ఏడాదికి వచ్చాయ్. మరో ప్రపంచం, మరో ప్రపంచం అని ప్రభంజనంలా వచ్చింది. ఆంధ్రదేశాన్ని కదిలించింది. కదిలేది కదిలించేది పెనునిద్దుర వదిలించేదే విద్య. బిల్డింగ్‌లు, బెంచీలే కాదు. **కళకు హృదయం లాగా కళాశాలకు ఆత్మ** ఉండాలని నిరూపించింది. అదే మా కళాశాల ప్రత్యేకత, చదువంటే మార్కులొక్కటే గాదు. క్రమశిక్షణ, స్వయంకృషి, శాస్త్రీయమైన ఆలోచనను నేర్పేది. అందువల్ల, పరీక్షా ఫలితాలు ఎప్పుడూ ఉత్తమంగా ఉంటు న్నాయి. ప్రభుత్వ సహాయం పొందే వాటికంటే ఇలాంటి సంస్థలే ఎంతో నయమని ఋజువు చేసింది. గౌరవ స్థానాన్ని తీసుకొచ్చింది. ప్రభుత్వానికి పోటీగా ఎన్నో విద్యాలయాల ప్రారంభానికి బాట వేసింది. ఎందరో నిరుద్యోగులకు ఆత్మవిశ్వాసాన్ని కలిగించింది. ఎంట్రన్సు పరీక్షలకు శిక్షణ ప్రారంభించి వేలాది మంది జీవితాల్లో కొత్తమలుపు తెచ్చింది. కొందరికి కన్నుకుట్టింది కూడా. ఎందరో సాహిత్య వేత్తలను, శాస్త్రజ్ఞులను, కళాకారులను, క్రీడాకారులను గౌరవించింది. సైన్సు ఫెస్టివల్, ఎగ్జిబిషన్స్, క్విజ్ పోటీలను నిర్వహించింది. ఇతర విద్యా సంస్థలకు సాంఘిక, సాంస్కృతిక సంస్థలకు అండగా నిలిచింది. అందుకే ఇది మామూలు విద్యాలయం కాదు.

**ఒక శక్తి, ఆంధ్రుల జీవితంలో ఒక భాగం!**

*ఎన్నోసార్లు వివిధ పరీక్షలలో రాష్ట్రంలో ర్యాంకులు సాధించాము. 1983-1985 సంవత్సరాలలో సీనియర్ ఇంటర్‌లో 76 మందికి 44 ఫస్ట్‌క్లాసులు, 1984-1985 సంవత్సరములలో జూనియర్ ఇంటర్‌లో 103 మందికి 48 ఫస్ట్‌క్లాసులు, 10వ తరగతిలో 1984-85 సంవత్సరములలో 82 మందికి 46 ఫస్ట్‌క్లాసులు సాధించిన సంస్థ*

## పూర్తి వివరాలకై ప్రాస్పెక్టస్‌ను చూడండి

# రవి కళాశాల

## బ్రాడీపేట ....గుంటూరు.2

ఇంగ్లీషు, తెలుగు మీడియములలో 9, 10, జూనియర్, సీనియర్ ఇంటర్ తరగతులకు శిక్షణ. పరిమిత సంఖ్యలో ప్రవేశము. హాస్టలు, లేబొరేటరీలు కలవు.

## పునః ప్రారంభం: జూన్ 1

డైరెక్టర్: **C.V.N. ధన్, M.A.,**

N.B: ఫిజిక్సు లెక్చరర్సు కావలెను. అనుభవమును బట్టి జీతం. నేరుగా సంప్రదించండి.

# మిథ్యాబింబాలు

కృష్ణమూర్తికి అదిలాబాదు నుండి కడపకు బదిలీ వుత్తరువులు జారి అయ్యాయి. ఇంటి కొచ్చి బాధగా భార్య ప్రమిలకు ఆర్డర్సు చూపించాడు.

ప్రమిలకు సైతం బాధ కల్గించక మానలేదు. ఎదిగే పిల్లల్ని వెంటేసుకుని ఎన్ని వూళ్ళని తిరగాలి బాబూ – అనుకొంది. అయితే ఆ బాధను మనసులో నే మాడేసుకొని నవ్వేసింది. సానుభూతిగా మూర్తికి కాఫీ కలిపి తెచ్చిస్తూ –

"కానివ్వండి. మనకిది కొత్తకాదు కదా. ఇప్పటికి పదమూడు జిల్లా కేంద్రాలలో కాపురం పెట్టాము. ఇది పధ్నాలుగోది. అంతే." అంది.

"ఎక్కడ అదిలాబాదు. ఎక్కడ కడప! ఏమిటి నాకు రెండేళ్ళకోసారి ఈ శిక్ష.. పలుకుబడి వుండే వాళ్ళు కావాల్సిన వూళ్ళలో ఏళ్ళ తరబడి వుండిపోతున్నారు. నన్నేమో ఆంధ్రరాష్ట్రం యావత్తూ ' మూర్తి మాటల్లో ఆయాసం బాధ వ్యక్తమైంది దుఃఖ మొస్తూంద తడికి

ప్రమిల అతడి చేతుల్ని తీసుకొంది వెచ్చగా నొక్కింది. "మీరేం బాధ పడకండి. మనకి ఏ వూరైతేనేం చెప్పండి ఏకంగా ఇన్నేసి వూళ్ళు చూసే అదృష్టం మనకే అబ్బింది ఎటూ మన పిల్లలకి వేసవి సెలవులు అయిపోతున్నాయి. కడపలో నే వెళ్ళి జాయినవుతారు " అన్నది.

"కడపలో బోలెడు ఇళ్ళ అద్దెలట. మనం భరించగలమా!" అన్నాడు తలపట్టుకొంటూ మూర్తి ఆ మాటకు ప్రమిల ఏదో గుర్తొచ్చినట్టు నవ్వుతూ చిటుకేసింది. కళ్ళు మూసి తెరుస్తూ తల ఆడించింది

"అన్నట్టు కడప కదూ మనల్ని వేసింది? మా తమ్ముడు సత్యం అక్కడ టెలిగ్రాఫ్ ఇన్స్‌పెక్టర్‌గా వున్నాడు కదూ? వుండండి వాడికిప్పుడే వుత్తరం రాసి పడేస్తాను. కడప టౌనులో కాకుండా దగ్గరున్న ఒక పల్లెలో ఇల్లు చూసి పెట్ట మంటాను. మనం ఏకంగా సామాన్లతో పిల్లలతో వెళ్ళిపోవచ్చు." అంటూ వెంటనే ఇన్‌లాండు లెటర్ తీసి వుత్తరం రాసి మూర్తికి చూపింది. అతడు దాన్ని చదివి కాస్త వుపశమనం పొందినట్టు తల వూపాడు.

* * * * *

అక్కయ్యకు బావగారికి సత్యం వందనములు. మీరు మా వూరొస్తున్నందులకు సంతోషం. మీరు కోరుకొన్నట్టు కడపకు ఒకే కిలో మీటర్ దూరంలో వున్న మల్లేశ్వరం గ్రామంలో బ్రహ్మాండమైన బిల్డింగు చూసి వుంచాను. మీరు ఏకంగా సామానుతో వచ్చెయ్యొచ్చు – భవదీయుడు సత్యం.

సత్యం నుండి మూడు నాళ్ళలోనే వచ్చిన సమాధానాన్ని చదివి సంతోషించింది ప్రమిల మూర్తికి కొంత వూరట కల్గింది కానీ సందేహ మొచ్చింది. "అద్దె ఎంతో రాయలేదేమిటి మీ తమ్ముడు?" అన్నాడు. ప్రమిల కనురెప్పలు వాల్చి క్రింది పెదవి పంట నొక్కుతూ సాలోచనగా తలాడించింది.

"అదీ చూద్దాంగా" అంది

మరి రెండు రోజుల్లో మల్లేశ్వరం గ్రామం శివార్లలోకి బంగళా లాంటి గృహం ముందు సామాన్లు మనుషులు అంతా దిగేశారు.

వారొచ్చారని తెలిసి ఆ ఇల్లు యజమాని పెదనాయుడుగారొచ్చారు. అరవై ఏళ్ళ భారి విగ్రహం సిల్కు జుబ్బా పంచకట్టు బంగారు కళ్ళజోడుతో హుందాతోటి ఆహ్వాన సూచకంగా తాళం తీసి గదులన్నీ చూపించారాయన ఇంటి వెనక తోటకూడా వుంది. "అమ్మ బాబోయ్ ఎన్నిగదులు, ఎన్ని హాళ్ళు. మాలాంటి ఐదుకుటుంబాలు కాపరాలుండచ్చే" అనుకొంది ప్రమిల. మేడమీద క్రింద ఒకొక్క హాలు ఐదారేసి గదులు. ప్రతి గదికీ ఫంకా, బార్‌లైటు... వెనుక భాగం పెద్ద వంటిల్లు దాని వెనుక బాత్ రూమ్ మోటారు ఆన్‌చేస్తే ఐదారు కుళ్ళాయిల్లోంచి తుఫాను వరదల్లా వచ్చి పడుతున్నాయి పెద్ద భావిలోంచి అమృతం లాంటి నీళ్ళు.

ఆ నీళ్ళను చూసి ఎగిరి గంతెయ్యాలనిపించింది వాళ్ళకు ఎందుకంటే ఇదివరకు ఆంధ్రదేశంలోని ఏవూళ్ళో కాపురమున్నా అదే నీళ్ళ కోసం వారు పడ్డ బాధలు వర్ణనాతీతం. వుదయం లేచింది మొదలు వీధికుళ్ళాయిల వద్ద బిందెలు పట్టుకొని వంతులకోసం నిల్చొనేవారు కొంతమంది మధ్యలో దూరి అరిచి యాగి చేసి దౌర్జన్యంగా పట్టుకు పోతుంటే నోరెత్తలేక నిస్సహాయంగా నిల్చొనేవారు వాళ్ళ బిందె లన్నిటికి నీళ్ళు వొచ్చేవేకాదు. సగం వాసి పట్టేసరికి ఆకుళ్ళాయి ఫీత్కార ఫూత్కారాలతో దుఃఖిస్తూ ఆగిపోయేది. మరిప్పుడు ఐదారు కుళ్ళాయిల్లోంచి నీళ్ళొచ్చి పడుతోంటే వాటి కింద పడి ఆనందంతో దొర్లాడాలనిపించింది వారికి. పిల్లలు గంతులేస్తున్నారు. ప్రమిలకు మహా సంబరంగా వుంది.

మూర్తికి మాత్రం సందేహంగా వుంది. ప్రమిలతో చాటుగా–

"నాయుడు గార్ని అద్దె ఎంతో అడుగు" అన్నాడు నాయుడుగారు అది గమనించారల్లే వుంది ఆయన నవ్వేస్తూ.

"ఏమ్మా! అద్దె విషయమా? మీ సత్యం చెప్పలేదా?" అన్నారు. సత్యం నవ్వుతూ నిల్చొన్నాడు

"చూడండి మూర్తిగారూ! నాకు డబ్బు పట్టింపు లేదు మీరు నా యింట్లో సంతోషంగా కాపురముండాలి. కేవలం డెబ్బయి రూపాయ లివ్వండి లాంఛనంగా అన్నారు నాయుడుగారు. ఆ మాటకు మూర్తి ప్రమిల సంతోషం పట్టలేక మొహాలు చూసుకొన్నారు

"నాకేం ఈ ఇల్లు అద్దె కివ్వాలని లేదమ్మా మా రెండో అబ్బాయి, మీసత్యం టెలిగ్రాఫ్ ఇన్స్‌పెక్టర్లుగా స్నేహితులుగా వుంటున్నారు అతడెంతో చెప్పుకొంటే మీకిస్తున్నాను మా పెద్దబ్బాయి యమ్ బి బి యస్ అయి ఇప్పుడు యమ్. యస్. చేస్తున్నాడు దీన్ని ఒక నర్సింగ్ హోమ్‌గా చెయ్యాలని అతడికోర్కె అయితే దానికింకా రెండేళ్ళ వ్యవధి వుంది మరి నేను వస్తాను మీరు యధేచ్ఛగా ఈ బంగళాని వాడుకోవచ్చు" అంటూ కదలి వెళ్ళిపోయారాయన

* * *

మూర్తి విద్యుత్‌శాఖలో అసిస్టెంటు అకౌంటాఫీసర్. ప్రమిల కూడా దాదాపు గ్రాడ్యుయేట్ క్రిందే లెక్క. బి ఎ ఒక సబ్జక్టు పోయి అంతటితో వదిలేసి వివాహితురాలైంది. ఆ సబ్జక్టు పూర్తి చేద్దామనే అనుకొంటూంది. కానీ సంసార బాధ్యతలు పిల్లలు పుట్టుకురావడం వూళ్ళు వూళ్ళు బదిలీలు కావడంతో ఆ కోర్కె కోర్కెగానే మిగిలిపోయింది. కనీసం తమ పిల్లలనైనా మంచి వున్నత విద్యల్లోకి లాక్కు రావాలని ఆమె ఆశయం వాళ్ళ పెద్దబాబు మధు బి. యస్‌సి చివరి సంవత్సరాని కొచ్చాడు. రెండోది ఉష శారీరకంగా బలహీనురాలు. ఎప్పుడు రోగాలు , మందులు , టానిక్కులు ఆవిడకు నిత్యావాడకాలు ఇంటర్ రెండో యేడు లాక్కొస్తూంది. మూడో వాడు పది. నాలుగోది అమ్మాయి ఎనిమిది. ఆఖరివాడు ఆరవ తరగతి.

రెండు రోజుల్లో పిల్లలందరూ హడావిడిగా కాలేజీలలో స్కూళ్ళలో చేరిపోయారు. మేడమీద వారు చదువుకోడానికి దర్జాగా తలా ఓ గదిని కేటాయించుకొన్నారు ఇంటి వెనక తోటలో అన్నీ చింతచెట్లు. ప్రతి చెట్టు కిందా ఒకొక్క అరుగు కావాలిస్తే చక్కటి గాలిపీలుస్తూ ఆ చెట్ల క్రిందే చదువుకోవచ్చు పడుకోవచ్చు. తోట వెనక విశాలమైన చెరువు. చెరువు గట్టుమీద ఓ మైలుదూరం వ్యాహ్యాళి కూడా వెళ్ళి వస్తూండవచ్చు.

* * *

ప్రమిల ఇంటిని అందంగా తీర్చి దిద్దింది. అయితే ఒకటే యిబ్బంది. వుదయాన్నే టిఫిన్లు భోజనాలు

ముగించుకొని మూర్తి ఆపీసుకు, పిల్లలు కాలేజికి, స్కూళ్లకు వెళ్లిపోయాక అంత యింటిలో ప్రమిల సాయింత్రం వరకూ వంటరి తనాన్ని అనుభవించాలి. మల్లేశ్వరం గ్రామం తమ బంగళాకు రెండు ఫర్లాంగుల దూరంలో వుంది

కొన్ని రోజులు ఇంటికి తాళం వేసి వూళ్లోకి వెళ్లి అక్కడి స్త్రీలతో కాలక్షేపం చెయ్యాలనుకొంది. కానీ అక్కడి ఆడవాళ్ళు ఎప్పుడూ ఏదో పనిచేస్తూ ప్రమిలతో మాట్లాడడానికే తీరిక లేనట్టు ప్రవర్తించారు ఇలాకాదనుకొని లైబ్రరినుండి మంచి పుస్తకాలు తెప్పించుకొని కాలక్షేపం చెయ్య మొదలుపెట్టింది.

ఒకరోజు రాత్రి అంతా భోజనాలు చేస్తున్నారు

'అసలీ ఇంట్లో ముందు ఎవ్వరూ కాపరాలున్న చాయలు కన్పించటం లేదు" అంది ప్రమిల సంశయంగా

"నిజమే వూరికి ఎడంగా కట్టించారు చుట్టూ ఇళ్ళు కూడా లేవు" అన్నాడు మూర్తి మరింత సంశయంగా దాన్ని పెద్దబ్బాయి మధు కొట్టేశాడు

"కావచ్చు అయితే పెదనాయుడుగారు చెప్పారు కదా? ఈ ఇల్లు నర్సింగ్ హోమ్ కోసమని?..." అన్నాడు

"నిజమేనయ్యా మొదట కట్టించడం కాపురం చేసుకోడానికే కదా? అసలు ఈ కట్టడం ఏయాభై ఏళ్ల క్రిందటో జరిగిందిట మరి ఇన్నాళ్ళూ ఎవరూ కాపురమే వుండలేదా?" అంది ప్రమిల

అందుకు అంతా మిన్నకున్నారు

★ ★ ★

ప్రమిల వొంటరిగా వుంటుందని మూర్తి క్యాంపులకు కూడా వెళ్ళడు ఐదు అయీ కాకముందే ఇంటికొచ్చేస్తుంటాడు. అతడు రాగానే ప్రమిల కమ్మటి కాఫీ కలిపిస్తుంది దాన్ని సేవించి చెరువు కట్టమీదికి అలా వ్యాహ్యాళి వెళ్తొస్తాడు మూర్తి. ప్రొద్దు వాలిపోతుండగా యిల్లు చేరుకొంటాడు. అలా వెళ్తొస్తున్నప్పుడు ఎదురయ్యే మనుషులెవ్వరూ తనని పలుకరించక పోయినా ఒకతను మాత్రం ఎప్పుడైనా అతడ్ని పలుకరిస్తూంటాడు ఒకరోజు మాటలు మాటలు కలిపి "మీరుండే యిల్లు బాగానే వుంటాది కానీ ఆ యింట్లో ఎవరూ కాపురాలుండరు" అన్నాడతడు. మూర్తికి సంశయమొచ్చి

"ఏమయ్యా ఎందుకూ?" అన్నాడు.

"ఎందుకో మీకే తెలుస్తాది నిధానంగా. మధ్యలో నేను చెప్పి చెడ్డ కావడ మెందుకు" అని ఓ వెధవ నవ్వు నవ్వి వెళ్లి పోయాడతడు మూర్తి అసలే అనుమానస్తుడు. చీకటి పడుతుండగా యింటి కొచ్చి ప్రమిలతో అతడన్న విషయాన్ని చెప్పేశాడు. ఆవేళ ఆదివారం. పిల్లలంతా సినిమాల కెళ్ళారు ప్రమిల అప్పటికి వంటపని ముగించి మేడ వెనుక వరండాలో వూగే పేముకుర్చీలో కూర్చొని ఆకాశంతో చీకట్లో కలిసి పోతున్న సందె మబ్బుల రంగుల్ని, ఇంటి వెనుక చింత చెట్టు మీద గూళ్ళు వెదుక్కొంటున్న పక్షుల కోలాహలాన్ని గమనిస్తూ ఆనందిస్తోంది. మూర్తి ఈ విషయం చెప్పేసరికి




అతడి వైపు వింతగా సంశయంగా చూసింది.

"అంటే ఏవైనా గ్రహాలు - గాలి చేష్టలూ వుంటాయంటాడా అతడు?" అంది.

"ఏమిటో ఏమి చెప్పకుండా వెళ్లిపోయాడు" మూర్తి విసుగ్గా అన్నాడు. ప్రమిల మౌనంగా వుండిపోయింది. ఆవిడకు సైతం ఇలాంటి సందేహాలు, కొరతలూ వున్నా అవన్నీ తనలోనే దాచుకొని తన భర్త తన కన్నా సున్నిత మనస్కుడు కావడంతో ధైర్యాలు చెబుతూ నవ్వేస్తూంటుంది.

ఆవేళ, అతడి చేతుల్ని తీసుకుని వెచ్చగా నొక్కుతూ– "చూడండి ఎవరో ఏమిటో అన్నంత మాత్రాన మనం వాటిని పట్టించుకోకూడదు ఈ ఇంట్లో మనం చేరి దాదాపు నెల రోజులవుతోందికదా? నాకలాంటి భయాలేవీ కలుగలేదు. మనం పెద్దవాళ్లం ధైర్యంగా వుండాలి మనమెలా వున్నా మన పిల్లల మనస్సులోకి అలాంటి భయాలేవీ ప్రవేశించకుండా జాగ్రత్తపడాలి " అంది ప్రమిల

అంటూ ప్రమిల వెంటనే లేచి లైటువేసింది. కానీ కరంటులేదు లైటు జవాబివ్వలేదు.

* * * *

ఆ రాత్రి పిల్లలంతా సినిమా నుండి తిరిగొచ్చి భోజనాలు ముగించి ఎవరిగదుల్లోకి వాళ్ళు వచ్చేసి పడుకునేశారు మూర్తి ప్రమిల వెనుకవైపు వరాండాలో పడుకొన్నారు పిల్లలేమో నిద్రపోయారు వారుమాత్రం పదకొండు వరకూ ఎన్నో విషయాలు మాట్లాడుకొని మాగన్నుగా అలా కన్ను మూశారు

ఇంతలో ఉష గదిలోంచి బాధాకరమైన మూలుగు

'అమ్మా అమ్మా చచ్చిపోతున్నాను.... చ.. చ్చి పో. తు న్నా ను " బలహీనపు ఆర్తనాదం వస్తోంది

ప్రమిల మూర్తి చప్పునలేచి ఉష గదిలో లైటువేశారు

# మిథ్యా బింబాలు

"ఉషా... ఏమిటే" అనునయంగా పలుకరించింది ప్రమిల.

ఉషలేచి కూర్చుంది కళ్ళు మూస్తూ తెరుస్తూ, ఊపిరి ఎగిసెగిసి పడుతూ తల్లిని గట్టిగా చుట్టేసుకొంది

"ఏమిటమ్మా.... ఏమయింది?"

ఉషకు ఊపిరి పీల్చుకోడం కష్టంగా వుంది. తలవాల్చేస్తూంది. "ఇందాక ఎవరో ఆడమనిషి నా గుండెల మీద కూర్చొని నా గొంతు పిసికేస్తూందమ్మా... ఊపిరాడ్లేదు. చచ్చిపోయాననే అనుకొన్నాను." అని బావురుమంది. మూర్తి గుటకలు మింగుతూ అర్థం కాకుండా చూశాడు.

ప్రమిల చిన్ననవ్వు నవ్వింది. ఉషను మరింత దగ్గర తీసుకొంది.

"మేమంతా యిక్కడే వున్నాం కదమ్మా, అసలు ఇల్లంతా తలుపుతీసి గడీలు బిగించుకొచ్చాంకదా. ఏదీ అలాంటి మనిషి ఎలా వచ్చే వీలుంది? ఉష మాట్లాడలేదు. ఊపిరికోసం తీవ్ర ప్రయత్నాలు చేస్తోంది.

"అవన్నీ మన భ్రమలు.... ఆడమనిషిలేదు. ఎవ్వరూలేదు. రా, నాదగ్గిర పడుకొందూగాని"

ఉష లేచొచ్చి తల్లివద్ద పడుకొంది. ప్రమిల మీద చెయ్యివేసి వొళ్ళు దువ్వింది. కాసేపట్లో ఉష మంచినిద్రలోకి వెళ్ళిపోయింది. ప్రమిల అలా యోచిస్తూ గొంతు సవరించుకొంటూ పడుకొంది. మూర్తి చైన్‌స్మోకింగ్ మొదలెట్టాడు ఏ వేకువ ఝాముస్నో వారికి కాస్త కునుకు పట్టింది

ఉదయంలేవగానే ప్రమిల హుషారుగా తిరిగ మొదలెట్టింది అసలేమీ జరగనట్టే తిరిగేస్తోంది.

## 2

ఒకరాత్రి రెండుగంటల సమయం. తోటలోని పెద్ద చింతచెట్టులోంచి ఉన్నట్టుండి చివాలున పక్షులన్నీ గోలగోలగా అరుస్తూ పైకిలేచాయి. కొంగలు అరుస్తున్నాయి. గద్దలు లేచి చాలా ఎత్తుకు వెళ్ళి నక్షత్రాల కడ్డంగా డైవ్స్ కొడుతున్నాయి. గోరెంకలు బారులు బారులుగా గాలిలో దూసుకుపోతూ శబ్దాలు చేస్తున్నాయి. తీతువుపిట్టలు అరుస్తూ దూరం పారిపోతున్నాయి.

"ఎందుకని ఆ పక్షులన్నీ అలా లేచాయి ప్రమీ?"

నవ్వింది ప్రమిల "మీరు మేల్కొనే వున్నారా...."

అతడు జవాబు చెప్పలేదు.

కాసేపటికి సద్దు మణిగింది.

ఇంతలో మళ్ళీ మరొక స్త్రీ కంఠంలోంచి ఆర్తనాదం. చెరువుకట్టమీదినుంచి దూరంగా బలహీనంగా గాలిలో తేలివస్తూందా స్వరం.

"నేను సావలేదురా!.... నేను బతికే వుండానురా! నన్ను వూళ్లోంచి తరిమెయ్యకండిరా! నాయినో... నేను బతికే వుండానురా!...." అంటూ పెద్ద శబ్దం

# కనకం!

బొమ్మన్










చేసూ నీళ్ళలోకి దూకేసిన చప్పుడు.

"ఎవరు ప్రమి ఆవిడ! ఆ అరుపులేమిటి . ఆ నీళ్ళలో దూకెయ్యడ మేమిటి?...."

చిన్నగా నవ్వింది ప్రమిల

"ఏమిటో . . ఎవరో... నాకేం తెలుసు?" అంది.

మళ్లీ చైన్ స్మోకింగ్ మొదలెట్టాడు మూర్తి

* * * *

మరొక చీకటి రాత్రి. అప్పుడే గోడ గడియారం- పన్నెండు కొట్టింది. మూర్తి కుటుంబ మంతా వర్ష మొస్తూంటే క్రింద హాల్లో పడుకొన్నారు ఆవేళప్పుడు మూర్తి ప్రమిల మంచాల మధ్య స్టూలు మీద వున్న గాజు కూజా ఏ కారణం లేకుండానే క్రిందపడి ఫెళ్ళున పగిలి పోయింది ఆ అలజడికి మూర్తి, ప్రమిల యిద్దరూ లేచారు లైటు వేసింది ప్రమిల అదెలా పగిలి పోయింది ఎంత యోచించినా బోధపడలేదు వారికి

మరొక మధ్యాహ్నం అందరూ చూస్తుండగానే గోడకున్న నిలువెత్తు దేముడి పఠం క్రింద పడి బద్దలు బద్దలై పూర్కొంది.

మరొక రోజు వర్షం బాగా కురిసి ఆగిపోయింది- క్రిందనే పడుకొన్నారంతా. చీకట్లో సైకిల్ చక్రం తిరుగుతున్న చప్పుడై చివాల్న లేచి లైటు వేశాడు మూర్తి. చక్రం ముందుకు సగం వెనక్కు సగం వెక్కిరిస్తున్నట్టుగా తిరుగుతోంది. మూర్తి ప్రమిలను లేపి దాన్ని చూపించాడు ఆమె కూడా సహం నిద్ర కళ్లతో దాని వైపు అర్థం కాకుండా చూసింది

ఒక్కొసారి కారణం లేకుండానే అటకమిద తాంబాణం తట్ట వున్నట్టుండి బ్రహ్మాండమైన చప్పుడు చేసూ క్రింద పడిపోతుంది

అన్నింటికన్నా మరో వింత' ఉన్నట్టుండి గోడ గడియారం రకీమని ఆగి వూర్కొంటుంది ఏదో లోపమని వూర్కొంటే మళ్లీ కొద్ది క్షణాలలనే అదే ఆడటం మొదలు పెడుతుంది. దాని వైపు మూర్తి ప్రమిల నోళ్ళు తెరిచి చూసేవారు ఇలాంటి సంఘటనలతో వారు అనేక యోచనలు చేసూ వుండి పోయారు

"ఇక ప్రయోజనం లేదు ప్రమి టౌనులో మరో యిల్లు చూడమంటాను మా ఆఫీసు అటెండర్‌తో '

'కానీ టౌన్లో ఈ సదుపాయా లుంటాయా నీళ్ల కోసం యుద్ధాలు చెయ్యొద్దూ "

"నీళ్ళుండే ఇల్లే చూడమంటాను "

"అద్దె ఐదొంద లంటారు కడపవాళ్ళు . "

"బాబోయ్ ఎలా మరి?"

నవ్వింది ప్రమిల "వుండండి చూద్దాం. ' అంది

* * * *

ఒకరోజు చెరువు గట్టు మీద నడుస్తున్నాడు మూర్తి ఆ గ్రామ సర్పంచి రుద్రమూర్తి, అతడి అనుచరులు ముసలయ్య, ఏసోబు ఎదురు పడ్డారు మూర్తికి మూర్తికి రుద్రమూర్తి పరిచయం లేకున్నా అతడా వూరి సర్పంచి అని తెలుసు అయినా ఎన్నడూ ఎదురుపడ లేదు

'ఏమయ్యా' నువ్వేనా ఆ వూరి బైట పెద్దింట్లో కాపుర ముండేది?' అన్నాడు ఎదురు పడ్డ మూర్తితో అతడి ఏకవచన ప్రయోగం, అతడి కంఠంలోని పొగరు మూర్తిని బాధ పెట్టాయి అయినా సరిపెట్టుకో ప్రయత్నిసూ...

'అవును " అన్నాడు

'పిల్లా పాప గల్లోడివి. నీ కెవరు చూపించారా యింటిని?" అన్నాడు రుద్రమూర్తి.

ఏం? ఏమయిందా యింటికి?" అన్నాడు మూర్తి

"నేనిదివరకే చూచాయగా చెప్పి చూశానయ్యా " అన్నాడు ముసలయ్య అతడి వైపు చూశాడు మూర్తి రుద్రమూర్తిని చూశాడు

"ఏమిటండీ అసలు విషయ మేమిటో స్పష్టంగా చెప్పండి?" అన్నాడు విసుగ్గా, బాధగా. అందుకు సవాలుగా నవ్వాడు రుద్రమూర్తి

"నువ్వు చెప్పరా ఏసోబూ" అన్నాడు ఆ రెండో వ్యక్తి మూర్తిని ఎగాదిగా చూసూ -

ఆ యింట్లో దయ్యాలూ పిశాచాలూ తిరుగుతుండాయి ' అన్నాడు

రుద్రమూర్తి మీసాలు మెలేసూ నవ్వాడు

"నీకు దెబ్భయి రూపాయలకే అంత పెద్ద దేవిడీని ఆ ముసిలోడు ఎందు కిచ్చాడను కొన్నావు?" అన్నాడు

"ఆ యింటి సుట్టూ ఎప్పుడూ దెయ్యాలు తిరుగుతుంటయి. నాయుడోళ్ల భార్యను సంపి ఆ

పంటింటి గాల్లో బూడ్చు పెట్టుంద్రు ఆ బావిలో ఒక బ్రాహ్మలావిడ దూక సచ్చి పోయి ఆ నంత సెట్లల్లో పిశాశమై తిరుగు తుంటది అసలు పట్టపగలె ఆ యింటి సాయలకు ఎళ్లరె ఎవ్వరూ ..' ముసలయ్య మూర్తి వైపు చూస్తూ పలికాడా మాటలు

మూర్తి జవాబు చెప్పలేదు నిశ్చేష్టుడై నిల్చొన్నాడు.

వారు ముందుకు కదిలి వెళ్లిపోతున్నారు

'సూడు. బాగా యోచించుకో అన్నాడు ఏసొబువారి ననుసరించి వెళుతూ.

## 3

మూర్తి విసుగ్గా యింటి కొచ్చి ప్రమిలతో జరిగిన సంగతులన్నీ చెప్పాడు. ఆవేళ సెలవు రోజు ప్రమిల తమ పెద్ద బాబును పిల్చి నాయుడు గార్ని పిలుచుకు రమ్మంది.

కొద్ది నిముషాల్లోనే నాయుడు గారు వచ్చి వరండాలో కూర్చొన్నారు. ఇంటిల్లిపాది ఆయన ఎదుట కొచ్చి నిల్చొన్నారు

"ఏమ్మా పిలిపించారట" అన్నా రాయన

ప్రమిల జరిగిన విషయాలన్నీ నాయుడు గారితో ఏకరువు పెట్టింది అంతా విన్న నాయుడుగారు ప్రశాంత మందహాసాలతో తలవూచారు

"చూడమ్మా. ఈ ఇంటికి అలాంటి దోషా లేవీ లేవు అవన్నీ కట్టు కథలు" అన్నారాయన

'బ్రిటీషు హయాములో కట్టించిన ఇల్లు యిది. నా పెద్ద కుమార్తె వివాహానికి డబ్బులు తక్కువ పడి ఇదే రుద్రమూర్తి తండ్రి శివరుద్రయ్య వద్ద పదివేలు అప్పు తీసుకొన్నాను ఏడాది తర్వాత ఆ బాకీ దానివడ్డి తీర్చడానికి వెడితే శివరుద్రయ్య ఈ యింటిని ఈ డబ్బుకు బదులు తనకు రాసిమ్మన్నాడు. నేను సమ్మతించక డబ్బుతే కట్టేశాను కానీ శివరుద్రయ్య నన్ను అనేక విధాల బెదిరించి లొంగ దీసుకోవాలని ప్రయత్నించాడు. నేను సమ్మతించక పోవడంతో నాపై కక్ష కట్టాడు ఇప్పుడు శివరుద్రయ్య చనిపోయినా రుద్రమూర్తి అదే కక్ష సాధింపులో నేవున్నాడు. ."

"మరి మి భార్యను ఈ యింట్లో చంపి ..." సగంలో మాట నిలిపి వూర్కొంది ప్రమిల

నాయుడు గారు అదే ప్రశాంత వదనంతో నే నవ్వారు మళ్లీ

చూడమ్మా. నా భార్య క్షయ రోగంతో ఆస్పత్రిలో కన్ను మూసింది. నా భార్య సమాధి మా చీని తోటలో వుంది. కానీ ఆవిడ్ని చంపి పాతి పెట్టేంతటి కిరాతకత్వం మాకు లేదు." అన్నా రాయన.

"నా భార్య సరైన చికిత్స లేక చనిపోయింది. అలా భవిష్యత్తులో ఎవరూ చనిపోకూడదని నా కుమారుడు యమ్. యస్. డిగ్రి చేస్తున్నాడు ఇంక రెండు మూడేళ్లలో యిదే బంగళాలో నర్సింగ్‌హోమ్ పెట్టి పేదలకు వుచిత సేవ చేసి వాళ్ల తల్లి ఆత్మకు ఆనందం కల్గించాలని అతడి పట్టుదల."

"మమ్మల్ని క్షమించండి బాబాయ్ గారూ" అంది



ప్రమిల– నాయుడుగారి హుందా తనం ముందు సిగ్గు పడిపోతూ

"మీకు మరో పుకారు కూడా కల్గించి వుంటారు వాళ్లు ఈ భావిలో ఎవరో బ్రాహ్మణ స్త్రీ దూక చచ్చిపోయి ఇక్కడ పిశాచమై తిరుగుతోందని– అన్నారాయన నవ్వుతూనే

"అవును బాబాయ్" అంది ప్రమిల

'ఆ విషయం నిజమే పాతికేళ్ల క్రితం ఈ వూళ్లో మాధవరావనే బడిపంతు లుండేవాడు ఆయన చెల్లెలు రాధమ్మ యుక్త వయసులోనే వైధవ్యం పొంది– ఒక చిన్న కుమారుడితో ఆయన పోషణలో వుండేది ఇదే రుద్రమూర్తి ఆ అమ్మాయి శీలాన్ని చెరిచా డొకనాడు. ఆ అవమానాన్ని భరించలేక ఆ బిడ్డ ఈ భావిలో దూకి ప్రాణాలు తీసుకొంది ఆమె ఎప్పుడూ దైవధ్యానం చేసుకొంటూ ఆధ్యాత్మిక గ్రంథ పఠనం చేసుకొంటూ కాలం గడుపు తుండేది. అలాంటి వ్యక్తి భగవంతునిలో ఐక్యమవుతుందే తప్ప పిశాచమై మా తోటలో ఎలా తిరుగుతుంది ' అన్నారాయన

"మరి మీరు ఆ రుద్రమూర్తి మీద ప్రతీకారం ఎందుకు తీసుకోరు?" అన్నాడు మధు.

అందుకు నాయుడు గారు ఒక యోగి లాగా నవ్వారు

"చూడు బాబూ నేను ప్రతి వ్యక్తిలోనూ దైవాన్నే మంచితనాన్నే చూస్తుంటాను తప్ప ప్రతీకార వాంఛ అన్నది మానవ బలహీనతగా భావిస్తాను! రుద్రమూర్తి సైతం ఒకనాటికి మంచి వ్యక్తిగా మారకపోడు తన పాపాలకు పశ్చాత్తాప పడక పోడు. మరి నేను వస్తాను. మీకు వీలుంటేనే ఈ యింట్లో వుండండి. బలవంత మేమి లేదు..."

నాయుడు గారు హుందాగా లేచి వెళ్లిపోయారు

### విషాద గీతం

ఒక్కో నిముషం
ఒక్కో యుగంగా
భారంగా నడుస్తున్న ఈ రాత్రుల్లో
నీ చుట్టూ
ఆలో చనలతో పరిభ్రమిస్తూ
నిశ్శబ్దాన్ని నెమరేసుకుంటూ
చీకటిని కౌగలించుకుంటున్నాను-
ఆకాశంలో కనబడతావని చూస్తూ
నక్షత్రాలు లెక్కబెడుతూనే ఉన్నాను-
జీవం లేని శవంలా ఒంటరిగా బ్రతుకుతూ
మరణం లేని ఓ ఆశని మిగుల్చుకున్నాను.
నిన్ను స్మరిస్తూ
ఏ నాటికైనా పైనుంచి
నా కోసం ఓ రెండు
కన్నీటి బొట్లైనా రాల్తాయే మోనని!

-షేక్ అక్బర్ బాషా

ఆయన వెళ్లిపోతుంటే–

'చూడండి బాబాయ్ గారూ' మేమెక్కడికి వెళ్ల దల్చలేదు ఈ ఇంట్లోనే వుంటాము ' అందామనుకొన్న ప్రమిల నోట దాకా వచ్చి వూర్కే వుండి పోయింది మూర్తి వూర్కే యోచిస్తూ వుండి పోయాడు

అసలు మి అనుమానా లేమిటి నాన్నా' నాకు చెప్పండి" అన్నాడు మధు. ప్రమిల తన కుమారుడిని చూసి గర్వించకుండా వుండలేకపోయింది

'చూడండి' మనం అందరం విద్యావంతులం. ప్రతి అంశాన్నీ హేతువాదంతో నే పరిశీలించాలి కాదంటారా?" అన్నాడు

"నా అనుమానాలు సవాలక్ష వున్నాయి నువ్వేం తీర్చగలవు?" అన్నాడు మూర్తి.

పోనీ అడగండి మన పెద బాబే సమాధానం చెబుతాడుగా?" అంది ప్రమిల. అంతా యింట్లోకి నడిచారు. సోఫాల్లో కూర్చొన్నారు.

"అప్పుడప్పుడూ చెరువు గట్టుమీద అర్ధరాత్రి ఎవరో స్త్రీ ఎందుకలా ఏడుస్తుంది? దబ్బున నీళ్లలో కెందుకు దూకుతుంది?"

మధు నవ్వాడు అందుకు

"ఆవిడ ఈ గ్రామంలో తిరిగే పిచ్చిది. ప్రతిరోజూ మన ఇంటి మీదుగానే వెడుతూంటుంది ఆవిడలా అరవడం నీళ్లలో దూకడం నేను నా స్నేహితులతో బాగా దగ్గరి కెళ్లి చూశాము " అన్నాడతడు

మూర్తి ప్రమిల ఆశ్చర్యంతో మొహాలు చూసుకొన్నారు

"మరి ఒక అర్ధరాత్రప్పుడు మన దొడ్లోని పెద్ద చింత చెట్టు మీది పక్షులన్నీ ఎందుకలా గోలగోలగా అరిచాయి?" మూర్తి ప్రశ్నించాడు

"ఇక అవి అలా అరవ్వు లెండి "

'ఎట్లా?"

ఒక కోడె నాగు లాంటిది అప్పుడప్పుడూ పక్షుల గ్రుడ్ల కోసం ఆ చెట్టెక్కు తూండేది నాకు సైతం ఒకటి రెండు సార్లు అది చాలా దూరంలో కనిపించింది. కానీ ఇవాళ ఉదయమే యానాది వాళ్లు దాన్ని పట్టి చంపేశారు " అన్నాడు మధు

థాంక్ గాడ్...." అనుకొంది ప్రమిల.

'మరి అర్ధరాత్రివేళ నా సైకిల్ చక్రం ఎందుకలా తిరుగు తుంది?" అన్నాడు మూర్తి మధు నవ్వేశాడు అందుకు

"ఏమిటి నాన్నా మీరు మాకు చెప్పాల్సింది పోనిచ్చి మేమే మీకు చెప్పాల్సి వస్తూంది" అన్నాడతడు "చూడండి? వీటిని సైన్సులో మిథ్యాబింబా లంటారు"

'నిజమేరా.. ఏమిటి బాబూ అందుకు కారణం?" అంది ప్రమిల.

"దట్స్ వెరి సింపుల్ మీ సైకిల్ చక్రం తిరగడానికి, అటకమీది పళ్లెరం క్రిందికి పడిపోవటానికి, దేముడి పతం క్రిందికి పడటానికి ఇంకా చెప్పాల్సొస్తే ఒక అర్ధరాత్రి స్టూలు మీది గాజు కూజాకు ఆయుస్సు చెల్లి పోవడానికి మనింట్లో చాలా కాలంగా రాజ్యం

# కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా, క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీదే పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.



శ్రీ బి. మోహనరావు శ్రీమతి మంగమ్మ

# పిల్లలు భయభక్తులు లేకుండా పెరుగుతారు!

పెళ్ళిళ్ళు స్వర్గంలో నిర్ణయింప బడతాయని, నమ్మినవాడిని! నేను పిల్లని కూడా చూడకుండా, కట్నం తీసుకోకుండా పెళ్ళి చేసుకున్నాను. అప్పట్లో నేను చేసేది టైపిస్టు ఉద్యోగం. పూర్ణాపిక్చర్స్‌లో! నా

కొచ్చే జీతంరాళ్ళు సంసారానికి సరిపోవని నా భార్యను కూడా ఉద్యోగం చెయ్యమన్నాను. ఇందులో తప్పేముంది? అప్పటికే తను కూడా ఉద్యోగ ప్రయత్నంలో ఉండటం వలన తేలికగానే గవర్నమెంటు ఉద్యోగం సంపాదించుకుంది" అన్నారు బి మోహనరావు.

ప్రస్తుతం మోహనరావు పూర్ణాపిక్చర్స్ ప్రైవేట్ లిమిటెడ్‌కు మేనేజరుగా ఉంటున్నారు. ఆయన భార్య శ్రీమతి మంగమ్మ ఇన్ కమ్ టాక్స్ డిపార్ట్‌మెంటులో యు డి.సి.గా ఉద్యోగం చేస్తున్నారు.

"తుమ్మితే ఊడిపోయే ముక్కు లాంటివి ప్రైవేటు కంపెనీలలో ఉద్యోగం! నేను మామూలు టైపిస్టుగా చేరి మా యాజమాన్యం మన్ననలు పొంది అదే కంపెనీకి మేనేజర్‌ను అయ్యాను నన్ను ఇంతవాణ్ణి చేసిన శ్రీ కామరాజు గారిని జన్మలో మరిచి పోలేను! నా ప్రైవేటు ఉద్యోగానికి, మా ఆవిడ చేసే ప్రభుత్వ ఉద్యోగానికి సరిగ్గా సరి పోయింది" అంటారు మోహనరావు

"భార్యాభర్తలిద్దరూ ఉద్యోగం చేయడం చాలా అవసరమే కానీ పిల్లలు భయభక్తులు లేకుండా పెరుగుతారు తల్లి భయంకన్నా తండ్రి భయం పిల్లలకుంటే వారు క్రమశిక్షణతో మంచి చదువులు చదివి ఉన్నత స్థానాలు ఆక్రమించు కుంటారు కానీ మా పిల్లలు కనీసం డిగ్రీ కూడా పూర్తి చేయలేక పోయారు అది మా ప్రత్యేక పర్యవేక్షణ లేకపోవడం వల్లనే అనుకుంటాను. అదొక్కటే మాకు బాధగా ఉన్నది!" అన్నారు శ్రీమతి మంగమ్మ

"ఎవరి ఖర్మకు ఎవరు బాధ్యులు? వారి నుదుట

## ఇద్దరూ ఉద్యోగస్తులైతే

చదువురాత వ్రాసి లేదు– అబ్బలేదు. కానీ ఎమ్మేలు చదివిన వారికి కూడా రాని ఉద్యోగం మా పెద్దవాడు చేస్తున్నాడు. చిన్నవాడు బల్లగుద్ది మరీ చెప్పాడు, "నేను చదవను, ఉద్యోగం చెయ్యను" అని. అలాగే వ్యాపారం చేసుకుంటూ వాడూ స్థిర పడ్డాడు. ఎంత తల్లిదండ్రుల భయం ఉంటే మాత్రం ఖర్మలో ఎలా ఉంటే అలా జరుగుతుంది దానిని ఎవ్వరూ తప్పించ లేరు" అంటూ వేదాంతం – తన సిద్ధాంతంగా చెప్పారు శ్రీ మోహనరావు

"ఇదండి ఇలా పిల్లల్ని వెనకేసుకు రావడం వల్లనే వాళ్ళకు నా మాటంటే విలువ లేకుండా పోతోంది. మేమిద్దరం ఎంత కష్టపడితే ఈ స్థితికి వచ్చాము!" పిల్ల కాకికేం తెలుసు ఉండేలు దెబ్బ" అని– నాన్నా అమ్మా సంపాదిస్తున్నారుగా మనకేం దిగులు? అనుకుని బాధ్యతలు గమనించకుండా పెరిగారు. అంతే కాకుండా సహవాస దోషం కూడా ఉంటుంది కదండీ !

చిన్నతనంలో మా అమ్మగారు చూసుకునే వారు కాబట్టి యేమంత బాధపడలేదు. ఎదిగిం తరువాత మాట అంటే పడే స్థితిలో ఉండరు.

మేము లేనప్పుడు ఇంటికి ఎవరన్నా వస్తే గానీ, ఏవన్నా ఇన్విటేషన్స్ వచ్చినా మాకు తెలియ జేసేవాళ్ళు ఉండక పోవడంతో బంధువర్గంలో కూడా నిష్ఠూరాలను ఎదుర్కోవలసి వస్తోంది" అన్నారు శ్రీమతి మంగమ్మ ఆవిడ అభిప్రాయంతో ఏకీభవించారు శ్రీ మోహనరావు

శ్రీ మోహనరావు సరస సంభాషి! ఆయన ఎక్కడుంటే అక్కడ బెల్లం చుట్టూ ఈగల్లాగా మిత్ర బృందం ఉంటుంది వారికి తగ్గట్టుగానే మోహనరావుది భారీ చెయ్యి దాన్ని కాస్త కట్టుదిట్టం చేసుకుంటే ఆయన మరికాస్త వెనకేసుకోడానికి అవకాశం ఉండేది.

– కృష్ణాజీ

---

చేస్తున్న బ్లడీ పందికొక్కు కాళిణం. దొంగ రాస్కెల్ దాన్ని ఈ రాత్రికి దుప్పటి వేసైనా పట్టి చంపి తీరాలి. "అన్నాడు మధు...

'బాగుంది మరి ఒకరాత్రి తెల మన ఉష ఎందుకలా నిద్దుటిలో ఆర్తనాదం చేసింది. ఎవరో స్త్రీ దాని గుండెల మీద కూర్చుంది అని మొత్తుకొందే అది?" అన్నాడు మూర్తి.

"చూడండి నాన్నా. ఉష బలహీనురాలు. మా సైన్సులో ఒక పాఠం వుంది మాకు. "ది హైర్ ఆఫ్స్ అండ్ ది సైంటిఫిక్ ఫ్యాక్ట్స్..." ఆ పాఠం పేరు." అంటూ చప్పున తన గదిలో కెళ్ళి ఒక లావు పాటి పుస్తకాన్ని తెచ్చి అందులోని కొన్ని పేజీల్ని తిరిపి వాళ్ళ నాన్నకు చూపించాడు అతను.

"చూడండి ఈ రెండు ఫొటోస్ చదివితే మీకే తెలుస్తుంది." అన్నాడు.

"బలహీనులు కొందరు పెళ్ళిలా పడుకొని

## మిథ్యాబింబాలు

నిద్రిస్తూ కుడి రొమ్ము మీద చెయ్యి వేసుకొంటారు అప్పుడు మెదడుకు వూపిరితిత్తులకు రక్తాన్ని సరఫరా చేసే నరానికి ఆటంకం కలిగి రక్త ప్రసారం ఆగిపోతుంది. అప్పుడు గుండెలమీద ఎవరో బలమైన వ్యక్తి కూర్చొని గొంతు నులిమేస్తున్నట్టు వూపిరి అందక బాధ పడ్తారు. అప్రయత్నంగా చెయ్యి ప్రక్కకి తొలగగానే వెంటనే రిలీఫ్ వచ్చేస్తుంది కొంత మంది అది దయ్యమని భయపడి పోతారు. ఆ రోజు మన ఉషకు అలాగే అయివుంటుంది." నూనూగు మీసాలతో చిరు చిరునవ్వులు చిలుకుతూ ఎక్స్‌ప్లెయిన్ చేస్తున్న ఆ పసి మొహంలోని పట్టుదల చూసి ముచ్చట పడింది ప్రమీల. మూర్తి ఆ పుస్తకంలోని పేరాలని శ్రద్ధగా చదివాడు.

'ఏం సార్. మీ డౌట్సన్నీ తీరినట్టేనా?" అంది ప్రమీల భర్త ముఖంలోకి చూసి నవ్వుతూ.

"ఇంకొక్క డౌటు" అన్నాడు మూర్తి "ఆ గోడ గడియారం ఎందుకు అలా వున్నట్టుండి ఆగిపోతుంది మళ్ళీ అదే ఆడటం మొద లెడుతుంది దాన్నేమను కోవాలి?"

మధుకు ఆ విషయం అర్థంకాక తల్లి ముఖంలోకి చూశాడు చిలిపిగా అందుకు ప్రమిలకు ఏదో తలపుకొచ్చి పెద్దగా నవ్వేసింది పిల్లలందరు కూడా అలాగే నవ్వేశారు

"ఎందుకలా నవ్వుతారు?" అన్నాడు మూర్తి అయోమయంగా

"చూడండి సర్! ఆ గోడగడియారం మీ తాతల నాటి దల్లో వుంది. దాన్ని మన భావిలో పడేసి వేరే మంచి స్టైలిష్ గడియారాన్ని తెచ్చుకొందాం పదండి మొదట" మళ్ళీ నవ్వేస్తూనే అంది ప్రమీల. పిల్లలంతా కూడా నవ్వేశారు – మూర్తి తప్ప. □

# పాలాక్షుని డైరి

## పసివాని హత్య!

బెంగుళూరు జాన్సన్ మార్కెట్టు ప్రాంతానికి చెందిన జయదేవ అనే వో వుపాధ్యాయుని 7 ఏళ్ల కొడుకు జయప్రకాష్ ఎప్రియల్ 26వ తేది సాయంత్రం ఆటలకని స్కూలుకు వెళ్లిన వాడు తిరిగిరాలేదట దాంతో జయదేవ స్కూలుకు వెళ్లి వెతికితే వో క్లాసు గదిలో జయప్రకాష్ చచ్చిపడున్నాడట ఎవరో అతని పీక నులిపి చంపేశారట ఎవరు ఎందుకు ఆ పసవాడిని చంపారో చంపాల్సి వచ్చిందో యింకా తేల్లేదట

## ఆరుబయట నిద్రిస్తుండగా హత్య!

బెంగుళూరుకు చెందిన ముదలపాలయం ప్రాంతానికి చెందిన వెంకోబరావు అనే ఆసామి కొడుకు 28 ఏళ్ల గోవిందరావు 26వ తేదిన ఆరుబయట నిద్రిస్తుండగా ఎవరో అతన్ని బండరాయితో తల పగులగొట్టి చంపేశారట తల పగిలి రక్తపుమడుగులో పడుకున్న పళంగానే అతను చనిపోయాడట గోవిందరావు ఆటో రిక్షా నడిపేవాడట ఈ దారుణం ఎవరు ఎందుకు చేశారో తేలలేదట

## మత్తులో బాధలు మరిచిపోతున్న ఫ్రాన్సు ప్రజలు!

ఫ్రాన్స్‌లో మద్యపానానికి అలవాటుపడిన వారు చాలా ఎక్కువట సంపాదన ఖర్చుల వివరాలు తీస్తే చక్కని శాతంలో త్రాగుడు ఖర్చు కనుపిస్తుందట ఇపుడు యీ వ్యసనం కొత్తదారి తొక్కిందట అక్కడ సుమారు 80 లక్షల మందయినా మత్తు పదార్థాలను ఇంజక్షను ద్వారా శరీరంలోకి పంపుకుంటూ మా బాదలు మర్చిపోతున్నాం అని మత్తులోకి జొగిపోతున్నారట వీరిలో ఆడవారి శాతమే చాలా అదికమట

## అమెరికాలో కన్నె పిల్లల పిల్లలు!

అమెరికాలో 16–18 ఎళ్ళ లోపు వయస్సున్న అమ్మాయిలు ఆనందం కోసం సరదా తమాషా కోసం తమకు నచ్చిన యువకులకు తమ సర్వస్వం అర్పించి తత్ఫలితంగా కడుపులు తెచ్చుకుంటున్నారట వీరు తాము కడుపుతో వున్నామని గ్రహించే లోపునే గర్భస్రావం చేయించుకునే స్థితి దాటి పోతోందని దానివల్ల వారు పిల్లలను కని తీరాల్సి వస్తోందనీ కూడా ఎ బి స టి వి ప్రకటించిందట ఇటువంటి వారి సంఖ్య సుమారు 10 లక్షలకు చేరిందని వారు వాపోయారట దిన్ని అరికట్టడానికి ప్రభుత్వం ఆలోచించి ఈ శిశువులను అనాదలుగా గాక వారి పోషణ బారం ఆ శిశువులను కన్న కన్నె పిల్లల తలిదండ్రులకు చట్టపరంగా వప్పు చెప్పాలని తీర్మానించిందట దినివల్ల తమ పిల్లలు కాలుజారకుండా వుండేలా ఆ తలిదండ్రులు జాగ్రత్త పడతారని ప్రభుత్వం ఆశిస్తోందట

## శతాధిక వృద్ధుని వివాహ ప్రకటన!

యు యస్ ఎ కు చెందిన ఓక్‌లాండ్ లో ఆర్థర్ లీడ్ అనే శతాదిక వృద్ధుడు చక్కని పదహారేళ్ల బాలా కుమారిని వివాహం చేసుకోవాలని వుందని వో ప్రకటన చేశాడట ఇతగాడు బుఫాలో నగరంలో 1860 జూన్ 28న జన్మించాడట ఇతనికినాడు 126 సంవత్సరాలు వయస్సట వోరి ఎడుగా!

## శరీర ఆరోగ్యానికి లైంగిక సుఖం!

శరిరం ఆరోగ్యంగా ఆనందంగా వుత్సాహంగా వుండాలంటే మనిషికి లైంగిక సుఖం నూటికి నూరుపాళ్ళూ అవసరమట లైంగిక సంపర్కంలో స్త్రీ పురుషుల వ్యాయామ చర్య వారి శరిరానికి చాలా అవసరమట ఈ లైంగిక చర్యలో స్త్రీ పురుషుల శరీరంలోని ప్రతి నరమూ వుద్రేక పడడం సంతృప్తి పడడం జరుగు తుందని కాలిఫోర్నియాకు చెందిన డాక్టర్ సాల్‌మన్ అన్నారట గుండె జబ్బు మూత్ర పిండాలకు సంబందించిన జబ్బులు శ్వాసకు సంబందించిన రోగాలు మొదలైనవన్నీ యీ వ్యాయామం వల్ల తగ్గుతాయని కొన్ని వరికి రావనీ ఆయన అన్నారట

## 62 సంవత్సరాలు ప్రయాణం చేసిన ఉత్తరం!

ఉత్తర్‌ప్రదేశ్‌కు చెందిన షహరన్‌పూర్ జిల్లాలోని బాలిస గ్రామంలో ఒకాయన హరియాణాకు చెందిన కురుక్షేత్ర అనే వూరిలోని తనవారికో కార్డు రాస్తే అది 62 సంవత్సరాలు ప్రయాణంచేసి ఆ యింటి తలుపు తట్టిందట స్వాతంత్ర్యం రాక ముందు 25 ఏళ్ల క్రితం అనగా 1922 లో రాసిన ఉత్తరం స్వాతంత్ర్యం వచ్చిన 37 ఏళ్లకు చేరిందట అహో !!

## 23 సం లకు గమ్యం చేరిన ఉత్తరం!

ఇటలీకి చెందిన యుడిన్ అనే నగరానికి మిలన్ నుంచి ఒకాయన వుత్తరం రాస్తే అది 382 మిటర్ల దూరమూ ప్రయాణం చేసి 23 సంవత్సరాలకు యుడిన్ చేరిందట నత్త కూడా రోజుకు 45 మిటర్లు ప్రయాణం చేయగలదనీ యీ వుత్తర ప్రయాణాన్ని నత్త నడకతో కూడా పోల్చ వీలులేదనీ పత్రికలాదేశంలో విమర్శించాయట

## దేవి ఆలయానికి 1400 కి మి పాక్కుంటూ వెళ్లిన భక్తుడు!

అలిపుర్‌కు చెందిన జగదిష్ చందర్ అనే వో యువకుడు జమ్ము కాశ్మీర్‌లో వున్న మాతా వైష్ణవిదేవి ఆలయానికి పాక్కుంటూ వెళ్లాడట 1400 కిలో మిటర్ల ఆ దూరాన్ని అతగాడు పాకడానికి 15 నెలలు పట్టిందట ఆ పనెందుకు చేసనట్టో?

## జపానులో నిలువ నీడలేని జనాభా!

జపానులో నిలువ నీడలేని జనాబా చాలా ఎక్కువవుతోందట చెట్ల క్రింద ఫుట్‌పాత్‌ల మిద ప్లాట్ పారాలమిదా నివాసం ఎర్పరుచుకున్న కుటుంబాలు ఎక్కువయి పోతున్నాయని జనాబా లెక్కలు తీసిన ఆ ప్రభుత్వం గోల పెట్టెస్తోందట— వార్ని అక్కడా అంతేనా!! □



# జయసుధ సమాధానాలు



గోరంట్ల మాదవ కృష్ణయ్య
యం కె పల్లి

**సినిమాల్లో వివాహం సన్నివేశంలో పీటల మీద వధూవరులు ఒకరినొకరు చూచుకుని నవ్వుకుంటారు నిజ జీవితంలో ఇలా జరగదు. మరెందుకని అలా చిత్రీకరిస్తారు?**

సినిమా కనుక

ఆర్ బాగ్యరేఖ మహబూబ్‌నగర్

మీరు పోషించే పాత్రల ప్రబావం మీ నిజజీవితంలో ఎంతవరకూ ఉంటుంది?

అన్ని చిత్రాల్లోని పాత్రల స్వభావం ఉండదు కాని కొన్ని పాత్రల్లో నటించి ఇంటికి వచ్చాక కూడా ఆ పాత్రలోని పలానా సన్నివేశంలో ఇంకా బాగా చేయాలనే తలంపు కల్గుతుంది.

సి హెచ్ కృష్ణ ఒంగోలు

మీ పొటో పొందాలంటే నేనేమి చేయవలెను?

ఆలోచనాత్మకంగా ఉండే చక్కని ప్రశ్నను వ్రాస్తే- ఫొటో మీ దగ్గరికి వస్తుంది

యం వసంతవల్లి, ఖమ్మం

విద్య గొప్పదా? వినయం గొప్పదా?

వినయంతో కూడిన విద్య మంచిది

ఉమామహేశ్వర్, కొంకుదురు

తల్లి - తండ్రి - గురువు - వీరిలో ఎవరు గొప్పవారు?

జన్మకు కారకుడైన తండ్రి నవ మాసాలు మోసి కని పెంచిన తల్లి విద్యా బుద్ధులు నేర్పించే గురువూ ముగ్గురూ ముగ్గురే! వీలయితే ముగ్గుర్ని ప్రతిక్షణం కాని, లేక రోజు కొకమారైనా తల్చుకొని వారి అనురాగాన్ని పొందడం మనిషి మొదటి కర్తవ్యం

## ఉత్తమప్రశ్న

పద్మా సత్యనారాయణరెడ్డి,
కొప్పవరం

ప్రేమికులైన యువతీ యువకులను ప్రతి తల్లి - తండ్రులు ఆశీర్వదించి పెళ్ళి చేయాలి అని నేను అంటాను. మరి మీరే మంటారు?

పిల్లల మనస్థత్వాల్ని తెలుసుకుని పిల్లల భవిష్యత్‌ను ఆలోచించి ఆ జంటను ఒకటిగా చేస్తేనే బాగుంటుంది అని అంటాను.

యల్. శోభ, కరగ్‌పూర్

మీరు నటించిన సినిమాను మీరు తెరపై చూస్తే మీకు ఎలా అన్పిస్తుంది?

బాగానే ఉందనిపిస్తుంది

ఎ యస్ రంగనాయకులు, డోను

సినిమారంగం - రణరంగమని ఈ చిత్రసీమ విచిత్రసీమ అని మీలాంటి అనుబవశాలురు చెబుతున్నా అదే జీవితం కోసం అర్రులు చాచేవారికి ఏమిటి మీ సందేశం

కొత్తకు ఎప్పుడూ ఆహ్వానం పలుకుతుంది చిత్రసీమ కొత్తవాళ్ళు రావాలి పాతవాళ్ళు కావాలి మళ్ళీ కొత్త ఎప్పటికీ కొత్త కొత్తగానే క్రొంగొత్త పోకడలతో నడుస్తుంది చిత్రసీమ అయితే వచ్చే యీ కొత్తవారిలో ఏదో ఒక సరికొత్తదనం వుండాలి అలా వున్నప్పుడు సినిమా జీవితం కోసం ప్రయత్నించడంలో తప్పులేదు

వి శశికళ జమ్మలమడుగు

మహిళా మహాసభల్లో స్త్రీలందరూ నిశ్శబ్దంగా వుండే సందర్భం వుంటుందంటారా?

అవసరం అనుకున్నప్పుడు ఏదైనా చేయగల్గ తెగింపు నేర్పు మగవారిలో కన్నా ఆడవారిలోనే ఎక్కువ వుంటుందని నమ్మేవాళ్ళలో నేనొకర్ని సమస్యను బట్టి చర్చించే సమయంలో ఎవరైనా నిశ్శబ్దంగా ఉంటారు

జి విజయకుమార్ మహబూబాబాద్

మీ దృష్టిలో చిత్రం అంటే ఎలా వుండాలి?

అందరూ చూసి 3 గంటలపాటు తమని తాము మైమరచే రీతిలో ఉండాలి వినోదాన్ని విజ్ఞానాన్ని సమపాళ్ళలో పంచగలిగేట్టుగా వుండాలి

యు కె బేబి శ్రీదేవి, యమ్మిగనూరు

సెన్సార్ అద్యక్షురాలు స్థానంలో మీరే వుంటే ఎలాంటి సినిమాలకు అయితే సర్టిఫికెట్‌లు యిస్తారు?

అందరూ చూసి మెచ్చుకునే చిత్రాలకు

కె శివయ్య ఆకివీడు

మీకు ఎటువంటి అబిమానులంటే ఇష్టం?

అబిమానులం అంటూ దురబిమానులుగా ప్రవర్తించకుండా తమ అబిమానాన్ని తమ గుండెల్లో పదిలంగా దాచుకునే అబిమానులంటే నా కిష్టం

యం ఆర్ బారతి ఖమ్మం

వరకట్నంపై మీ అబిప్రాయం?

సదబిప్రాయం మాత్రం లేదు వరకట్న సమస్య సమసి పోవాలన్నదే నా అబిప్రాయం

సి హెచ్ సుదీర్‌కుమార్ అద్దంకి

ఇప్పుడు వచ్చే సినిమాలు చాలావరకు దెబ్బతింటున్నాయి కారణం ఏమిటంటారు?

చక్కని కథల కోసం ప్రయత్నించక పోవడమేనన్నది నా అబిప్రాయం!

బి వెంకటేశ్వర్లు ఖమ్మం

ఒక ఆదర్శ గృహిణి బర్త నుండి కోరేది అనురాగమా? ఐశ్వర్యమా?

అనురాగంతో కూడిన తన సంసారం నిత్యం కళ కళ లాడేందుకుగాను ఐశ్వర్యాన్ని ఆశిస్తుంది. □

# అభిమాన తారలపై అభిప్రాయం

నా అభిమాన నటుడు చిరంజీవి అతను నటించిన చిత్రాలు అన్నీ చూస్తాను అతని నటనంటే నాకు చాల ఇష్టం హాస్య రస పాత్ర అవనీ కుటుంబ కథా చిత్రం అవనీ, క్రైమ్ పోరాట సన్నివేశాల చిత్రం



అవనీ, ఏ పాత్రయినా అత్యంత ప్రతిభావంతంగా పోషించగల నటుడు మా చిరంజీవి.

చిరంజీవి గారి అభిమానిగా అతనికి నేనిచ్చే నిర్మాణాత్మకమైన సూచన ఏమిటంటే ఒకే తరహా పాత్రలు పోషించ వద్దని. పాటలలో స్టెప్స్ చాల స్పీడ్‌గా ఉంటున్నాయి. "విజేత" చిత్రంలోని మదుసూదనరావు పాత్ర నాకు బాగా నచ్చింది.

– కొత్తపల్లి మాణిక్యాలరావు,
రాజమండ్రి

★ ★ ★

నా అభిమాన నటుడు అఖిలాంధ్ర ప్రజలచే నవరస నటనా సార్వభౌముడు అనిపించుకున్న సత్యనారాయణ, ఆయన నటనా చాతుర్యం చూచిన ఎవరైనా ఆయన అభిమానులుగా మారుతారని ఘంటాపధంగా చెప్పవచ్చును. ఆయన ఎటువంటి పాత్రనైనా అవలీలగా పోషించి ప్రజల మన్ననలను అందుకొనగల ఏకైక వ్యక్తి. ఒక ప్రాణమిత్రుడుగా 'నా పేరే భగవాన్, నిప్పులాంటి మనిషి' (పాత) వంటి చిత్రాలలోనూ, ఒక హాస్యనటుడిగా 'పెళ్ళి చేసి చూపిస్తాం, మిష్టర్ భరత్' వంటి చిత్రాలలోనూ, ఒక గ్రామ పెద్దగా 'పల్నాటి సింహం' వంటి చిత్రాలలోను, ఒక దేశ వ్యతిరేకిగా 'జననీ జన్మభూమి' వంటి చిత్రాలలో నూ ఆయన నటన అమోఘం అద్వితీయం. నవ రసాల్లో ఏ రసంనైనా అతి సుల్పువుగా పోషించగల ఏకైక



వ్యక్తి అతడు. ఆయన ఈమధ్య మరీ హాస్య పాత్రలే పోషిస్తున్నందువల్ల అఖిలాంధ్ర ప్రజలు ఆయనలోని గాంబీర్యతను, క్రోధాన్ని, శాంతాన్ని చూడలేకపోతున్నారు కాబట్టి, ఆయన (అబిమానుల) కోర్కెను మన్నించి [illegible] ప్రదానమైన గాంబీర్య రస ప్రధానమైన చిత్రాలలో కూడ నటించాలన్నదే మా ఆకాంక్ష

కె సుబ్రహ్మణ్యం, అనకాపల్లి

★ ★ ★

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది అన్నట్టు మన యువకిశోరం నందమూరి బాలకృష్ణ వచ్చిన 3 సం.లలోనే 3 జూబ్లీలు, కలెక్షన్స్ రికార్డు, నూతన రికార్డు, ఇంకెన్నో సృష్టిస్తూనే వున్నాడు. ఇక ముందు కూడా మంచి కథనం వున్న చిత్రాలు మరియు పౌరాణిక చిత్రాలు తీసి అందులోని పాత్రలకు ప్రాణం పోసి నాటి "తారకరాముడి"లా నేటి



ఈ కృష్ణుడు తన అభిమానులను సంతోష లోకంలో ముంచెత్తాలని కోరుతూ....

– కె. హన్మంతు, వీరన్నపేట,
పాలమూరు

నేను అభిమానించే నటీ నటుల్లో "బ్యూటీ క్వీన్" "జయప్రద" ఒకరు. "సిరిసిరి మువ్వ" చూశాక నేను ఆమె అభిమాని నయ్యాను.

"బ్యూటి క్వీన్" "జయప్రద" గారి నటన అద్భుతం అతి సహజం. ముఖ్యముగా ఆమె డ్యాన్స్ (భరతనాట్యం మొదలయినవి) చేయటంలో, స్టెప్స్



వేయటంలో మిగిలిన తారలకంటె అద్భుతంగా [illegible] చేస్తారు. తెలుగు సినీ రంగంలోనే కాక ఆమె నటనా చాతుర్యంతో అతి తక్కువ కాలంలో హిందీలో కూడ బిజీతారగ అగ్రస్థానాన్ని పొందిన నటి "జయప్రద."

గతంలో ఎన్నో చిత్రాలలో వివిధ రకాల చిత్రాల్లో అత్యద్భుతంగా నటించి తనకు తానే సాటనిపించుకున్న జయప్రద యిక మీదట కూడ "సాగర సంగమం" "ముందడుగు" "సూర్యచంద్ర" సింహాసనం లాంటి మంచి చిత్రాలలో నటించాలని కోరుతున్నాను. మంచి కదాబలం గల చిత్రాలలో [illegible]లను, ప్రేక్షకులను ఆనంద[illegible]స్తున్నాను

సి కళావతి, పుంగనూరు

తెలుగు సినీ జగత్తులో మొదటి చిత్రముతోనే ఆంధ్ర ప్రేక్షకుల ఆదరాభిమానాలు నందుకొన్న నటుడు చంద్రమోహన్

నటనలో, హావభావ ప్రకటనలో, సంభాషణల



ఉచ్చారణలో తనకు తానే సాటి అని నిరూపించు కొన్న చిత్రాలు రంగులరాట్నం సిరిసిరిమువ్వ శంకరాభరణం మొ నవి

ఈ మధ్య కాలంలో ఎక్కువగా హాస్య పాత్రలు పోషిస్తూ వైవిధ్యం గల పాత్రలు దొరక్క మబ్బుల వెనక చందమామ వలె ప్రకాశించ లేక పోతున్నాడు

మంచి సెంటి మెంట్ పాత్రలు పోషించి ప్రేక్షకుల హృదయాల్లో సుస్థిర స్థానాన్ని సంపాదించగలడని ఆయన అభిమానిగా నా అభిలాష

కె విశ్వనాద్, జంధ్యాల బాపు వంటి అగ్రదర్శకులు నా అభిమాన నటుని ఎంకరేజ్ చేయాలని ఆశిస్తున్నాను

ఎ వి ఎల్ నరసింహం,
రాంధియా, బద్రక్, ఒరిస్సా

★ ★ ★

నా అభిమాన తార రాగ సుద అనురాగసుద జయసుద ఆమె నటన అంటే నాకు చాలా యిష్టం ఎందుకంటే సావిత్రి వాణిశ్రీ తర్వాత సూపర్‌స్టార్‌గా వెలిగింది జయసుద నటించే పాత్రల్లో చిలిపితనం గంబీరత, గర్వము ఉంటుంది ముఖ్యంగా జయసుద పేద అమ్మాయిగా బాగుంటుంది పాత్రకు సరిపోను వస్త్రదారణ ఉంటుంది ఇదే ఆమె ప్రత్యేకత శ్రీమంతుని కూతురుగా కూడ చాలా బాగుంటుంది నాకు సినీ పరిజ్ఞానము ఉన్నప్పటి నుంచి జయసుద నా అభిమాన తార నేను



'శివరంజని' సినీమా చూచి ఆమె అభిమానిగా మారాను నిందుదనమైన పాత్రల్లో అంటే, లెక్చరర్ పాత్రలో జయసుధను చూడాలని నా అభిలాష, సినీ రంగం నుంచి విరమించుకోవద్దని నా మనవి

ఎ సౌభాగ్య, కొల్లాపూర్ మహబూబ్‌నగర్ □

## ప్రతిష్ఠాత్మకమైన నృత్య సంగీత ప్రధాన చిత్రం ఆనంద తాండవం

జీవాత్ములైన రాధామాధవులు జీవన్ముక్తి ఎలా పొందారన్న ఆనందతాండవం శాస్త్రీయ నృత్య సంగీత ప్రధాన చిత్రాన్ని డాక్టర్ ఎ రఘురామిరెడ్డి అపూర్వంగా రూపొందించారు అనుక్షణం మానవుని నీడలా వెన్నాడే బంధాలు అనుబంధాలు మోహావేశం-వీటి నుండి విముక్తి పొందే జ్ఞానాన్ని ఏ విధంగా సముపార్జించి చైతన్య మూర్తిగా మారి సమాజానికి ఏ విధంగా ఉపకరించాలి అనే విషయమై వేదాలు ఉపనిషత్తులు కూలంకషంగా చర్చించి సారాంశాన్ని తాండవ రూపంలో నిక్షిప్తం చేయడం జరిగింది తాళపత్ర గ్రంథాలలో విపులీకరింపబడిన ఆనాటి తాండవ నృత్యాలపై కొన్ని ఏళ్లపాటు పరిశోధన జరిపి వాటిలో అతిముఖ్యమైన కొన్నింటిని మనోహరమైన ప్రణయగాథలో అంతర్భాగంగా ఇమిడ్చి ఉన్నత ప్రమాణాలతో రూపొందించాం 18 విధాల తాండవ నృత్యాలకోసం కళాకారులు సబిత వెంకటాచలపతి ఆస్ట్రేలియా నృత్య విద్యార్థి మద్రె ఏడాదిపాటు ప్రత్యేకంగా నృత్య సాధన చేశారు ఈ నృత్య చిత్రీకరణకే 30 లక్షలకు పైగా వ్యయమైంది ప్రముఖ విద్వాంసుడు సంగీత దర్శకుడు ఎల్ వైద్యనాథన్ మన సంస్కృతిని ప్రతిబింబించే రీతిలో మన సంగీత వాద్యాలతోనే శ్రవణానందకరమైన సంగీతాన్ని సమకూర్చారు గాయని సుశీల దాదాపు ఇరవై రోజులపాటు గీతాలు సాధన చేసి పాడారు ఇలా ఈ చిత్రం అందరూ గర్వించే రీతిలో కళాత్మకంగా రూపొందడానికి ప్రత్యేక శ్రద్ధతో కృషి చేశాం అన్నారు డాక్టర్ ఎ రఘురామిరెడ్డి ఈయన కథ స్క్రీన్‌ప్లే సమకూర్చి స్వయం దర్శకత్వంలో నిర్మించిన శ్రీ సత్పురుషా ఫిలిమ్స్ ఆనంద తాండవం చిత్రంలో దీప మోహన్ సత్యనారాయణ జె వి సోమయాజులు లక్ష్మి సబితా సుబ్రహ్మణ్యం వెంకటాచలపతి మద్రె ఉమామహేశ్వరి పాల్గొన్నారు దర్శకునితో పాటు వి కె ఈశ్వర్ మాటలు పాటలు రాశారు ఆరుద్ర మరో గీతం రాశారు ఎల్ వైద్యనాథన్ సంగీతం మధు అంబట్ ఛాయ కళాధర్ శిల్పం అడయార్ కె లక్ష్మణన్ నృత్య దర్శకత్వం కరుణానిధి కూర్పు తెర వెనుక హంగులు

# సినిమా విశేషాలు

-జివిజి

## సురేష్ చిత్రంలో గురుబ్రహ్మ గా ఎ ఎన్ ఆర్

మాతా పితా గురు దైవం అన్నారు జననీ జనకుల తర్వాత పవిత్రమైన స్థానం గురువుది తన విద్యార్థులనే హరించే గతి ఏ గురువుకూ రాకూడదు కాని ఒక వేళ వస్తే పరుచూరి సోదరుల ప్రతిభకు మరో నిదర్శనమైన రచనతో నాగేశ్వరరావుగారు నటనా సామర్థ్యానికి మరో మచ్చుతునకగా జులైలో ప్రారంభించే ఈ చిత్రంలో దగ్గుబాటి రాజా అనే మరో యంగ్ హీరోని పరిచయం చేస్తున్నాం అన్నారు డి రామానాయుడు ఈయన నిర్మించే సురేష్ ప్రొడక్షన్స్ వారి ఈ చిత్రానికి రఘు ఛాయ జి వి సుబ్బారావు శిల్పం మార్తాండ్ కూర్పుతో బోయిన సుబ్బారావు దర్శకుడు

## బి విఠలాచార్య దర్శకత్వంలో మోహన్‌బాబు చిత్రం

విఠలాచార్యగారు రసవత్తరమైన కథ సమకూర్చి మా శ్రీ లక్ష్మీ ప్రసన్న పిక్చర్స్ 7వ చిత్రానికి దర్శకత్వం వహించడానికి నా మీద వాత్సల్యంతో అంగీకరించినందుకు ఎంతైనా కృతజ్ఞుడ్ని అన్నారు మోహన్‌బాబు ఈయన నటించే తొలి జానపద చిత్రంలో మాధవి సత్యనారాయణ గుమ్మడి వేలు కోట శ్రీనివాసరావు అనూరాధ అన్నపూర్ణ ఆదిగాగల వారు పాల్గొంటారు షూటింగ్ జూలైలో ప్రారంభమై సెప్టెంబర్‌లో ముగుస్తుంది








[illegible]
చంద్రిక, నరేష్



'మన్నెంలో మొనగాడు'లో అర్జున్, [illegible]

## కె. ఎస్. ఆర్. దాస్. దర్శకత్వంలో రెండు చిత్రాలు

కృష్ణ, అర్జున్‌లు నటించే రెండు చిత్రాలను డైరెక్ట్ చేయబోతున్నట్లు కె. ఎస్. ఆర్. దాస్ తెలిపారు.

అర్జున్ హీరోగా దాస్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహిస్తూ సమర్పించే సుకుమార్ ఆర్ట్ పిక్చర్స్ "కౌబాయ్ నెంబర్-1" సినిమాస్కోప్ చిత్రం షూటింగ్ జూన్ 2-7, జూలై 1-15, ఆగస్టు 21-30, సెప్టెంబర్ 21-30 షెడ్యూల్స్‌తో పూర్తవుతుంది. రజని, అనూరాధ, జయమాలిని, బబిత, విజయకుమార్, రాజ్‌కుమార్, కోట శ్రీనివాసరావు, భీమరాజు నటిస్తారు. చక్రవర్తి సంగీతం, లక్ష్మణ్ ఛాయ, సి.ప్రకాడు మాటలు, రాజశ్రీ పాటలు, కృష్ణ శిల్పం, హార్స్‌మన్ బాబు సాహసాలు, రంగారావు సంయుక్త దర్శకత్వం, ప్రకాష్-సురేఖ నృత్యాలు, ఆది ప్రొడక్షన్స్, వి. వెంకటరత్నం కూర్పు వగైరా సాంకేతిక వర్గం. "గెస్ట్‌లుగా సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు నటిస్తారు. పూర్తిగా తలకోన, పుత్తూరు, పాండిచ్చేరి, రాయచూరుకు 300 కిలోమీటర్ల దూరంలో ఉన్న దూదామిల్ల ప్రాంతంలో ఎక్కువగా అవుట్‌డోర్‌లో, కొంపల్లో షూటింగ్ ప్లాన్ చేశాం," అన్నారు ఈ చిత్రాన్ని నిర్మించే కె. సుకుమార్.

నవంబరులో ప్రారంభమై, [illegible]లో పూర్తయ్యే [illegible] అర్జున్ మూడవ చిత్రాన్ని కృష్ణ, విజయశాంతి జంటతో [illegible] నిర్మిస్తారు. పరుచూరి సోదరులు స్క్రిప్టు తయారు చేస్తున్నారు.




మాది 'హారర్' చిత్రం కాదు- అయినా నాకు అప్పులిచ్చిన వాళ్ళు దాన్ని చూసి గావు కేకలు పెట్టారు- ఎందుకో అర్థం కావటంలే!

## "సక్కనోడు" మూడో షెడ్యూల్

"ఏప్రిల్, మే నెలల్లో రెండు షెడ్యూల్స్ పూర్తయ్యాయి. చివరి షెడ్యూల్ జూన్‌లో," అన్నారు బి. భాస్కరరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కందేపి సత్యనారాయణ నిర్మించే రాఘవేంద్ర సినీ క్రియేషన్స్ వారి ఈ చిత్రంలో శోభన్‌బాబు, విజయశాంతి, గొల్లపూడి, గిరిబాబు, రాళ్లపల్లి, అన్నపూర్ణ, ఎస్. వరలక్ష్మి, శ్రీలక్ష్మి పాత్రధారులు. గొల్లపూడి, రాజశ్రీ, కె. వి. మహదేవన్, పి. సురేష్, కళాధర్, జి.వి. రెడ్డి, కె. సత్యం, కె. విజయసారథి, గాది సత్యం, వేణు తెరవెనుక కృషి చేస్తున్నారు.

## సి.హెచ్. నరసింహారావు చిత్రంలో సుమన్, రజని

"మే 7 నుంచి 12, మే 23 నుంచి 30 వరకు రెండు షెడ్యూల్స్ పూర్తి చేశాం. మూడవ షెడ్యూల్ జూన్ 10 నుంచి 20 వరకు. జూలైలో పాచ్‌వర్క్," అన్నారు పద్మజ పిక్చర్స్ అధినేత సి.హెచ్. నరసింహారావు. ఈయన ఐదవ చిత్రంలో సుమన్, రజని, గొల్లపూడి మారుతీరావు, నూతన్‌ప్రసాద్, రాజేష్, వేలు, బెనర్జీ, పొట్టిప్రసాద్, వై. విజయ, కొందరు నవ నటీనటులు పాల్గొంటున్నారు. సాయినాథ్ మాటలు, సీతారామశాస్త్రి పాటలు, రాజ్-కోటి సంగీతం, దివాకర్ ఛాయ, బండారు సూర్యకుమార్ శిల్పం, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, తరణి సంయుక్త దర్శకత్వం. రాజా ప్రొడక్షన్స్‌తో నందకుమార్ దర్శకుడు.



ప్రముఖ నిర్మాత శ్రీ ఎ వి ఎస రాజు పుత్రుడు వి ఎ కె రాజుకు ఎ సా ... లతో ... మద్రాసులో వైభవోపేతంగా వివాహ మహోత్సవం జరిగినప్పుడు శుభాశీస్సు లందజేస్తున్న ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు ప్రభృతులు

# సినిమా

## ఓ స్వాతి తీర్పు లో పొరుగింటి సాధ్వి

సాయంకాలం స్వాతి (సుహాసిని) పిల్లలకు పాఠాలు చెప్పి పంపించింది వాళ్ల కుటుంబానికి అన్నివేళలా తోడునీడలా ఉంటారు పొరుగింటి రిక్షా మూర్తి అతని భార్య

మూర్తి దంపతులు స్వాతి దగ్గరికి వచ్చారు స్వాతమ్మా పిల్లలకు పాఠాలు చెప్పేటప్పుడు దీన్ని పక్కన పెట్టుకోకండి ఇంగ్లీషు తెలిసి తెలియకుండా నేర్చుకుని నా దగ్గర మాట్లాడేస్తుంది కుళాయి దగ్గర దీనికెందుకమ్మా ఇంగ్లీషులో మాట్లాడటం' దీని ఇంగ్లీషుబాధ పడలేక ఆడాళ్లందరూ నాతో దెబ్బలాటకు వచ్చేస్తున్నారు అంటూ మూర్తి భార్య వంక తిరిగి ఏయ్ బాస ఎహు రేగిందంటే పంబ రేగిపోద్ది జాగ్రత్త! అన్నాడు

టీచరమ్మా! యూ డోంట్ వర్రీ అంతా నే చూసుకుంటాను నువ్వు పద మ్యాన్ అంది మూర్తి భార్య

అవ్వ అవ్వ! ఇప్పుడే కదనే నా దగ్గర ఇంగ్లీషు మాట్లాడొద్దన్నాను' అంటున్న మూర్తి చెయ్యి పట్టుకుని

షటప్! నువ్ రా మేన్! అంటూ లాక్కెళ్లింది భార్య

గిల్లికజ్జాలతో పరస్పరం అర్థం చేసుకుని సుఖంగా జీవయాత్ర సాగిస్తున్న ఆ దంపతుల వంకే రెప్పలార్పకుండా చూస్తుండిపోయింది స్వాతి

రాజ్‌భరత్ దర్శకత్వంలో డి ఎ అగర్వాల్ సమర్పించే వెంకటాచల ఎలిమ్స్‌వారి ఓ స్వాతి తీర్పు చిత్రానికి ఎ సత్యనారాయణగౌడ నిర్మాత

## ఎ వి ఎం "చిన్నారి దేవత"

ఒక చిన్నారి పాపకు ఒక ఇన్‌స్పెక్టర్‌కు మధ్య జరిగే సంఘర్షణ ఆ పాపకు నేస్తంగా ఉండే కోతితో చిత్ర విచిత్రంగా అల్లబడిన కథ యాక్షన్ పుష్కలంగా ఉంటుంది అన్నారు ఎ వి ఎం వారి పై చిత్రానికి తొలిసారిగా దర్శకత్వం వహిస్తున్న రాజానాయుడు ఈయన ఇది వరకు రాజశేఖర్ బాలు ప్రభృత డైరెక్టర్ల వద్ద 40 చిత్రాలకు పైగా సహకార దర్శకునిగా అనుభవం గడించారు మే 2 నుంచి 6 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది జూన్ 15 నుంచి జులై 15 వరకు జరిగే తదుపరి షెడ్యూల్‌తో షూటింగ్ ముగుస్తుంది అర్జున్ సత శరత్‌బాబు రాజ్యలక్ష్మి రాళ్ళపల్లి సెందామరై ఓవా బేబీ షాలిని పాల్గొంటున్నారు శివచంద్రన్ కథ వి సి గుహనాదన్ స్క్రీన్‌ప్లే సత్యానంద్ మాటలు వేటూరి పాటలు చక్రవర్తి సంగీతం విశ్వం నటరాజ్ ఛాయ నాగరాజారావు శిల్పం జూడో రత్నం సాహసాలు ఆర్ విఠల్ కూర్పుతో ఎం శరవణన్ ఎం బాలసుబ్రహ్మణ్యన్ ఎం ఎస గుహన్ నిర్మాతలు

## "నటరత్న"లో భారతి, ఆర్ డి బర్మన్

నందమూరి బాలకృష్ణ మిమిక్రీ ఆర్టిస్ట్‌గా జంధ్యాల రచన దర్శకత్వంలో విజయా కమర్షియల్స్ జి సుబ్బారావు నిర్మించే నటరత్న చిత్రంలో ఆర్ డి బర్మన్ సంగీతం అదనపు ఆకర్షణ చాలా కాలం తర్వాత భారతి ఈ తెలుగు చిత్రంలో నటిస్తుంది రాజేంద్రప్రసాద్ సరసన ఒక అమెరికన్ యువతి పాల్గొంటుంది శరత్‌బాబు వీరభద్రరావు ఎ ఎల్ నారాయణ రమాప్రభ శ్రీలక్ష్మి ఇతర పాత్రదారులు భమిడిపాటి కథకుడు ఎస్ గోపాలరెడ్డి ఛాయ శాస్త్రి సహకార దర్శకత్వం యు వి పాణి సంయుక్త దర్శకత్వం గౌతంరాజు కూర్పు యోగానంద్ నిర్వహణ వగైరా సాంకేతిక వర్గం ఈ చిత్రం షూటింగ్ అమెరికాలో జరుగుతుంది

## చిత్రీకరణ ముగిసిన చైతన్యం

రచయిత జి సత్యమూర్తి ఒక డైనమిక్ సబ్జెక్ట్‌కు తొలిసారిగా దర్శకత్వం వహిస్తున్నారు కామిని ప్రొడక్షన్స్ వారి చైతన్యం చిత్రంతో ఈయన డైనమిక్ డైరెక్టర్ల జాబితాలో చేరిపోతారని రషెస్ చూసిన వారి అభిప్రాయం మద్యపాన నిషేధాన్ని ప్రబోధించే ఈ చిత్రంలో లాయర్‌గా జయసుధ ఆమె భర్త డాక్టర్‌గా చంద్రమోహన్ సంఘ సంస్కర్తగా భానుచందర్ ఇతర పాత్రలలో సాగరిక జె వి సోమయాజులు కోట శ్రీనివాసరావు సాక్షి రంగారావు వేలు వీరభద్రరావు రాళ్ళపల్లి



"జీవనరాగం"లో జయసుధ

భాస్కరబాబు, దీక్షితులు, రజనీష్, వై. విజయ, దీప, ప్రత్యేక పాత్రలలో కె. ఆర్. విజయ, సంగీత దర్శకుడు చక్రవర్తి నటించారు. లోక్‌సింగ్ ఛాయ, బాలు శిల్పం రాజు సాహసాలు శివ సుబ్రహ్మణ్యం నృత్యాలు ఎల్ వెంకటరాజు - రామసత్యం ప్రొడక్షన్ సత్యానంద్- శివ సత్యనారాయణ సహకార దర్శకత్వం ఎన్ ప్రసాదనాయుడు - ఎ సి నరసింహారెడ్డి సహాయ దర్శకత్వం ఎ నాగరాజు సంయుక్త దర్శకత్వంతో కామిని రాము కామిని లక్ష్మి కాంతారావు సహ నిర్మాతలు కామిని వెంకటేశ్వరరావు నిర్మాత □

# పాఠకులకి సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు!



తెలుగు సినీ ప్రేక్షకుల అభిమానాన్ని విశేషంగా చూరగొని 1985 వ సంవత్సరానికి ఉత్తమనటిగా ఎన్నికైన సుప్రసిద్ధ నటీమణి విజయశాంతి ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలకి సమాధానాలు ఇస్తారని తెలియ చేయటానికి సంతోషిస్తున్నాము త్వరలో ప్రారంభించే ఈ శీర్షికకి తమ ప్రశ్నలని పంపవలసిందిగా పాఠకులని కోరుతున్నాము వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో విజయశాంతి ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నకు ప్రతివారం ఆమె ఆటోగ్రాఫ్ ఉన్న కలర్ ఫోటో బహుమతిగా లభిస్తుంది

(ఈ శీర్షికకి ప్రశ్నలని పంపే వారు క్రింద ఇచ్చిన కూపన్ పూర్తి చేసి విజయశాంతి సమాధానాలు ఆంధ్రసచిత్రవారపత్రిక గాంధినగరం విజయవాడ-520003 అన్న చిరునామాకు పంపాలి
ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాసి పంపాలి విడిగా రాసిన వాటిని పరిశీలించటం జరగదు
పాఠకులు ఉత్సాహంతో ఈ అవకాశాన్ని ఉపయోగించుకోగలరని ఆశిస్తున్నాము - ఎం)

— కూపన్ —

ఆంధ్రసచిత్ర వారపత్రిక

## విజయశాంతి సమాధానాలు

ప్రశ్న ______________________________

______________________________

______________________________

పంపిన వారి పేరు ______________________ Saraswata Niketanam

పూర్తి చిరునామా ______________________ vetapalem

______________________________

______________________________

# కెమెరా కవి, దర్శక నిర్మాత ఏ. ఎస్. ఆర్. స్వామి

సినిమాలో ఒక్కొచోట శబ్దం లేకపోవచ్చు. మాటలు లేకపోవచ్చు. నటీనటులు లేకపోవచ్చు. ఎవరున్నా ఏదిలేకపోయినా – పనిచెయ్యవలసింది కెమెరా అదిలేకపోతే చలన చిత్రమే లేదు

మనకు రెండు కళ్ళు ఉండటం మూలంగా వస్తువుల మధ్య దూరం చూడగలుగుతున్నాం కాని కెమెరాకు ఉన్నది ఒకే కన్ను ఆ ఒక్క కంటితోనే నిండుతనం భ్రాంతిని కలిగించే ప్రతిభ ఛాయాగ్రాహకునిదే అంతే కాదు రచయిత కాగితం మీద ఉంచిన విషయాన్ని దర్శకుని మస్తిష్కంలో ఉన్న ఊహను తెరమీద చెప్పేది చాయాగ్రాహకుడే

తొలి తెలుగు సినిమా స్కోప్ చిత్రం అల్లూరి సీతారామరాజు 70 ఎం ఎం చిత్రం సింహాసనం ఛాయాగ్రాహకుడుగా తొలి బెంగాలీ 3-డి చిత్రం మహారుద్ర కు చాయాగ్రాహకుడుగా – దర్శకుడుగా తన సామర్థ్యాన్ని నిరూపించిన ఏ ఎస్ ఆర్ స్వామి చిత్ర నిర్మాత కూడా

చాయాగ్రాహకుడే దర్శకుడైనప్పుడు కలిగే ప్రత్యేక ప్రయోజనాలేమైనా ఉన్నాయా?

ఈ విషయమే ఆయన్ని అడిగాను

చాయాగ్రహణం దర్శకత్వం విడివిడిగా రెండు ధ్రువాల్లాంటివి కాని రెండూ కలిసి ఒకే వ్యక్తిలో సమన్వయమైనప్పుడు ఒకటి గంగ మరొకటి జమున చాయాగ్రహణం బావం దర్శకత్వం బాష బావానికి భాష తోడైనప్పుడు కలిగే స్పందనం లాంటిదే అది దర్శకుడే చాయాగ్రాహకుడు అయిననాడు అతని ఊహలకు అతనే స్వయంగా రూపం ఏర్పర చగలడు కె రామ్‌నాద్ బిమల్‌రాయ్ నితిన్ బోస్ పాలిమిస్త్రి, బాలు మహేంద్ర జాక్ కార్డిఫ్ అస్వాల్డ్ మారిస్ లాంటి ప్రముఖ దర్శకు లందరూ ఛాయాగ్రాహకులే ఫలానా సంఘటన ద్వారా ప్రేక్షకులకు ఏం చెబుతున్నాం అనే దర్శకుడి కేంద్ర స్థానాన్ని ఛాయాగ్రాహకుడు అందు కున్నప్పుడు ప్రయోజనం రెట్టింపు అవుతుంది అన్నారు స్వామి

ఈయన జననం 1939 జులై 15 న స్వస్థలం గుడివాడలో బి ఎ వరకు చదువుకున్నారు

ఇప్పుడు రమణవాణి పత్రికను వెలువరిస్తున్న



ఎం ఆర్ నాగేశ్వరరావుగారు ఆ రోజుల్లో మా ఊళ్లో ఎంత చక్కగా పురాణగాథలు చెప్పేవారంటే – వారు చెప్పేది ప్రతిది కళ్ళకు కట్టినట్లుండేది ఇప్పటి నా సాంగ్స్ పిక్చరైజేషన్‌కు ఇన్స్పిరేషన్‌వారే ఆ తర్వాత వారు స్వర్గీయ గోపీచంద్‌గారి వద్ద సహాయ దర్శకుడుగా పనిచేశారు వారి ద్వారా గోపీచంద్‌గారి ప్రోత్సాహంతో మద్రాసు చేరుకున్నాను అన్నారు స్వామి

ఈయన అత్యాధునిక బవంతిలోని హాలులో గోపీచంద్‌గారి నిలువెత్తు పోటో తోపాటు కె శే గురుదత్ పోటోకూడా ఉంది

గురుదత్ పోటో వంక నేను తదేకంగా చూస్తుండగా స్వామి అన్నారిలా; గోపీచంద్‌గారు నన్నొకసారి బొంబాయి వెళ్ళి అక్కడ చిత్ర నిర్మాణం వగైరాలు ఎలా ఉంటాయో పరిశీలించి రమ్మన్నారు గురుదత్‌గారు ప్యాసా తీస్తున్న రోజుల్లో కొంత కాలంపాటు నేనక్కడే ఉన్నాను ఆయన గొప్ప నటుడు దర్శకుడు నిర్మాతే కాక మహామనిషి కూడాను ఎన్నో విషయాలు తెలుసుకోగలిగాను అక్కడ్నుంచి తిరిగొచ్చాక రాజరాజేశ్వరి ఎలిమ్ కంపెనీలో అసిస్టెంట్‌గా చేరాను

అప్పుడా సంస్థ "ధర్మవిజయం" చిత్రం తయారు చేస్తోంది. ఛాయాగ్రాహకుడు లక్ష్మణ్‌గోరే వద్ద స్వామి ఎన్నో మెళకువలు తెలుసుకున్నారు పుణె ఎలిమ్ ఇన్స్టిట్యూట్ రిప్రెషింగ్ కోర్స్‌కు ఎన్నుకోబడ్డ మొదటి జట్టులో స్వామి ఒకరు అక్కడ మోషన్ ఎక్చర్ పోటోగ్రఫీలో సర్టిఫికేట్ పొందాక మద్రాసుకు తిరిగొచ్చి రాజలక్ష్మి సంస్థలో చేరారు కె శే సి నాగేశ్వరరావు రవికాంత్ నగాయిచ్‌ల వద్ద సహాయ చాయా గ్రాహకుడుగా పలు చిత్రాలకు పనిచేశారు వీరాబిమన్యు చిత్రానికి ఆపరేటివ్ కెమెరామన్ అయ్యారు

ఈయన చాయా గ్రాహకుడుగా పనిచేసిన తొలి చిత్రం టైగర్ ప్రొడక్షన్స్ అసాధ్యుడు

ఈయన నిర్మించిన తొలిచిత్రం ఎదురీత లో ఎన్ టి ఆర్ హీరో రెండో చిత్రం కలియుగ సీత లో జయసుధ హీరోయిన్ మూడవ చిత్రం ఆపద్బాంధవులు

కృష్ణ హీరోగా స్వీయ దర్శకత్వంలో మండే సూర్యుడు అనే చిత్ర నిర్మాణానికి సన్నాహాలు చేస్తున్నారు ఉషాకిరణ్ మూవీస్ ఉషోదయా మూవీస్ సంస్థలకు జగన్మోహన్ వాందిలో నిర్మించే చిత్రానికి దర్శకత్వం వహించనున్నారు

చాయాగ్రహణానికి ప్రాథమిక సూత్రాలు ఒక్కటే అయినా – ఒక్కొక్కరు ఒక్కో విధానంలో నిష్ణాతులు విధానం ఎలాంటిదైనా పలితం మాత్రం అద్భుతంగా ఉంటుంది కొందరు సజీవ శిల్పంలా చిత్రీకరిస్తే మరి కొందరు పాత్రదారుల బావాలకు – దృశ్య బావాలకు ప్రాముఖ్యత ఇచ్చి తదను గుణంగా చిత్రీకరిస్తారు కొందరు లో – కె పోటో గ్రఫీలో సిద్ధహస్తులు మొత్తంమీద మన చాయా గ్రాహకులు విదేశీ చాయాగ్రాహకులకు ఏమాత్రం తీసిపోరు మనకున్న కొద్ది సౌకర్యాలతోనే మనం విదేశ చిత్రాల స్థాయిలో చాయాగ్రహణాన్ని రూపొందించ గల్గుతున్నాం అనే ఏ ఎస్ ఆర్ స్వామి ఇంతవరకు తెలుగు తమిళ కన్నడ వాంది బెంగాలీ బాషల్లో మొత్తం 126 చిత్రాలకు పని చేశారు

—జి ఏ జి

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor S Radhakrishna, Phones - Business 61247, 61248, Editorial 75667*

# హాలిడేస్... (జాలిడేస్)

[redacted]

పద్మ


















### తెలుగు బాల మహిళా ప్రగతి ప్రాంగణం -

వివిధ వృత్తులలో బాల బాలికలకు మహిళలకు శిక్షణ ఇవ్వడానికి రాష్ట్రప్రభుత్వం కొత్త పథకం రూపొందించింది ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు మే ఎనిమిదవ తేదిన పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ ఈ పథకం వివరించారు ప్రతి జిల్లాలోను ఒక శిక్షణ కేంద్రం నెలకొల్పుతామని ఇది బాలబాలికలకు మహిళలకు వివిధ వృత్తులలో కుట్టు పని అప్పడాలు చేయడం ఊరగాయలు పెట్టడం తోట పని టైప్‌రైటింగ్ ఎలెక్ట్రానిక్స్ మున్నగు వృత్తులలో శిక్షణ ఇస్తుందని వీటివల్ల మహిళలు అదనంగా కొంత సంపాదించి కుటుంబ పోషణ చేసుకోవచ్చునని బాలబాలికలు చదువుతో పాటే ఇలాటి వృత్తుల వల్ల మున్ముందు జీవితంలో స్థిరపడవచ్చునని తెలిపారు ఢిల్లీలో జరిగిన నేషనల్ డెవలప్‌మెంట్ కౌన్సిల్ సమావేశం వివరాలు ప్రస్తావించి విద్యను రాష్ట్ర విషయంగా చేయాలని తాను పునరుద్ఘాటించానని అన్నారు ఆంధ్రప్రదేశ్ విద్యా సంస్కరణల విషయంలో తక్కిన రాష్ట్రాలకన్నా అగ్రగామి అని అభ్యుదయ పథకాల అమలుకు ఎక్కువ ధనం కేటాయించాలని తాను కోరానని అన్నారు విద్యా ప్రణాళికలో పాఠ్య క్రమ నిర్ణయంలో రాష్ట్రాలకు స్వాతంత్ర్యం వుండాలని తాను నొక్కి చెప్పానని అన్నారు

### మళ్లీ ఆరు రోజుల వారం -

ముఖ్యమంత్రి శ్రీ రామారావు మే 7వ తేదిన పత్రికాప్రతినిధులతో ముచ్చటిస్తూ ప్రభుత్వ కార్యాలయాలకు మళ్లీ ఆరు రోజుల వారం ఏర్పాటు చేసే విషయమై ఆలోచిస్తున్నామని ఈ విషయాన్ని పరిశీలించవలసిందిగా ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిని కోరానని అన్నారు రాష్ట్రప్రభుత్వ కార్యాలయాల పని దినాలు ఇలా ఐదుకు ఆరుకు రెండు సార్లు మారాయి ఈ సందర్భంగా నాకు నా చిన్ననాటి సంఘటన ఒకటి జ్ఞాపకం వస్తుంది నా చిన్ననాడు అరవైయయిదేళ్ల క్రిందట బళ్లారి జిల్లా బోర్డులో తెలుగు కన్నడ వర్గాల పోటి తీవ్రంగా వుండేది కన్నడ వర్గం వ్యక్తి జిల్లా బోర్డు అధ్యక్షుడు అయినప్పుడు జిల్లా బోర్డు పాఠశాలలన్నిటిలోను కన్నడంలోనే మొదటి తరగతి నుంచి పాఠ ప్రవచనాలు జరగాలని ఉత్తరువు జారి చేసేవాడు తెలుగు వర్గం వ్యక్తి అధ్యక్షుడయినప్పుడు తెలుగులో జరగాలని ఉత్తరువులు చేసేవాడు పాఠశాల వేళలు సెలవులు కూడ మార్చేవారు ఒకరు ఉదయం 7 గంటల నుంచి పదిగంటలు రెండు నుంచి ఐదు గంటలు అని మార్చితే రెండోవారు 10 నుంచి ఐదు వరకు అని నిర్ణయించేవారు సెలవు విషయంలోను ఇదే తంతు లింగాయతులు అధ్యక్షులైతే వీర శైవోత్సవాలకు బడి మూయించేవారు తదితర మతస్థులు బాషలవారు అయితే ఆ సెలవులను రద్దు చేసేవారు ఇలా విద్యార్థులు ఉపాధ్యాయులు వివిధానుభవాలు

## హైదరాబాద్ నోట్‌బుక్

పొందేవారు నిజానికి ఐదునాళ్ల పనివారం విదేశాలలో ప్రయోజనకరం అక్కడివారు పనిచేయడంలో చిత్తశుద్ధి సద్బుద్ధి గలవారు గనుక కర్తవ్యనిష్ఠులై పనిగంటలు పూర్తిగా పనిచేయడం రెండునాళ్ల సెలవులను సద్వినియోగం చేసుకోవడం జరుగుతుంది మన దేశంలో నన్ను కొప్పడకండి ప్రభుత్వ కార్యాలయాలకు రావడం ఆలస్యం వచ్చిన తర్వాత తేనీటి పానానికి కొంత పన్నెండుగంటలకు కొంత భోజనానికి కొంత మరి మూడు గంటలకు తేనీటి పానానికి కొంత ఇలా ఎంతో సమయం వృధా అవుతుంది దానికితోడు మనదేశంలో వున్నన్ని సెలవులు మరే దేశంలోను లేవు మతాల సెలవులు రాజకీయాల సెలవులు ఆకస్మిక సెలవులు సమ్మెలు ఇలా ఎంతో సమయం వృధా కావడం వల్ల ఒక ఫైలు ప్రక్క బల్లకు తరలి వెళ్లడానికి వారాలు పడుతుంది మతాల వుత్సవాలకు సెలవు లెందుకు? మనం రామనవమి కృష్ణాష్టమి వంటి ఉత్సవాలలో పూజలు చేసుకుంటాము వానికి ప్రత్యేకంగా సెలవు అవసరంలేదు అలాగే రమ్‌జాన్ మహావీర బుద్ధ జయంతులు మొదలైనవి ఆయా మహాపురుషుల పట్ల గౌరవంతో పూజలు విందులు చేసుకొని హాయిగా కార్యాలయాలకు రావచ్చు వారానికి ఒక రోజు సెలవు ఎలాగూ వుంది ప్రివిలేజ్ లీవు మెడికల్ లీవు క్యాజువల్ లీవులు వున్నాయి ఇన్ని వున్నప్పుడు పండుగల సెలవులు రద్దు చేయడం ఉచితం మనది సెక్యులర్ రాజ్యమంటున్నాము కనుక మతాల సెలవులేవద్దు ఇన్ని సెలవులు వున్నప్పుడు రాజకీయమైన సెలవులూ వద్దు మతం ప్రధానమంటారా ముస్లిం క్రైస్తవ దేశాలలో లాగ, మెజారిటీ మతోత్సవాల సెలవులు చాలు ఇతర దేశాలలో ముఖ్యంగా మధ్య ఆసియా ఆఫ్రికా దేశాలలో మన మతాన్ని బహిరంగంగా అనుసరించడానికి అనుమతి లేనప్పుడు మన కట్టు మన బొట్టు నిషిద్ధమయినప్పుడు మన భగవత్ స్తోత్రాల పఠనం దండనార్హమయినప్పుడు మనను ధనాశతో వచ్చిన కూలీలుగా చూస్తున్నప్పుడు ఇతర మతాల వారికి మనదేశంలో అంత స్వాతంత్ర్యం అంత సౌకర్యం ఏమిటి? మనదేశంలో ఇన్ని మసీదులు ఇన్ని చర్చిలు వుంటూ ఇతర మతాలవారు మెజారిటీ మతం వారి సహన భావ బలంతో ఎంతో స్వేచ్ఛగా వుంటున్నారు గదా మధ్యప్రాచ్య దేశాలలో ఒక హిందూ దేవాలయం వుందా? కట్టడానికి అనుమతి వుందా? ఆఫ్ఘనిస్తాన్‌లో ప్రాచీన శిధిలాలు వంటివి వుండవచ్చు అవి వారు చారిత్రకంగా గొప్పలు చెప్పుకోవడానికి పనికివస్తాయి విదేశాలలో మన దేశీయుల మత స్వాతంత్ర్యాన్ని గురించి మన నాయకులు గాని ప్రభుత్వంవారు గాని పట్టించుకోరు ఎందుకు? తమకు వోట్లు రావేమోనని భయం అలాటివారు ఒక్క విషయం గుర్తుంచుకోవాలి మనదేశంలోని ఇతర మతస్థులు మెజారిటీ మతంవారికి ఎప్పుడూ వోట్లు వేయరు ఇది మొన్నటి హైదరాబాద్ కార్పొరేషన్ ఎన్నికలలో రుజువైంది అంతేకాదు మనలోని కులాలను చీల్చి తమ అధికారం నిలబెట్టుకుంటారు ఈలాటి దుస్థితిని నివారించాలంటే ప్రభుత్వ కార్యాలయాలకు ఆరునాళ్ల వారం ఏర్పాటు చేయాలి తక్కిన సెలవులు బోలెడు వున్నాయి గనుక మతపరమైన సెలవులను రద్దు చేయాలి పూజలు ఉదయం ఉత్సవాలు సాయంకాలం కార్యాలయాల పని ముగిసిన పిదప తీరికగా చేసుకోవచ్చు

### సంజీవయ్య వర్ధంతి -

కాంగ్రెస్ మాజీ అధ్యక్షుడు రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య 14వ వర్ధంతి మే ఎడవ తేదిన పాటిగడ్డలో ప్రశాంతంగా జరిగింది ముఖ్య అతిథిగా వచ్చిన హైదరాబాద్ మేయర్ శ్రీ కె ప్రకాశరావు సంజీవయ్య విగ్రహాన్ని పూలదండలతో అలంకరించారు వివిధ మతాల విద్వాంసులు వేదం బైబిలు ఖురాను జెండ్అవెస్థా ప్రార్థనలు జరిపారు శ్రీమతి ఛాయాదేవి భజనలు పాడారు హైదరాబాద్ సంగీత కళాశాల విద్యార్థినులు కీర్తనలు పాడారు రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ పున్నయ్య రాష్ట్రప్రభుత్వం ప్రిన్సిపల్ సెక్రటరి శ్రీ కె ఎస్ ఆర్ మూర్తి హైదరాబాద్ కార్పొరేషన్ డిప్యూటీ మేయర్ శ్రీ ఎం కె మోబిన్ శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య మాజీ మంత్రులు శ్రీయుతులు దామోదరం మునుస్వామి జి వెంకటస్వామి హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ కాంగ్రెస్ పార్టీ నాయకుడు శ్రీ ఎస్ గోపాల్ మున్నగువారు శ్రీ సంజీవయ్య సౌజన్యాది గుణాలను ప్రశంసించారు,

### ఉపశ్రుతి -

బెజవాడ నుంచి అవనిగడ్డకు వెళ్లే బస్సులో ఎక్కాను మే 14 ఉదయం కండక్టర్ కడు మర్యాదగా అమ్మా టిక్కెట్టు తీసుకోండి అయ్యా టికెట్టు కొన్నారా? బాబూ ఇలా కూర్చో అని అంటుంటే ఆశ్చర్యపోయి కండక్టర్‌గారూ ఇది ఆర్ టి సి వారి మర్యాదా వారోత్సవమా? అనడిగాను కాదే? ఎందుకు? అనడిగాడు కండక్టర్ మీ మర్యాద చూచి అన్నాను మేము ఎప్పుడూ అలాగే మాట్లాడతామండి అంటూ ఇంతకూ మనది ఏ వూరు? అనడిగాడు హైదరాబాద్ అన్నాను అది సంగతి అలా చెప్పండి అని తన పనిలో మునిగిపోయాడు

—తిరుమల రామచంద్ర



"నాకు తెలుసు... చిన్న-చిన్న పళ్ల రాక్షసులు నా పళ్లలో కన్నాలు చేస్తాయి.

ఎందుకంటే, మా అమ్మ నాకు విడమర్చి చెప్పిందిగా! అవి నిజంగా 'బ్యాక్టీరియా' అట, అవి నోట్లో మిగిలిపోయిన అన్నం ముక్కలతో కలిసి 'ఆమ్లాల'ను వూరించి 'పంటి ఎనామిల్'పై దాడి చేసి కన్నాలు అంటే 'పుప్పిపళ్లు' చేస్తాయి.



కాని నా పళ్లు పాడవవని నాకు తెలుసు. ఎందుకంటే నా దగ్గర వుందిగా

# నా సూపర్ ఫైటర్!

## ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్... దీని సహాయంతో పుప్పిపళ్లతో పోరాడ్తా. గెలిచేస్తా!






నా సూపర్ ఫైటర్‌లోని ఫ్లోరైడ్ నా 'పంటి ఎనామిల్'ను గట్టి చేసి, నొప్పి కల్గించే పుప్పిపళ్లు కాకుండా చేస్తుంది.

మా అమ్మ ఎంత మంచిదో. రుచికరమైన, నురుగునిచ్చే నా సూపర్ ఫైటర్ గురించి నాకంతా నేర్పింది."




ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్
పుప్పిపళ్లను ఎదుర్కొనే సూపర్ ఫైటర్!

428-GM-244 TEL

# పునర్జన్మ

— మంగళపల్లి రవీంద్ర కుమార్

ఇది కలా!! నిజమా!! అని ఆశ్చర్య పడ్డాడు మదు కళ్ళ ముందు కనబడుతున్న దృశ్యం చూస్తూ తన కళ్ళను తానే నమ్మలేకపోతున్నాడు కళ్ళు నలుపుకొని మరి చూశాడు ఖచ్చితంగా ఇది కళ్ళ కట్టినట్టు కనబడుతున్న వాస్తవమే ఇంతకీ ఆ దృశ్యంలో కనిపిస్తున్నది ఎవరో కాదు మదు బార్య సుజిత అత్తగారి పాదాలు వత్తుతూ కనిపించింది అత్తగారు విశ్రాంతి తీసుకుంటున్నారు అరె ఏమిటీ ఆశ్చర్యం అత్తంటి విసుక్కొనే సుజిత ఇలా పరిచర్యలు చేస్తోంది అఫ్‌కోర్స్ తన తల్లి అందరు తల్లుల్లాంటిది కాదు అందరు తల్లులు బిడ్డలకు ఒకసారి జన్మనిస్తే ఈ తల్లి (పార్వతమ్మ) తనకు రెండో సారి ప్రాణం పోసింది అని అనుకుంటున్న మదు మనస్సు గతంలోకి జారుకుంది నెమ్మదిగా

మదుసూదనరావ్‌కు చిన్నప్పుడే తండ్రి పోయాడు తల్లి పార్వతమ్మే మదుకు సర్వస్వమై కష్టపడి కొడుకుని పెంచి చదువు చెప్పించింది డిగ్రీ చేతి కొచ్చిన ఎడాదిలోపే మదుకు ఓ బ్యాంకులో ఉద్యోగం వచ్చింది

మదుకు ఉద్యోగం రావడంతో తల్లి పార్వతమ్మ కష్టాలు గట్టెక్కాయి ఇప్పుడు కొడుక్కు ఓ మంచి అమ్మాయిని చూసి పెళ్ళి చేస్తే తన బాధ్యత గూడ పూర్తవుతుందనుకుంది పార్వతమ్మ అదే మాట రెండు మూడు సార్లు మదుతో అంటే ఓ స్మైల్ ఇచ్చి అక్కడినుంచి వెళ్ళిపోయేవాడు

ఇలా రెండు మూడేళ్ళు కాలం గడిపేశాడు ఒకరోజు మదు వాళ్ళ బ్యాంకులో ఒకమ్మాయి జాయినయింది పేరు సుజిత సన్నగా నాజూగ్గా ఉండే సుజిత కొద్దిగా కోపిష్టి మరికొద్దిగా గర్వం ఇంకొద్దిగా పట్టుదల కలది అనతికాలంలో నే మధు సుజితలు మంచి స్నేహితులయ్యారు కొంతకాలం అయ్యేసరికి ప్రేమికులయ్యారు మరికొంత కాల మయ్యేసరికి దంపతులయ్యారు

మదు వివాహం పార్వతమ్మకు చాల సంతోషం కలిగించింది కోడలు కాపురానికొచ్చిన మొదటిరోజే ఇంటి బాద్యతతో పాటు కొడుకు బాద్యతను గూడ అప్పగించింది ఓ నెల రోజులు గడిచాయి ఒకరోజు సుజిత ఇలా సణగటం మొదలు పెట్టింది ఎమిటండి!! ఇద్దరం సంపాదిస్తూ గూడ ఈ పెంకుటింట్లో అందులోనూ పాత కొంపలో ఉండవలసిన అవసరం మేమిటండీ!! ఎదైనా మంచి యిల్లు అద్దెకు తీసుకుందామండి! అంది సుజిత

సుజితా! ఇది మన సొంత యిల్లు ఇది పాత యిల్లు కావచ్చు నేను పుట్టింది ఈ యింట్లోనే ఈ యిల్లు పెంకుటిల్లయితేనేం ముందు బాగంలో ఒకవైపు వేపచెట్టు మరోవైపు బాదంచెట్టు పెరట్లో రెండు కొబ్బరి చెట్లు మూడు అరటి చెట్లు ఎప్పుడూ చల్లటి గాలినిస్తూ చిన్న పర్ణశాలలో వున్నామన్న అనుభూతి నిస్తాయి పైగా ఈ యిల్లంటే మా అమ్మకు చాల యిష్టం ఆవిడ మరే యింట్లోనూ వుండలేదు తెల్సా అన్నాడు మదు సమాదాన పరుద్దామన్న దోరణిలో

ఆవిడ నెవరు రమ్మన్నారు ఆవిడ రాకూడదనే నే కోరుకునేది ఆ ముసల్దాన్ని యిక్కడే వుండమనండి కావలిస్తే నెల కింత నిద్దాం అంది సుజిత మూతి ముప్పై వంకర్లు తిప్పుతూ

మదు మనస్సు చివుక్కుమంది ఎవిఁటి సుజీ నువ్వనేది చిన్నతనంలో నే తండ్రి పోతే తల్లి తండ్రి సర్వం తానై నన్ను పెంచి ఇంతవాణ్ణి చేసింది ఎన్ని కష్టాలు పడ్డదో ఎన్ని రోజులు పస్తున్నదో నీకేం తెల్సు నన్ను చూడకుండా ఆవిడ వుండలేదు ఆవిడని వదలి నేను నీతో వేరే యింటికిరాను అని ఖరాఖండిగా చెప్పాడు మదు పళ్ళు పటపట లాడిస్తూ

అంతే సుజిత మూతి ముడుచుకుని చరచరా లోపలికి వెళ్ళిపోయింది ఏవిఁటిది ప్రతి యింట్లోనూ అత్త ఆరళ్ళకు కోడలు తట్టుకోలేదు కాని ఈ యింట్లో కోడలే అత్తమిద ధ్వజం ఎత్తుతోంది కారణం తన తల్లి మంచితనం తనిచ్చిన అలుసు అనుకున్నాడు మదు మనస్సులో

రోజులు స్థబ్దతగా దోర్లిపోతున్నాయి సుజిత తన మొండి పట్టుదల వదల్లేదు ఒకసారి పార్వతమ్మకి వినబడేలా ఆ ప్రస్తావన తీసుకు వచ్చింది మదు దగ్గర మదు చెడామడా తిట్టి ఇంట్లోంచి బయట కెళ్ళిపోయాడు

రాత్రి లేటుగా ఇంటి కొచ్చాడు పార్వతమ్మ తలుపు తీసింది అన్నం వడ్డిస్తూ అసలు విషయం అడిగింది

నీ కోడలు సొంత యిల్లు వదలి అద్దెంట్లో కాపురం పెడదామంటోందమా అన్నాడు మదు

పోనీలేరా! కోడలుకి నేను మితో వుండటం యిష్టం లేదులావుంది నేనీ యింట్లోనే కాలం వెళదిసాను మిరెవెరా మంచి యిల్లు తీసుకుని కొత్త కాపురం పెట్టండి అని సలహా యిచ్చింది లోని బాదని దిగమింగుకుంటూ

అదేంటమ్మా! అదేం చెబుతే అదే చెయ్యాలా! పైగా నిన్ను చూడకుండా నే వుండలేను అన్నాడు

ఇదే వూళ్ళో వుంటాముకదురా! నీకు నన్ను చూడాలన్నప్పుడల్లా వద్దూ కాని నీ కోసం తన వాళ్ళని వదులుకొని వచ్చిన నీ బార్య కోరిక తీర్చటం నీ కనీస దర్మం అంటూ నచ్చచెప్పింది కొడుకు తల నిమురుతూ పార్వతమ్మ

నెల రోజుల్లో ఓ మంచి యిల్లు ఆఫీసుకు దగ్గరగా తీసుకుని కాపురం పెట్టాడు మదు సుజితకు తన మాట నెగ్గినందుకు పట్టరాని సంతోషం వేసింది

రెండు యేళ్ళు యిట్టే గడిచిపోయాయి ఒకరోజు మదు కొద్దిగా జ్వరంగా వుందని ఆపీసుకు సెలవు పెట్టి యింట్లో విశ్రాంతి తీసుకుంటానన్నాడు సుజిత ఒక్కర్తే ఆఫీసు కెళ్ళింది సాయంత్రం ఆపీసు నుండి వస్తూ ప్రక్క సందులో వున్న ఓ డాక్టరుగారిని వెంట బెట్టుకొచ్చింది మదు చలితో ఒణికిపోతున్నాడు నడుంనొప్పితో మూలుగుతున్నాడు డాక్టరుగారు పరీక్షించి మందులు వ్రాసిచ్చి ఓ యింజక్షన్ చేశారు బాగా విశ్రాంతి అవసరం పేషెంట్‌కు అని చెప్పి వెళ్ళిపోయాడు రెండు రోజుల్లో జ్వరమైతే తగ్గింది కానీ నీరసం తగ్గలేదు వారం రోజుల్లో నీరసం గూడ సద్దుకుంది మళ్ళీ వారం తిరిగేసరికి మళ్ళీ జ్వరం నడుంనొప్పి తిన్నది అరక్కపోవటం వాంతి చేసుకోటం

సుజితకు ఈసారి బయం వేసింది వెంటనే అత్తగారి యింటికి వెళ్ళి మదుకు సుస్తీగా వుందని చెప్పి తీసుకొచ్చింది డాక్టరుగారు వచ్చి కంగారు పడనవసరం లేదు ఇదో రకం జ్వరం అని చెప్పి మందిచ్చి వెళ్ళాడు

పార్వతమ్మ మదు మంచం దగ్గరే కూర్చుని సేవలు చేసేది వారం రోజుల్లో కోలుకున్నాడు మదు

పది రోజులు తిరిగేసరికి మళ్ళీ నడుంనొప్పి అంటూ మెలికలు తిరగసాగాడు మదు జ్వరం గూడా వుంది డాక్టరుగారు ఈసారి అనుమానంవచ్చి రక్త పరీక్ష చేయించి ఏవో మందులు వ్రాసిచ్చి కొన్ని రోజులు వాడి చూడమన్నాడు మందులు వాడుతున్నాడు మదు మదు మొహం రోజు రోజుకూ పీక్కుపోతోంది ఎం తినాలన్నా సయించట్లేదు తిన్నా వెంటనే వాంతి చేసేసుకుంటున్నాడు సుజిత పార్వతమ్మలకు మనసు మనస్సులో లేదు మదుకు ఆరోగ్యం చేకూర్చమని వెయి దేవుళ్ళకు మొక్కుకుంటున్నారు మందులు ఇంజక్షన్‌లతో మదు ఉక్కిరి బిక్కిరై పోతున్నాడు అసలు రోగం ఏవిఁటో అంతుపట్టట్లేదు ఉన్నట్టుండి మదుకు ఓ రోజు యూరినరి ప్రాబ్లం వచ్చింది దాంతో కంగారు మరి ఎక్కువయింది డాక్టరుగారు వచ్చారు ప్రాబ్లం ఎవిఁటని మదుని అడిగాడు యూరిన్ కొద్దిగానే వస్తుతోంది బ్లాడర్ ఉబ్బినట్టు అనిపిస్తోంది ఎంటో నా కెందుకో చాల బయంగా వుంది అన్నాడు మదు దీనంగా మొహం పెటి

డాక్టర్‌గారు యూరిన్ టెస్టులన్నీ చేయించారు ఏం ఫర్వాలేదు ఈ మందులు వాడండి తగ్గిపోతుంది మరేం భయపడ నవసరం లేదు అంటూ ఆ ముగ్గురికీ ధైర్యం చెప్పాడు మదు రోజూ మందుల్ని క్రమం తప్పకుండా వాడుతున్నాడు రోజు రోజుకూ బలహీనపడిపోతున్నాడు ఓ వారం తర్వాత యూరిన్ అసలు పడట్లేదు అంటూ గగ్గోలు పెట్టసాగాడు సుజిత పార్వతమ్మలకు ఖంగారు మరీ ఎక్కువైంది డాక్టరుగారు వచ్చారు పరిస్థితి అంతా విని ఇహ లాభం లేదు మధుని హైద్రాబాద్ తీసుకెళ్ళండి అక్కడ డాక్టర్ ధార్ అని నాకు తెలిసిన ఓ పెద్ద డాక్టరు వున్నారు ఆయనకు ఉత్తరం వ్రాసిస్తాను ఆలస్యం చేయద్దు అంటూ ఓ వైట్ పేపరుమీద బరబరా వ్రాసి సుజిత చేతికి ఆ వుత్తరం యిచ్చి

మీరేం ఖంగారు పడకండి ఆయన ఇలాంటి కేసుల్ని జాగ్రత్తగా డీల్ చేస్తాడని ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు డాక్టరుగారు

ఆ రాత్రికే హైదరాబాద్ బయలు దేరారు ముగ్గురూ తెల్లారేసరికి హైద్రాబాద్ చేరుకుంది రైలు డా దార్ ఆస్పత్రి ఎక్కడెక్కడని వెతుక్కుంటూ ఆస్పత్రి చేరుకున్నారు

ఆస్పత్రిలో జేర్చండి ఇన్వెస్టిగేట్ చేయించాలి అని చెప్పారు డా దార్ ఆ వుత్తరం చదివి పక్కన పెడుతూ

ఆస్పత్రిలో, ఓ ప్రత్యేకమైన రూంలో మదుని చేర్చారు యూరిన్ టెస్ట్ బ్లడ్ టెస్ట్ ఇంకా ఏవేవో పరీక్షలు చేశారు వాటి రిపోర్టులన్నీ చూసిన డా దార్‌కు అసలు సమస్య ఏమిటో తెలిసిపోయింది

సుజితను పిలిచి అసలు సంగతి చెప్పేశారు డా దార్

మీవారికి రెండు మూత్రపిండాలు చాలవరకు చెడిపోయాయి వెలైనంత త్వరలో వాటిని తీసెయ్యాలి అంతేకాదు ఎవరిదైనా ఒకరి మూత్రపిండం ఒకటి తెచ్చి అమర్చాలి లేకుంటే యూరిన్‌లో వుండే మలినమంతా రక్తంలో చేరిపోతుంది మనిషి బ్రతకటం కష్టం

సుజితకు ఒక్కసారిగా గుండె ఆగినంత పనయింది

అయితే త్వరగా అపరేషన్ చెయ్యండి సార్ కావాలంటే నా కిడ్నీ ఒకటి డొనేట్ చేస్తాను మా వారిని ఎలాగయినా బ్రతికించండి ప్లీజ్ అంటూ ప్రాదేయ పడింది సుజిత గద్గద స్వరంతో ముకుళిత హస్తాలతో

మేం ఉన్నది పేషెంట్‌లని బ్రతికించటానికే కదమ్మా!" కాకపోతే మధుకు నీ కిడ్నీ సరిపడదు అతని తల్లి వైపు వారెవరైనా కిడ్నీ యివ్వటానికి ముందుకొస్తే మంచిది అదయినా సరిపోతుందో లేదో పరీక్షలు చేయించిగాని చెప్పలేం కిడ్నీ మార్చేలోపు వారానికి రెండుసార్లు డయాలసిస్ చెయ్యాలి మధుకు దీని కంతటికీ చాలా ఖర్చవుతుంది ముందుగా చెప్పడం నా బాధ్యత కదా!! అన్నాడు డాక్టర్ ధార్

సుజిత పార్వతమ్మ దగ్గరికి వెళ్ళి విషయాలన్నీ చెప్పి బోరున ఏడ్వసాగింది పార్వతమ్మకు కొడుకు మూత్రపిండాలు చెడిపోయాయి అన్న వార్త వినేసరికి కాళ్ళ క్రింద భూమి కంపించినట్లనిపించింది కొంచెం సేపట్లో షాక్ నించి తేరుకుని ధైర్యం కూడదీసుకుని కోడలిని ఓదార్చింది

ఏడవకు సుజితా నా కొడుక్కి నా కిడ్నీ యిస్తాను అది వాడికి తప్పకుండా సరిపోతుంది వాడు త్వరలో మామూలు మనిషవుతాడు అంటూ కోడలికి ధైర్యం చెప్పింది పార్వతమ్మ

ఆ మాటలు వింటూంటే సుజిత కళ్ళకి పార్వతమ్మ కొండంత ఎత్తు ఎదిగి పోయినట్లనిపించింది ఇప్పుడు సుజితకు కొండంత ధైర్యం వచ్చింది అత్తగారి కాళ్ళు కళ్ళ కద్దుకొంది పార్వతమ్మ కోడలిని గుండెలకు హత్తుకుంది

డాక్టర్ దార్ పార్వతమ్మ కిడ్నీలు ఆరోగ్యంగా వున్నాయో లేదో అవి కొడుక్కి సరిపోతాయో లేదో పరీక్షలు జరిపారు సుజిత తన తండ్రికి ఫోన్ చేసి విషయమంతా చెప్పి డబ్బుతో సహా హైద్రాబాద్ రమ్మంది

వారం రోజుల్లో ఆపరేషన్ అయిపోయింది తల్లీ కొడుకులకేం ఫర్వాలేదు అని డా దార్ చెప్పేసరికి సుజిత ఆమె తండ్రి ఆనందానికి అవధుల్లేవు సుజిత అయన్ని చూస్తాను సార్ అంది డాక్టరుతో ఓ పదిహేను రోజుల దాకా ఇద్దరినీ ఇంటెన్సివ్ కేర్‌లో వుంచుతాం మీరు వాళ్ళిద్దరి దగ్గరకి వెళ్ళరాదు కావలిస్తే ఆ గ్లాస్ డోర్‌లోంచి వాళ్ళని మీరు చూసుకోవచ్చు అంటూ వెళ్ళి పోయాడు డాక్టర్

రెండు నెలల తర్వాత మదుని హాస్పటల్ నుండి డిశ్చార్జి చేశారు - నెలకోసారి వచ్చి చెకప్ చేయించుకోవలసిందని చెప్పాడు డాక్టర్ దార్

మెలకువ వచ్చి చూసేసరికి తాను తన స్వంత యింట్లో వుండటం ప్రక్కనున్న మంచం మీద తల్లి పడుకొని వుంది సుజిత కాళ్ళు వత్తుతూ పరిచర్యలు చేస్తూ కనబడటం మధుకు చెప్పలేనంత ఆనందం కలిగించింది మదు నిద్ర లేచాడని చూసి సుజిత అతని దగ్గరికి వచ్చింది మనం గూడా అత్తగారితో ఇక్కడే వుందామండి అంటున్న సుజిత కళ్ళల్లో అశ్రుబిందువులు స్పష్టంగా కనిపిస్తున్నాయి మదుకి □



# భారతి

సాహిత్యాభిమానులకి చక్కటి అవకాశం!

## చందాదారుగా చేరండి!

## ఆదా చేయండి రు 11 దాకా!

ఏజంటు ద్వారా భారతి సంవత్సరం చందా రు. 48.

పోస్టు ద్వారా అయితే భారతి సంవత్సరం చందా రు. 51.

కాని మీరు రు 40 ముందుగా ఒకేసారి చెల్లిస్తే మీకు ఒక సంవత్సరం పాటు భారతి అందుతుంది!

★ అంటే రు. 11 దాకా ఆదా చేసుకో వచ్చునన్న మాట!

రు. 40 చందా మొత్తాన్ని "ఆంధ్రపత్రిక" (గాంధీనగర్, విజయవాడ)కి మని ఆర్డరు ద్వారాగాని, డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని పంప ప్రార్థన. ఏజెంటుకి గాని ఇతరులకి గాని చెల్లించవద్దని మనవి.

ఈ క్రింది కూపనుని నింపి, డిమాండు డ్రాఫ్టుతో గాని, మనీ ఆర్డరుతో గాని జతపరచి పంపాలని మనవి.

★ మీరు ఉన్నచోట ఏజెంటు ఉంటే ఏజెంటు ద్వారా భారతి సరఫరా చెయ్యబడు తుంది.

★ ఏజంటు లేకపోతే భారతి మీకు పోస్టులో అందుతుంది!

★ చందా మొత్తాన్ని ఇతరులకి ఇవ్వరాదు! నేరుగా ఆంధ్రపత్రికకే చెల్లించాలి!




---

నేను "భారతి" మాస పత్రికకు చందాదారునిగా చేరదలుచు కున్నాను. చందా పైకము రు. 40 డి. డి./ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.

పేరు: ______________________

చిరునామా: ______________________

______________________

చందాదారుని సంతకం

గ్లాక్సో కానుక

# తక్షణ శక్తిదాయక అద్వితీయ పానీయం జిల్లనిపించే నారింజ రుచి గలది




ఎక్కువ ధరైన పంచదార కలపనవసరం లేదు

గ్లూకోజ్ చేరిన కొత్త గ్లూకోన్-సి, మీ బిడ్డను ఉరుకుల పరుగుల ఉత్సాహంతో నింపి ఉంచే, అనుకూలమైన సత్వర శక్తిదాయక ఆహారం.

ఇది, పిల్లలలో పళ్లు, ఎముకలు, శరీర ధాతువుల పెంపుదలకు అత్యవసరమైన విటమిన్ సితో పరిపుష్టమైనది.

ఒక గ్లాసు చల్లని ఐస్ వాటర్‌లో నాలుగు టీ స్పూన్ల గ్లూకోన్-సి కరిగించి, జిల్లనిపించే నారింజ రుచిగల ఉల్లాస పానీయాన్ని తయారుచేయండి, రోజుకు రెండుసార్లు మీ బిడ్డకివ్వండి.






# గ్లూకోన్-సి

GLL 1174 R

# ఇప్పుడు మీకోసం తెచ్చాం
# కొత్తరుచులను మేళవించిన క్రీమ్‌బిస్కెట్లు

ఇలాచీ క్రీమ్ బిస్కెట్లు
ఆరెంజ్ క్రీమ్ బిస్కెట్లు
పైనేపిల్ క్రీమ్ బిస్కెట్లు
చాకలెట్ క్రీమ్ బిస్కెట్లు




## అసోకా
## బిస్కెట్లు




రుచి చూడండి ఆనందించండి అసోకా బిస్కెట్లతో కలిసి మెలిసి ఉండండి

TARA/AB/34/85